# మౌనశంఖం

(శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి' - ఒక పరిశీలన)

జూపల్లి ప్రేమ్‌చంద్

లిటరరీ మీట్
అనంతపురం – 515 004

సెప్టెంబరు, 1987
ప్రతులు : 1000

వెల : రు. **25-00**

ముఖచిత్రం : జి. వి. రమణ (ఉదయం, హైదరాబాద్

ముద్రణ : శ్రీ క్రాంతి ప్రింటింగ్ ప్రెస్
షరాఫ్ బజార్ - తెనాలి.

ప్రతులకు : జె. ప్రేమ్‌చంద్, లిటరరీ మిత్
ఇంటి నెం : 2/202, 3 వ రోడ్డు,
అనంతపురం - 515 004

# నా కోసం

మార్గ దర్శకత్వాన్ని నిర్వహించి ఆత్మీయులు
డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
(రీడర్, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం)
ఎన్నో విషయాలను విప్పి చెప్పిన పెద్దలు
శ్రీ యస్. నారాయణ
(ఆంగ్లోపన్యాసకుడు, సాయిబాబా జాతీయ జూనియర్ కళాశాల, అనంతపురం)
ఆత్మీయంగా ముఖచిత్రాన్ని చిత్రించి మిత్రుడు
శ్రీ జి. వి. రమణ (ఉదయం, హైదరాబాద్)
నిత్యం నా బద్ధకాన్ని వదిలిస్తూ ప్రోత్సహించే
లిటరరీ మిత్రులు (అనంతపురం)
ఈ గ్రంథానికి ఎం. ఫిల్. పట్టా నిచ్చిన (జనవరి. 1986)
శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం (అనంతపురం)
ఈ గ్రంథాన్ని గుర్తించి ముద్రణ కోసం ఆర్థిక సహకారాన్ని అందించిన
తెలుగు విశ్వవిద్యాలయం (హైదరాబాద్)
నా అభివృద్ధే ఆశయంగా కలలు కనే నాన్నగారు, అమ్మగారు
శ్రీ జె. వి. అప్పారావు శ్రీమతి జె. వి. పద్మావతి
ఆర్థికంగా ఆదుకున్న మామయ్య
శ్రీ నేరెళ్ళ తిరపతయ్య (మంగళగిరి)
నన్ను నీడలా ఆదుకునే నా శ్రీమతి
శ్రీమతి జె. వి. రాజేశ్వరి
అందరినీ మించి అపారమైన స్నేహామృతాన్ని కురిపించే మిత్రుడు
శ్రీ కె. యం. రాయుడు

పుస్తకాన్ని అందంగా తీర్చిదిద్దిన
శ్రీ కాంతి ప్రింటింగ్ ప్రెస్, (తెనాలి)

-కృతజ్ఞతలు

# ఒక మాట

జీవితాన్ని అంగీకరించి జీవితాన్ని ఏకళకైనా పరమావధి చేయాలన్నదే మా ప్రయత్నం. జీవితాన్ని అంగీకరించటమంటే కనిపించే అన్ని వైరుధ్యాల్ని పైపై తనాన్ని, అసమానతల్ని అంగీకరించటమనికాదు. జీవితం వ్యక్తీకరణలోని వైవిధ్యం వైరుధ్యాల వెనక ఉన్న అసలు నియమాల్ని పరిశీలించే చిత్తశుద్ధినీ, నిజాయితిని సాహిత్యంలో, జీవితంలో అన్వేషణకు మూలం చేయాలన్నదే మా ప్రయత్నం. పిడికెడు మిత్రులతో లిటరరీ మీట్‌ను మొదలు పెట్టాం. ఏ విధమైన ఆడంబరాలు, అధికారాలు, సంస్థాగత ఎన్నికలు, రిజిస్ట్రేషన్లు లేకుండా ఉత్సాహంగా ఓ మూల కలిసి సాహిత్యంలోని విభిన్న ప్రక్రియల్ని సమాలోచించే ప్రయత్నం చేశాం. సాహిత్యం ఊపిరిగా, అన్వేషణ ప్రాణంగా ఈ సాహిత్యం క్రియాశీల ప్రయాణం కొనసాగుతోంది. ఈ పయనంలో అప్పుడప్పుడు ప్రేరణల్ని, పరిశోధనల్ని మిత్రుల మధ్యనుంచి ఇంకా పదిమంది మిత్రుల అనుభవాల్ని, అనుభూతుల్ని కలుసుకొనే దిశలో, వారి ప్రతిస్పందనల్ని పంచుకొనేఅభిలాషతో ప్రచురణనుకూడాస్వీకరించాం. అందులో భాగంగానే మిత్రుడు ప్రేమ్‌చంద్ 'మౌన శంఖం' (శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి'— ఒక పరిశీలన) ప్రచురించటం జరిగింది.

ప్రేమ్‌చంద్ గారు రచయితగా సాహిత్యానికి కొత్త వ్యక్తేమీకాదు. ఇప్పటికే కవిత్వాలకీ, కథలకు సంబంధించి బహుమతుల్ని అందుకున్నారు. పత్రికలలో తరచు కనిపిస్తుంటారు. విద్యార్థి దశనుంచీ సాహిత్య నాటకరంగాల్లో పాల్గొన్నారు. పలువురి ప్రశంసలు అందుకొన్నారు. ఎప్పుడూ ఏదో ఒక సందడి చేయందే తోచని వ్యక్తి. విభిన్న ప్రక్రియలలో పరిచయాన్నీ, పరిశోధనను పెంచుకోవాలనే ఆసక్తి, అభిలాష, తపన గాఢంగా వున్నవ్యక్తి.

త్వరలో మూడు కథాసంకలనాలు కూడా వెలువరిస్తున్నామని చెప్పటానికి సంతోషిస్తున్నాం. ఇదంతా మూడు పూలు, ఆరుకాయల అభివృద్ధిగా మీకు చెప్పటం మా ఉద్దేశ్యంకాదు. కానీ నూరుపూల వికసన వేయిభావాల సంఘర్షణ ప్రధాన నేపథ్యంలోంచి విభిన్న వ్యక్తిత్వాల, భావాల అన్వేషణను సహితం ఈ రూపంలొ 'లిటరరీ మీట్' మీకు పరిచయం చేస్తోంది. ఈ ప్రయత్నాన్ని ఆహ్వానిస్తారని ఆశిస్తూ ...

14-8-87

లిటరరీ మీట్
అనంతపురం

శ్రీరంగం నారాయణబాబుకు

# చంద్రునికో నూలుపోగు

ఒక మహాకవి—
కళ్ళల్లోంచీ రక్తాశ్రువులు రాల్తుంటాయి
కనుకొలకుల్లోంచీ కరుణరసం జాలువారుతుంది

కఠిన శిలా శాసన లోకంలో—
శిలువను ధరించిన కంటక కిరీటధారి క్రీస్తు
పాషాణ చషకాన్ని స్వీకరించిన సోక్రటీసు
ఎవరైతేనేం—
తలక్రిందులుగ తపస్సుకు ఉపక్రమించి
లోకానికి అభిముఖంగా
క్రాంతినీ కాంతినీ ఆవాహన చేసినవారే

అందుకే క్రాంత దర్శి—
కత్తుల మొనమీద పంచన అంచుల కింద
ద్విముఖ మానవ జీవితాన్ని
వ్యక్తా వ్యక్త వైరూప్య చిత్రాల్ని
నగ్నంగా ఆవిష్కరిస్తాడు
ఉష్ట్రపక్షులకు తూర్పుదిక్కు నిర్దేశిస్తాడు

ఒక ఖడ్గ చాలనంతో—
దిగంతరేఖ రెండుగా చీలిపోతుంది
ఒక పర్జన్య గర్జనతో—
దిక్కులు ప్రతిధ్వనిస్తాయి
ఒక మహాకవి నిష్క్రమణంతో
దిక్కులేక లోకం—
హృదయ ధగ్ధంగా వర్షిస్తుంది

# నా మాట

శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి' మీద చెప్పుకోదగ్గ విమర్శ రాలేదు. సి. నారాయణరెడ్డిగారు (ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు ప్రయోగములు), ఎ. సోమసుందర్‌గారు (రుధిరజ్యోతిర్దర్శనం) స్పృశించినా అవీ అసంపూర్ణమే. గుడిహాళం రఘునాథంగారు తమ ఎం. ఫిల్. పట్టాకోసం ఈ కావ్యాన్నే స్వీకరించారు. ఆ విషయం నేను పరిశోధనలో గొంతు దాకా దిగేంతవరకు తెలియలేదు.

నారాయణబాబు సాహితీ జీవితాన్ని మొదటి ప్రకరణంలో పరిచయం చేశాను. కవి సాహితీ జీవితాన్ని గురించి విషయం అందినంతమేరకు చెప్పాను. ఇందుకు వివిధ పత్రికల్లోని అనేక వ్యాసాలు తోడ్పడినా ప్రధానంగా సోమసుందర్ గారి 'రుధిరజ్యోతిర్దర్శనం', గుడిహాళం రఘునాథం గారి 'శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి'—కావ్యపరిశీలనం' గ్రంథాలపై ఆధారపడాల్సి వచ్చింది. నారాయణబాబుపైవున్న వ్యక్తిగత వివాదాల జోలికి వెళ్ళలేదని (ఉదా॥సంపంగితోట అనువాద వివాదం) సవినయంగా తెలియజేస్తున్నాను.

అఖండమైన జ్ఞానాన్ని విభజిస్తూపోతే మతం, తత్త్వ శాస్త్రం, అర్థశాస్త్రం రాజనీతిశాస్త్రం, సామాజిక శాస్త్రం తదితర శాస్త్రాలుగా విడిపోతుంది. అయితే సమాజంలో వివిధ రంగాలమధ్య పరస్పర సంబంధం విడదీయరానంతగా కలసిపోయి ఉంటుంది. చలనంలో ఉన్న సమాజ అభివృద్ధి, క్షీణతల వెలుగునీడల చైతన్యరూపమే సాహిత్యం. ఈ చైతన్యంతోకూడిన వివిధ జ్ఞానాల సమాహార రూపమే సాహిత్యం.

20 వ శ॥ తొలి దశాబ్దాలను మనదేశంలో ప్రాచ్య పాశ్చాత్య భావాల సంఘర్షణా దశాబ్దాలుగా భావించవచ్చు. ఈ సంధియుగం ప్రపంచ మానవుడ్ని సన్నిహితుడ్ని చేసింది. ఈ సన్నిహితత్వం సాంస్కృతిక కళారంగాల్లో ప్రతిఫలించింది. ప్రాంతీయ జాతీయ అంతర్జాతీయ సరిహద్దులు చెరిగిపోయి ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక ప్రభావాలు అనివార్యంగా మానవ జీవితంలో సాహిత్య కళారంగాల్లో ప్రవేశించాయి. ఇవి భారతీయ, తెలుగు సాహిత్యంలో కూడా చోటుచేసుకున్నాయి.

పాశ్చాత్య విజ్ఞాన ఫలితంగా నూతన ఆలోచనా విధానం ప్రవేశించింది. అంతవరకూ భారతీయ, తెలుగు కవిత్వంలోలేని నూతన వస్తు స్వీకారానికి దారి

తీసింది. మానవుడు సామాజిక పరిణామక్రమంలో కృత్రిమంగా కల్పించిన ధనిక దరిద్రభేదాన్నీ, మానసిక, భావ దారిద్ర్యాల్నీ, కర్మ సిద్ధాంతాల్నీ, వాటి దుష్పరిణామాల్నీ,సామాజికరుగ్మతల్నీ అభ్యుదయకవిత్వంనిరసించింది. భావకవిత్వంలో ఈ ప్రయత్నంలేదు. ఒక్క అభ్యుదయ కవితోద్యమంతోనే సంపూర్ణ మానవ జీవితాన్ని ఆవిష్కరింపజేసే ప్రయత్నం మొదలయ్యింది. "రుధిరజ్యోతి" కావ్యంలో ఈ ప్రయత్నం స్పష్టంగా కన్పిస్తుంది. నారాయణబాబుభౌతిక, మానసిక పరిస్థితుల్లో రెండిట్లో మార్పును ఆశించాడు. భౌతిక, మానసిక దారిద్ర్యాలను రెండిట్నీ పారద్రోలటానికి ప్రయత్నించాడు. దాని ఫలితమే ఆయన అభ్యుదయ అధివాస్తవిక కవిత్వం. అంతవరకూ తెలుగు కవిత్వంలోవున్న శబ్దార్భటినీ, ఛందస్సుల సర్వపరిష్వంగాన్నీ, వ్యాకరణాల సంకెళ్ళనూ కృత్రిమ ఊహాత్మక కవి సమయాలను ఆయన నిర్ద్వంద్వంగా తిరస్కరించాడు. భావకవిత్వంలోని అసమగ్రతను ఖచ్చితంగా ఖండించాడు. నారాయణబాబు కవిత్వంలో ప్రధానంగా నూతన భాషనూ, భావాన్నీ, వస్తువునూ, రూపాన్నీ (Econamy of words) స్వీకరించాడు. అందుకు అవసరమైన పాశ్చాత్య కళా ఉద్యమాలను కళ్ళకద్దుకున్నాడు. తనదైన వ్యక్తిత్వంతో నూతన మార్గాన్ని అన్వేషించాడు. మానవ జీవితంలోని వైవిధ్యాన్ని నిశితంగా దర్శించాడు. ఏ అసమానతలూలేని సంపూర్ణ మానవుడ్ని ఆశించి తన కవిత్వంలో ఆవిష్కరించాడు. తర్వాత కవులకు ప్రత్యక్షంగా కాకున్నా పరోక్షంగా మార్గదర్శకుడయ్యాడు. ఈ అంశాలనన్నింటినీ నా అవగాహన మేరకు పరిశీలించాను.

ప్రధాన అంశాలను చర్చిస్తున్నప్పుడు తత్సంబంధమైన అనేక ప్రశ్నలు తలెత్తాయి (ఉదా॥ కవీ శ్రోత సంబంధం, కవిత్వం-ఆత్మకళాభ్యాసం, ఆత్మ కళాప్రక్రియ) ప్రధాన అంశానికి అవాంతరంగా అన్పించినా వాటి ప్రాధాన్యాన్ని బట్టీ అక్కడే దీర్ఘంగా చర్చించాను. ఈ అంశాలు ఇంకా లోతుగా ఆలోచించి విపులంగా పరిశీలించాల్సినవి.

నేను పరిశోధనకు తీసుకున్న అంశం "రుధిర జ్యోతి" కావ్యానికే పరిమితం. కనుక నారాయణబాబు ఇతర రచనలను స్వీకరించలేదు. నా ఈ ప్రయత్నంలో అనేక లోపాలు వుండవచ్చు. సహృదయంతో స్వీకరించి మన్నిస్తారని ఆశిస్తున్నాను.

జూపల్లి ప్రేమ్‌చంద్

# ఇదీ వరస



---

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రితం

---

## "వం వేం కం"

భావకవిత్వం కొనవూపిరితో ఈడ్చుకుంటున్న దశలో మేల్కొని, దాన్ని ధ్వంసం చేసి నూతన కవితా వ్యవస్థకు పునాదులు వేసిన వారు శ్రీశ్రీ, నారాయణబాబు, శిష్లా, పఠాభి, మొదలైనవారు. యాభయ్యయిదేళ్ళ క్రితం జరిగిన ఈ తిరుగుబాటులో యీరోజు అధిక సంఖ్యాకులైన కవులకు మార్గ దర్శక మైంది శ్రీశ్రీ పరపడే. తక్కినవాళ్ళలో శిల్ప ప్రాధాన్యవాదులు నారాయణబాబును మెచ్చుకుంటున్నారు. మిగిలిన ఇద్దర్నీ చారిత్రక పరిమి తులతో గౌరవిస్తున్నారు. ఇందుక్కారణం శిష్లా, పఠాభిలు భావ కవిత్వం మీద తిరుగుబాటు చేసి, దానికి ప్రత్యామ్నాయంగా పటిష్టమైన సామాజిక వ్యవస్థను అందించక పోవడమే. నారాయణబాబు మార్క్సిజం వైపు మొగ్గు చూపాడు. దీనికన్నా మించి ఈయన సర్రియలిస్టు, ప్రయోగవాది, సామాజిక వాస్తవికతను స్వీకరించడమే గాక, దానికి అనుకూలమైన శిల్పాన్ని అధిక సంఖ్యాకులకు వస్తువును చేరవేయగలిగిన దాన్ని స్వీకరించడం కూడా అవసరం, శిల్పం రచయితకు పాఠకుణ్ణి నిర్ణయించి పెడుతుంది.

వెనకటి రోజుల్లో పోతన కున్నంత మంది పాఠకులు శ్రీనాథునికి లేరు. మనుచరిత్రను అర్థం చేసుకోగలిగిన వాళ్ళందరూ ఆముక్తమాల్యదను అర్థం చేసుకోలేరు. అందుకు వాళ్ళ శిల్పమే కారణం. నిజానికి మనుచరిత్రలో కన్నా ఆముక్తమాల్యదలో ప్రజా జీవిత వర్ణన పుష్కలంగా వుంది. కాని రాయల శిల్ప ప్రౌఢి పాఠకుల్ని దూరం చేసుకొంది.

మధ్యయుగాల్లో రాయల పరిస్థితే, ఆధునిక కాలంలో నారాయణబాబుకు యేర్పడింది. పాఠకులు యీ యిద్దర్నీ తిరస్కరించ లేదు కానీ, పండితులకే పరిమితం కావలసి వచ్చింది: రాయల్ని సామాన్య పాఠకుడు వేదం వారి (వ్యాఖ్యాత) సహాయం లేకుండా సమీపించ లేడు. నారాయణబాబు విషయంలో కూడా పాఠకులు వ్యాఖ్యాత కోసం ఎదురు చూస్తున్నారు. శ్రీశ్రీలో కూడా చమత్కార ప్రీతి సర్రియలిస్టు ధోరణి వున్నా వాటిని అంతగా పట్టించుకోలేదు పాఠకులు.

ప్రేమ్‌చంద్ కన్నా ముందే కొంతమంది నారాయణబాబును వ్యాఖ్యానించారు, విశ్లేషించారు. సి నా. రే, వెల్చేరు వంటి సాహిత్య చరిత్రకారులు నారాయణబాబును పరిచయం చేశారు. సోమసుందర్ 'రుధిర జ్యోతిర్దర్శనం' ఆముక్తమాల్యదకు వేదంవారి వ్యాఖ్యానం లాంటిదే. పాఠకుల్ని దూరంగానే వుంచుతుంది. ప్రేమ్‌చంద్ నారాయణబాబును సాధ్యమైనంత సులభంగా వ్యాఖ్యానించ డానికి చేసిన ప్రయత్నమే మౌనశంఖం.

విశ్వ విద్యాలయాల్లో ఎం.ఫిల్ పట్టాకోసం కృషిచేసే విద్యార్థులు నారాయణబాబును ఎన్నుకోవటం సాహసమే. సాహసించిన తర్వాత దాన్ని లైబ్రరీలో వ్రాత ప్రతిగానే వుంచకుండా ప్రచురించటం ధైర్యమే. ప్రేమ్‌చంద్ ధైర్యం చేయడానికి ఈ 'మౌ శంఖం' తగిన పుస్తకమే.

నారాయణబాబు కవితా సిద్ధాంతాన్ని, ఆయన కవిత్వంలో వస్తుశిల్పాన్ని విశ్లేషించటం ఈ పుస్తకంలో ప్రేమ్‌చంద్ చేసిన పని. ఈ పుస్తకమంతా చదివిన తర్వాత ప్రేమ్‌చంద్ నారాయణబాబు వెంట నడిచిపోయినట్టు తోస్తుంది. నారాయణబాబు మార్క్సిస్టు కన్నా మించిన సర్రియలిస్టు. ఈ రెంటినీ ఒకేసారి కౌగలించుకోగలడు. సర్రియలిస్టు సహజంగానే శిల్ప ప్రాధాన్యవాది అవుతాడు. 'ఆయన మార్క్సిజమ్, సర్రియలిజమ్ అన్న రెండు విభిన్న వాస్తవాల్ని మేళవించి గాఢమైన కవితా సాధన చేసాడు.'' అన్నాడు ప్రేమ్‌చంద్ (పుట 32) ఈయన విమర్శలో కూడా ఈ రెండు వాస్తవాల్ని సమానంగా సమర్థించాడు. నారాయణబాబు కవిత వస్తువు కన్నా సర్రియలిస్టు ధోరణే ప్రాధాన్యం వహిం

చిన విషయం యీవిమర్శ గ్రంథమే నిరూపిస్తున్నది. 'రుధిరజ్యోతి' లోని వస్తు చర్చ 35 పుటల్లోనూ, శిల్ప చర్చ 85 పుటల్లోనూ సాగింది. సర్రియలిజంను గురించి చర్చిస్తూ వ్యక్తావ్యక్తాన్ని విశ్లేషిస్తూ. ప్రేమ్‌చంద్ ఆధారాలను చూపటంలో మౌలికతనే పాటించాడు. ఒక్కొక్క కవితను స్వీకరించి, దాని చారిత్రక ప్రాధాన్యాన్ని వివరించి, ఖండికల్ని ఉదహరిస్తూ వాటిలోని ప్రతీకార్థాల్ని వెలికితీసిన పద్ధతి యీ పుస్తకానికి విలువ తెచ్చింది. నారాయణబాబు కవితలోని పౌరాణికతా నిరూపణ, కథానిర్మాణ శిల్ప దర్శనం మొదలయిన అంశాలు పాఠకుణ్ణి నారాయణబాబు దగ్గరికి తీసుకుపోతాయి. భగత్‌సింగ్ మీద రాసిన రెండు కవితల్ని పరిణామ దృష్ట్యా వివరించిన తీరు విమర్శకుని లోతును తెలుపుతుంది.

కవితో విమర్శకుడు పూర్తిగా మమేకం అవుతున్నాడనడానికి కవి కవితలకు పెట్టిన శీర్షికల్నే ఈయన అధ్యాయాలకు పెట్టుకోవడం సర్రియలిజమ్‌కు సంబంధించిన ఆంగ్ల సమాచారాన్నివ్వడం కవి బొమ్మను ఆప్యాయంగా ముద్రించడం మొదలైన అంశాలు నిదర్శనాలు.

21 పుటలో నారాయణబాబు వంశ వృక్షాన్నిచ్చాడు ప్రేమ్‌చంద్. ఆరో అధ్యాయంలో ఆయన ప్రభావం తర్వాత కవులమీద ఎలావుందో నిరూపించాడు. దేనికీ చెందమని భావించేవాళ్ళకు ఇది సమాధానం.

ఇలా ఎన్నో విశేషాలు యీ పుస్తకంలో వున్నా, యింకా ఏదో అస్పష్టత, పాఠకునికి కవి ఎక్కడో చెయ్యిజారి పోతున్నట్టు అన్పిస్తుంది, కారణం కవే ననిపిస్తుంది. యువకుడైన ప్రేమ్‌చంద్ తన శక్తి కొలది పాఠకుణ్ణి రచయిత దగ్గర వుంచగలిగాడు.

ఈ పుస్తకంలో మొదట కొంతదూరం సర్రియలిస్టు భాషలో రాయటానికి ప్రయత్నించాడు ప్రేమ్‌చంద్. పుస్తకమంతా అలా రాసుంటే ఈపుస్తకం అచ్చువ్వాల్సిన అవసరమే వుండేదికాదు. ఎందుకంటే కవి (తా) భాష వేరు, విమర్శ(క)భాష వేరు. కొంతమంది కవి మాటల్ని తీసుకొని వ్యాసంగా కూరుస్తుంటారు. అది అసహ్యమైన పద్ధతి.

ప్రేమ్‌చంద్ ఒక పని చెయ్యవలసింది నారాయణబాబు మార్క్సిజం, సర్రియలిజం లను యేక కాలంలో అభిమానించాడా? లేక మొదట ఒక

దానిని, తర్వాత ఇంకొక దానిని పట్టుకున్నాడా అని చారిత్రక క్రమంలో పరిశీలించివుంటే బాగుందేది.

ఒక ప్రశ్న : మార్క్సిజం, సర్రియలిజం రెంటినీ నారాయణబాబు సాధన చేశాడు సరే, విమర్శకుడు కవితో మమేకం అవుతున్నాడు సరే, యీ రెండూ ఒకే ఒరలో దూరే రెండు కత్తులేనా ? ప్రేమ్‌చంద్ ఆలోచించాలి.

— రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి.

) ० (

# అర్ధం అనర్ధం

ఎవరు నీవు ?

కవిని !

అయితే, ఓ మంచి కవిత్వం చెప్పవయ్యా ?

ఇప్పుడు కవిత్వాన్ని గురించి నేను పట్టించుకోవటం లేదు ?

ఎందుకు ?

భావుకత్వంతో, గుణదోషాలు చూపించే విమర్శకుడు లేక.

ఈ మాటలు 10వ శతాబ్దంలో రాజశేఖరుడు గుర్తుచేసినవి. ఇరవయ్యో శతాబ్దం ముగిసే దశలోకూడా మన తెలుగు విమర్శ ఇంతకు మించి ఎదగలేదు. ప్రాచీనకవుల 'కుకవినింద' దగ్గరే తెలుగు విమర్శ ఆగిందంటే ఎవరూ ఆశ్చర్యపడాల్సిన అవసరంలేదు. అరకొరగా తప్ప మంచి విమర్శ తెలుగులో రావటానికి యిష్టపడటం లేదు. గత పదేళ్ళుగా రాజకీయ విమర్శ సాహిత్య విమర్శగా చలామణి అయింది.

ఇక యూనివర్శిటీలలో తరుచు జరిగే పరిశోధనా విషయాన్ని గురించి చెప్పనవసరం లేదు. ఈ మధ్య ఆధునిక సాహిత్యాన్నికూడా యూనివర్శిటీలలో ఆహ్వానించే ప్రయత్నం ఎక్కువయ్యింది. అందుకు పరిశోధకులూ, అధ్యాపకులూ కూడా సిద్ధమవుతున్నారు. ప్రాచీన సాహిత్యమంటే – కవికాలాదులూ, కథ మూలకూర్పులూ, చేర్పులూ, అనువాద విధానం, ప్రబంధత్వం, పాత్ర పోషణ, అలంకారాలూ, రసాలూ, ఛందస్సూ, జాతీయాలూ, నుడికారాలూ, చమత్కారాలూ అంటూ – ముక్కలు ముక్కలుగా విషయాన్ని కత్తిరించి, అతికించిన థీసిస్సులకు అటు ఇటుగా, ఆధునిక సాహిత్య పరిశోధన సహితం తయారయ్యే ప్రమాదం మొదలయింది. అయితే ఈ గ్రంథం దీనికి భిన్నమయిందని చెప్పటానికి సంతోషిస్తున్నాను.

తెలుగు కవిత్వానికి జరుగుతున్న హాని ఏమిటి ? కవుల హృదయాలలో తెలిసికాని, తెలియకుండా కానీ అనుకరించేటట్టు, విధేయతగా వుండేటట్టు చుట్టూ చూడకుండా – సామాజిక స్పృహ పేరునకానీ, రాజకీయ నిబద్ధత పేరునకానీ, ఒకే దిక్కుకు అతుక్కుపోయేటట్టుచేసే ప్రయత్నాలు పూర్తిగా సమసిపోలేదు.

ఈ పనిని క్రిష్టియన్లూ, ఇతర మతాలూ, ఎన్నోతరాలుగా చేస్తూ వచ్చారు. ఇప్పుడు కమ్యూనిష్టులు అదే పనిచేస్తున్నారు. ఆస్తి వారసత్వాన్ని వ్యతిరేకించేవాళ్ళే సిద్ధాంతం, ఆదర్శం, నమ్మకం, తీర్మానాలూ, ఆత్మార్పణ త్యాగాలూ, ప్రతిపాదనలు వారసత్వంగా సంక్రమిస్తున్నా మౌనం వహించబోతారు. లేదా వాదగని వ్యాఖ్యానాలు చేయబోతారు.

సంఘర్షణ ద్వారా ఏవో పైపై వుపయోగాలు సాధించవచ్చు. అయితే సంఘర్షణ స్వభావంలో ఐక్యత లేనప్పుడు దాన్ని మన జీవితం లోనూ, బయటా అత్యంత అవసర నీయాంశంగా తీసుకోవాల్సిన పని ఏమిటి ? అలాగని కళ్ళముందు కన్పించినా తిరస్కరించట తెలివి తక్కువతనం. ప్రకృతిలోకానీ, జంతువులలో కానీ వుండే సంఘర్షణా స్వభావం మనం అనుకునే దానికంటే భిన్నమయింది. పోటీ, ఆశ, ఏదో కావటానికి లేదా కాకపోవటానికి చేసే ప్రయాస,ఏదోసాధించాలనే సంకల్పం-వున్న వ్యవస్థలో ఆశించే వుద్దేశ్యం. ఇది ప్రకృతిలోని, జంతువులలోని సంఘర్షణకంటే వేరయింది.

అసలు విప్లవకారులకూ, సంస్కర్తలకూ అంత్య లక్ష్యం ఎంతో ముఖ్యమయింది. దాన్ని సాధించటానికి వాళ్ళిద్దరూ కవిని ఉపయోగించేందుకు ప్రయత్నిస్తారు. కానీ, చేయాల్సింది - ఒక ఆశయానికి వ్యక్తిని వుపయోగించటం. కానీ, చేస్తున్నది ఒక ప్రత్యేక అంత్య లక్ష్యానికి ఉపయోగపడటమే. ఇలా ఓ వుద్దేశ్యం కోసం వుపయోగించుకోవటమంటే - వుద్దేశ్యం ఎంత గొప్పదయినా ఆతన్ని ఒక వస్తువుగా గుర్తించటమే. అలాంటప్పుడు ఆ సంబంధంలో వినిమయమే కొనసాగుతుంది. తెలుగు కవిత్వంలోకి రాజకీయాలు జొరబడి కవుల్ని ఇంతకుమించి ఏ సంబంధాల్ని నిలబెట్టుకొన్నాయి ?

వ్యక్తి అన్ని సమస్యలూ వున్న సంపూర్ణ మనిషి. ఏదో ఒక రాజకీయమే కాదు. మానసికమయిన బౌద్ధికమయిన స్థితినుంచి వేరుగా రాజకీయ అస్తిత్వంతోనే వేరుగా జీవించడు. అలాగని రాజకీయానికి సంబంధించి క్రియాశీలత ఏదీ ఉండదని కాదు. చెట్టును - వేర్లూ, కాండం, ఆకులూ పూలూ, వేరువేరు అని గుర్తించటం సరైనదికాదు.

సందేశ కవిత్వంలో లేదా ప్రబోధ కవిత్వంలో కవికీ, శ్రోతకూ మధ్య సజీవ - సహసంబంధం వుండదు. ఇద్దరి మధ్య సిద్ధాంత ప్రమాణంలేని అన్వేషణ ప్రధానంకాదు. ఒక్కమాటలో చెబితే ఒకరు జ్ఞాని. మరొకరు

అజ్ఞాని. దీనిమీద దృష్టి నిలపటం మన కవులకూ విమర్శకులకూ అంత యిష్టం లేదు ఎందుకో ? ఈ దృష్ట్యా అంతో యింతో భావకవులూ, ప్రబంధ కవులే నయం. రచయిత ఈ విషయాన్ని కవి, శ్రోత సంబంధాలలో చక్కగా గుర్తిం చారు.

కవితా నియమాల్ని కవే సృష్టించుకొంటాడు. జీవిత వైవిధ్యంలో వున్న అంతర్గత ఏకత్వాన్నీ, నిర్దుష్టతను పరిశీలించటంలో వ్యక్తీకరించటంలో రూపుదాల్చిన లక్షణాలూ, గుణాలూ, ధర్మాలూ ఉద్దేశింపబడిన అంశమూ, వస్తువూ, విషయ సమాచారమూ ఎంతవరకు సమన్వయక్రమాన్ని పొందిందని పరిశీలించాలి. నారాయణబాబు కవిత్వాన్ని పరిశీలించటంలో ఈ దృష్టి ఆద్యంతం కనిపిస్తుంది. అలాగే ఒక రచయిత రచనను పరిశీలించేటప్పుడు అతని రచనను వేరొక రచయితతో పోల్చటం, ఒక కవిని మరో కవితో పోల్చి విలువ కట్టటం స్థాన నిర్దేశాన్ని ఏర్పరచటం, అతి మామూలు వ్యవహారంగా జరుగుతోంది. ఈ ధోరణి ఏ కవికి వుండే ప్రత్యేకత ఆ కవికి వుండనీయకుండా నిరాకరి స్తోంది. ఆ విమర్శ సాహిత్యంలో జరగాల్సిన సహజ పరివర్తననూ వేగాన్ని మందగింపచేసి అనుకరణత్వానికి దారితీయిస్తుంది.. ఈ కోణంనుంచి కూడా రచయిత ఎంతో సంయమనంతో జాగ్రత్తగా వ్యవహరించారు.

గొప్ప కళాకారులు ఎప్పుడూ వాళ్ళు సృజించిన వాటినుంచి అనామకంగా, నిర్లిప్తంగా వుండాలని ప్రయత్నించారు. దేన్నీ వ్యక్తిగతంగా ఆశించకుండా దూరంగా వుండటమే చేశారు. తాము పొందిన అనుభవాన్ని అర్థం చేసుకొమ్మని వ్యక్తిగా ఆరాధించకండని చెప్పారు. అదే జరిగితే జీవన స్పృహే వెలుగుగా వుంటుందని తెలియచెప్పారు. అంతేకానీ, ఆ అనుభవాన్ని వ్యక్తిగా ఆపాదించు కొని పేరుకోసం, పొగడ్తలకోసం, స్థానంకోసం, టైటిల్సుకోసం, ఆరాధించు కోవటంకోసం ప్రయత్నించలేదు. ఈ స్పృహ మన తెలుగు కవులకూ కనీసం విమర్శకులకయినా బొత్తిగాలేదు. అందుకే శ్రీ శ్రీ కన్నా గొప్పవాళ్ళమని చెప్పుకోవటం. లేదా అంత గొప్పవాడుకాడని చెప్పటం, లేదా తగ్గించుకోవటం, లేదా శ్రీశ్రీ స్థానాన్ని ఖాళీపడిన వుద్యోగంగా అభివర్ణించటం — వాటి మీద చర్చలూ, వాదాలూ, సమర్థింపులూ ఈ రోజుకూ చోటుచేసుకొంటున్నాయి. అలాంటి అనారోగ్యాన్ని ఎక్కడా ప్రదర్శించనందుకు రచయితను అభినం దిస్తున్నాను.

కవిత్వంలోని విషయాన్నీ, భాషకత్వాన్ని పిండ ఉపాయంగా విశ్లేషణా పద్ధతుల్ని ఆశ్రయించాం. ఈ పరిశోధనా సామాగ్రిని కవిత్వానికి దగ్గరగా చేర్చటంతోనే దానిలోని సృజనాత్మక సమగ్రత్వం కొలవబడినట్టుకాదు. ఆమాట కొస్తే అవన్నీ దానికి ఎడంగానే నిమగ్నమవుతున్నాయి. ప్రాచీన విశ్లేషణా పద్ధతులకు సంబంధించి సంస్కృత లక్షణ గ్రంథాల ప్రమాణాలూ, అలంకార శాస్త్ర ప్రమాణాలూ ప్రధానం కాగా – ఆధునిక విశ్లేషణా పద్ధతులకు సంబంధించి విభిన్న సిద్ధాంతాల ప్రమాణాలు ప్రధానమయ్యాయి.

సృజనాత్మక సమగ్రత్వం తన సమస్త బాహ్యాంశాల కంటే గొప్పది. అది విశ్లేషణా పద్ధతులకు అందని రహస్యం. సృజనాత్మక సమగ్రత్వాన్ని సమగ్ర దృష్టితో చూడక పోవటం, దాన్ని ముక్కలు చేసి చూడటంలోని ప్రమాదాన్ని గుర్తించక పోవటం దాన్ని ఏదో విధంగా తగ్గించి వేయడమే. తెలుగులో చివరికి ఈ పద్ధతులు స్వయం ప్రతిపత్తికోసం ప్రాకులాడి, సాహిత్యానికి వున్న స్వయం సంబంధాన్ని తెగగొట్టం జరుగుతోంది. కొందరిదృష్టిలో సాహిత్యం స్వయం ప్రతిపత్తినే నిరాకరించాలనే ఆలోచన ఇక్కడనుంచే పుట్టింది. అయితే ఈ రచయిత 'మౌనశంఖం', 'కిటికీలో దీపం', 'కావాలి' మొదలయిన గీతాలలో ప్రమాదానికి దూరంగా అనుసరించిన తీరుచక్కగావుంది.

మాటలు స్వయం ప్రకాశకాలుకావు. అందువల్లే అవి మనస్సుతో సాధర్మ్యాన్ని పొందలేవు. మనస్సు వేగవంత మయింది. మాటలు స్థిరమయినవి. మనసును అందుకోవటానికి మాటలకు వేగం కావాలి. అందుకు ఛందస్సు అవసరం. ఛందస్సువలన అవి హృదయంలోకి ప్రవేశించటమేకాదు స్పందనలతో సమ్మిళితం అవుతాయి. మాటలకు జడత్వం వదలి వెళ్ళటం కోసమే ఛందస్సు – రచన అంటూనే వచనమైనా పద్యమయినా అందులో గతివుంటుంది. కనుక స్వాభావిక మయిన ఛందస్సు అవిభాజ్యమయింది. పద్యంలో అది ప్రత్యక్షంగా వుంటే గద్యంలో అంతర్నిహితంగా వుంటుంది. అంతర్నిగూఢంగా వుండే ఈ చందస్సును బాహ్యశక్తుల ద్వారా అధికారంగా ప్రయత్నిస్తే కవిత్వం దెబ్బతింటుంది. అదే పద్యంలో ఈ ప్రయత్నం సఫలంకావచ్చు. వచన కవిత్వానికి సంబంధించి లయానిర్ణయ జ్ఞానం మనసులో సహజంగా మెదులుతూ వుండాలి. అదే జరక్కపోతే అలంకార శాస్త్రాల బలంకానీ, బాహ్యశక్తుల మరేబలంకానీ ఈ లోపాన్ని నివారించటంలో సహకరించలేవు. ఏ కారణంచేత

వచన కవిత్వం సహజమో, ఆ కారణంచేతనే ఛందస్సు దానికి సహజంకాదు. ఈ క్రమాన్ని రచయిత కవిత్వంలో లిఖిత ధోరణులు అనే విభాగంలో బాగా చెప్పారు.

అసలు తెలుగు కవిత్వ ఉద్యమాలలో ఎందుకు స్తబ్ధత కొనసాగుతోంది? ఎందుకు ఎప్పటికప్పుడు జ్ఞానస్పర్శ లేకుండా పోతోంది? నిజాయితీతో జ్ఞానస్పర్శ కలిగిన కవిత్వాన్ని కవి, శ్రోత పోల్చుకోక పోవటం — గత సాహిత్య వాసనలే భాషలో, ఆలోచనలలో, ఆవేశాలలో కదలకుండా సాగటం—రోజు రోజుకూ ఉద్రిక్తమయిన, ఉత్తేజకరమయిన వెలికితీసే విధానాన్ని అలవర్చుకోవటం — రాసేందుకు అలవాటు పడటం — చక్కటి వ్యక్తీకరణను వల్లె వేయటం — ఏ దృష్టిలోంచయినా సరే అధికారాన్ని అంగీకరించటం గౌరవనీయంగా మారటం— సంఘర్షణ, అనుకరణ, కుదురుబాటు, ముక్కలు ముక్కలుగా విభజించుకొని ప్రోత్సహించుకోవటం — స్తబ్ధతను ఏర్పరుస్తుంది. లోతయిన దృష్టిలేనప్పుడు ఏ విధమయిన ఉద్యమం అయినా ఇలా స్తబ్ధతనుంచి స్తబ్ధతలోకి చేసే ప్రయాణమని అంగీకరించం. మొదట్లో వున్న అంతో ఇంతో వున్న అసంతృప్తి అప్పుడప్పుడున్న తీవ్రమయిన ప్రతిస్పందనకూడా కొద్దికాలంతో అడుగంటి కళా పాండిత్యం, నకిలీ సృజనాత్మకత బట్టబయలవుతుంది (మన సాహిత్య ఉద్యమాలు ఈ వాస్తవానికి భిన్నంగాలేవు). ఇక అప్పటికే తయారయిన అనుకరణ వర్గం వస్తువుతో, రూపంతో సులభంగా సఖ్యతపొంది వున్నచోటే వుండిపోతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఒకరి పాడెను మరొకరు తయారు చేసుకోవడమంటే ఇదే. ఆత్మకళాభ్యాసం, ఆత్మకళాప్రక్రియను చర్చిస్తూ ఈ వాస్తవాన్ని పరోక్షంగా రేఖామాత్రంగా కదిలించి వదిలారు రచయిత.

సామాన్య స్పృహకు అందే వస్తుప్రపంచం వెనక ఒక నిజమయిన ప్రపంచాన్నీ, దాన్ని చేరే మార్గాన్ని అన్వేషించే తాత్త్విక గాఢత వుండాలి. జాగ్రదావస్థలో వున్నది బుద్ధితన అలవాటు ప్రకారం నిర్మించిన ప్రపంచం. అయితే ప్రపంచాన్ని గురించిన మౌలికమయిన అనుభూతుల్ని, అనుభవాల్ని తిరిగి పట్టుకోవటమే జరగాల్సింది. బుద్ధికి చెందిన స్పష్టమైన తార్కిక నిర్మాణాల్ని చిన్నాభిన్నంచేసి ఎంతో శక్తివంతమయిన అవచేతనను వెలికి తీయటం— బుద్ధి ఏర్పర్చిన అర్థాలకు ఆవలగా వున్న ప్రాకృతిక అర్థాల్ని కనిపెట్టటమే చేయాల్సింది. అధివాస్తవికత ఆశించింది అదే.

ఇది మనసు సంపూర్ణ విముక్తిని వుద్దేశించిన మార్గం.

ఇది కవితా రూపంకాదు. మనసు తానై తాను వెనక్కి మరలటంలో, సంకెళ్ళు తెంచుకోవటంలో వేసే గావుకేక.

సాహిత్యానికి వ్యతిరేకమైన కవిత్వమిది. బుద్ధిగతమయిన ఆలోచనల మారణహోమం దాని కవిత్వం.

ప్రతి ఆలోచన మలపులోనూ, సమాజం నిరీక్షిస్తూ కూచున్న మమ్మల్ని చూడగలుగుతారు.

మానవుడి నీతి నియమాల్ని గురించిన మార్పుకాదు ప్రధానంగా కోరు తున్నది. గాజుముక్కల్లా పగిలిపోయేది ఆలోచన అనీ – దానిమీద పునాదులు నిర్మిస్తున్నామని తెలియచేయదలిచాం.

మనం ఎప్పుడు దేన్ని ఆన్వేషించమో దాన్ని నడుచుకుంటాం. అలాగే రచనకూడా చేస్తాం. ఇంకా దేన్ని వెతుకుతున్నామో దాన్ని అన్వేషించకుండా వుండటానికి ఇష్టపడతాం.

కళలోని పరిపూర్ణత సోమరితనానికి గుర్తు.

అధివాస్తవిక కవులు, కవిత్వం ప్రధానంగా ప్రకటించింది ఇదే.

ఈ అధివాస్తవిక ప్రయత్నం. ప్రాచ్యదేశాలలో ముఖ్యంగా భారత దేశంలో అధివాస్తవిక వుద్యమంకంటే ఎన్నోవేల ఏళ్ళకు ముందే మొద లయింది. చేతన ప్రపంచాన్ని వదలి వెళ్ళటానికి పడిన అగచాట్లు అన్నీ భార తీయ తత్వశాస్త్రాలలో టెక్నిక్స్‌తోసహా బాగా కనిపిస్తాయి. దేనికది విడి పోయినట్టువుండే వాక్యాల్ని, పదాల్ని, రూపకాల్నే, వాక్య నిర్మాణ తార్కికతను భగ్నంచేసి; జాగ్రదావస్థలోని మనసును తప్పించే ప్రయత్నం తపలో, పాఠకు లలో చేసిన ప్రయత్నం అలాంటిదే. అలాంటి విధానానికి దగ్గరగా వస్తుంది.

మాటలకు అందని అనుభూతిని, మాటలలో అందించే శక్తిలోని నిస్స హాయత్వాన్ని గుర్తించి – ఒకసారి డిక్షన్ను పూర్తిగా మార్చి, కొత్త డిక్షన్ను తయారుచేస్తే అనుభవం సూటిగా అందుతుందేమో అని ఆలోచించానని కానీ, చివరకు నిరుపయోగ వ్యవహారంగా వుంటుందని గుర్తించానని – ఎవరితోనో, ఓ సందర్భంలో జిడ్డు కృష్ణమూర్తి తెలియ చేసినట్టు చదివాను. ఈ మాత్రం దేనికది విడివిడిగా వుంటే వాక్యాలూ, పదాలూ, రూపకాలు, వుండటంవలన– వాక్య నిర్మాణ తార్కికతను భగ్నం చేయటం వలన, జాగ్రదావస్థలోని మన

స్వను తప్పుకొని అచేతనను తాకాలనే అధివాస్తవికతకు కూడా వర్తిస్తుంది. వాళ్ళ తపనలో చిత్తశుద్ధి కనిపించినా, రూపంలో సాగించే ఈ కఠిన వ్యవహారం వలన ఉపయోగం కంటే నిరుపయోగంగా మారటమే అధికమనిపిస్తుంది పాఠకుల దృష్టినుంచి. అయితే పదం, అర్థం, విశ్లేషణ ఏ విధమైన ప్రభావాల ఆధిక్యతా ప్రాధాన్యం కానీ సరైన వ్యక్తీకరణను పాఠకుడికి అందించేక్రమాన్ని కవి అన్వేషించాల్సిందే. ఈ రచయిత నారాయణబాబులోని అధివాస్తవిక ఛాయాలు, ప్రభావాలూ అనే అధ్యాయంలో ఈ దృష్టిని పెట్టుకునే రచయిత విభిన్న కవుల ధోరణులను, విధానాలను పరిశీలించారు.

అంతేకాకుండా ఇంకో చక్కని పనికూడా చేశాడు ... తత్కాల పరిస్థితులనూ, ఆర్థిక వ్యవస్థనూ వివరించి, అంతమాత్రాన సాహిత్య రూపాలలో మార్పులకు అవి ప్రత్యక్ష కారణాలుగా నిరూపింపబోవడం బహుక్లిష్టమైన తాత్త్విక ప్రతిపాదన అని – యాంత్రిక సాహిత్యానికి వర్తింప చేయడమే అవుతుందని అన్నారు వెల్చేరు నారాయణరావు. కానీ, ఆయనే అధివాస్తవిక కవిత్వానికి ఆనాటి తెలుగుదేశంలోని పరిస్థితులకుముడిపెట్టి చూపించారు. తెలుగు కవిత్వంలో ఇతరవుద్యమాల్లా అధివాస్తవిక కవిత్వంబాగావెలుగులోకిరాకపోవటంవలన ఆయన కారణాలు మనకు వెంటనే నిజమనేటట్లు ఒప్పుతాయి. అయితే రచయిత ఈ విషయాన్ని మెలకువతో వాస్తవాన్ని భిన్నంగా చూశాడు. తెరకు చిరుగుపెట్టాడు. అది ఇక అక్కడతోనే ఆగక పోవచ్చు.

ఈ సందర్భంగా ఇంకో విషయం చెప్పాలి. అధివాస్తవికాన్వేషణలో కలలమీద ఆధారపడటం, అచేతనలో వున్న భావరూపాల మూలాలు బయటికి తీయటం, దేనికైనా కలల మీదనే ఆధారపడటం – నిత్య ప్రపంచ జీవితంలో స్పృహనూ, మెలకువను లేకుండా చేస్తాయి. ఈ ప్రమాదాన్ని అధివాస్తవికత కొని తెచ్చుకోరాదు.

మార్క్సిస్టులు, అధివాస్తవికులు వస్తుగత ప్రపంచంలోని కార్య కారణ సంబంధాన్ని, దానికి వ్యతిరేకమయిన ఆకస్మిక మార్పును చూసినతీరు వేరువేరు. మార్క్సిస్టులు కార్యకారణ సంబంధాల్ని ప్రధానంగా ఒప్పుకొన్నా, దానికి వ్యతిరేకంగా జరిగే ఆకస్మిక మార్పును కూడా గుర్తించారు. కానీ అధివాస్తవికులకు ఈ ఆకస్మిక మార్పే కార్యకారణాల సంబంధాలకు మించి ప్రధానమయిపోయింది. దాన్నే క్రియాశీలతకు కేంద్రమూ చేశారు. అందుచేతే మార్క్సిస్టు

లతో తాత్కాలిక సఖ్యత మాత్రమే ఏర్పడింది. పాశ్చాత్య కవులలోనూ, తెలుగుకవులలోనూ ఇదే పరిస్థితిని చూడొచ్చు.

అధివాస్తవికులు కార్యకారణ సంబంధాన్ని నిరాకరించటానికి చేతనా వస్థనే ఆశ్రయించారు. అంటే కార్యకారణ సంబంధాన్ని తెలిసో తెలియకో దాని వ్యతిరేక కోణం నుంచే తరుచు దగ్గరయ్యారనిపిస్తుంది. మార్గాన్ని అను సరించే గమ్యంకూడా. ఇది అధివాస్తవికులు ఆలోచించని విషయం.

ఇది పరిధికాదని చెప్పినా, అదే ఒక పరిశోధన అవుతుందని వివరించినా, 'నారాయణబాబు కవితాతత్త్వం ఇతర కవులపై ప్రభావాలూ, ఛాయలు' అన్న శీర్షిక కింద చేసిన ప్రయత్నం ఇంకా లోతుగావుంటే బాగుండేదేమో.

అలాగే ఒక విమర్శకుడిమీద ఎంత అభిమానం వున్నా, అతని భావనల భాషమీదే నూతన భావనల్ని, భాషను ఏర్పర్చటం ప్రయోగంగావున్నా ఎంత వరకూ మంచిదో ఆలోచించాలనిపిస్తుంది.

పరిశోధనరీత్యా - అక్కడక్కడ భావాలలో, భావనలలో వివరణలో ఇంకా స్పష్టతా, సంక్షిప్తత కాస్త అవసరమనిపిస్తుంది. ఏమయినా, ఇలాంటివన్నీ మొత్తం విమర్శరీత్యా లోపాలుగా చూపించే ప్రయత్నం మాత్రం కాదు ఇక్కడ నేను చేసింది. ఇవన్నీ రచయిత ముందు ముందు గుర్తించగలిగినవీ, సర్దుకోగలిగినవే.

బ్రతుకంటే
చీకటిలో
దీర్ఘమైన చావు !
చచ్చి
బ్రతుకు !
మృత్యువులో వెలుగున్నది.

అనే వాస్తవాన్ని ఆయన భౌతికంగా మరణించాక, ఆయన కవిత్వానికి ఆ దశే ఏర్పడినాక - మరో రూపంగానైనా మూర్చన చేసి సంగీతంలాగే భిన్న భిన్న స్వరాల్ని ఏకస్వరం మీదే పలికించే ప్రయత్నం చేసిన రచయితను అభినందిస్తున్నాను. ఇంకా ముందుకు వెళ్ళాలని ఆశిస్తున్నాను.

ఒకటి, జులై, 1987,
అనంతపురం.

కె. యం. రాయుడు

# 1 నా రా య ణ బా బు

జీవితం అట్టడుగు పొరల్లో దాక్కున్న సత్యాన్ని అన్వేషిస్తూ వెలికితీసే ప్రయత్నంలో ఎన్ని అధిక్షేప ఆక్షేప శరాఘాతాలు నిత్యం హృదయాన్ని తాకుతున్నా నిర్భయంగా ముందుకురికిన అభ్యుదయ కవితారథ సారథులలో నారాయణబాబు ఒకరు. ఆకాశ మేఘాల అంచుల్ని తాకుతున్న మంత్రలోకపు మణిస్తంభాలపై ఒంటి స్తంభపు మేడల్లో విహరిస్తున్న తెలుగు కవిత్వాన్ని నిలబెట్టి గద్దించి ప్రశ్నించి సామాన్యుని ముందు అపరాధిని చేశాడు. అగ్నివీణను శ్రుతిచేసి కదన కుతూహల రాగం వినిపించాడు. కుష్ఠురోగి పాటల్ని, దరిద్ర సంగీతాన్ని, నగ్నగీతాల్ని ఆలపించాడు.

ఆధునిక తెలుగు కవిత్వాన్ని అభ్యుదయ పథాలకు నడిపించిన వాళ్ళల్లో నారాయణబాబు అగ్రగామి. తెలుగు కవిత్వాన్ని అభ్యుదయ పథంలో నడిపిన వాళ్ళు శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి, శిష్ట్లా ఉమామహేశ్వరరావు మొదలైనవాళ్ళే. అయితే ఆ తరువాత శ్రీశ్రీ తదితరులకు ఆంధ్రదేశం మూల్యం చెల్లించక తప్పలేదు. కానీ దూషణలను మాత్రం స్వీకరించి భూషణలను స్వీకరించకుండానే ఆంధ్రదేశానికి అమృతాన్ని అందించటం కోసం హాలాహలాన్ని ఆనందంగా స్వీకరించిన కాలకంఠుడు నారాయణబాబు.

ఆకాశ వేదికమీద షేర్వాణీ గిరిజాలూ ధరించి ఆశగా చూసే చుక్కకన్నుల ప్రేక్షకులకోసం 'పదరా బందారి పోదాము పడమళ్ళ సినాన్నా ! పదరా !' అని పాడుతూ నయాగరా జలపాతంలా ప్రేక్షకుల హృదయాల్లో ప్రతిధ్వనించేవాడు.

17–5–1906 న నారాయణబాబు శ్రీరంగం సుందర నారాయణగారికి కొంచెం ఆలస్యంగా విజయనగరం బంకుల దిబ్బ ప్రక్కనున్న రెండంతస్థుల మేడలో పుట్టిన జ్యేష్ఠ కుమారుడు. లేమి దరిదాపుల్ని తాకలేని శ్రీమంతుల ఇంట పుట్టి జీవితాంతం లేమితో చెలిమి చేసిన సహసశీలి.

నారాయణబాబు కేవలం కవేకాదు, కళాకారుడు. సాహిత్యం అతని తండ్రయితే చివరివరకూ తన ఒడిలో లాలించిన తల్లి సంగీతం. సంగీత సాహిత్య రహస్యాలను ఒడిసి పట్టుకున్న నారాయణబాబు చిత్రకళ ఆయువుపట్లూ తెలిసినవాడు.

నారాయణబాబు జీవితం ముక్కోణపు పువ్వులా విరిసింది. అందులో రేఖా శిఖరంపై సాహిత్యాన్ని కుడి ఎడమల సంగీత చిత్రరేఖనాల్ని చూడొచ్చు.

ప్రాథమిక స్థాయిలో విద్యా వ్యాసంగం విజయనగరంలో ముగిసింది. విజయనగరం పురవీధుల్లో కాళూరి నరసింగరావుగారితో కలిసి తప్పటడుగులు వేస్తూ జంట కవిత్వం చెప్పడంతో కవితా జీవితం ప్రారంభమైంది. నారాయణబాబు, మిత్రులు పూడిపెద్ది వెంకట రమణయ్యగారు, చొప్పల్లి భాగవతారు, కాళూరి తదితరులు ఆనాడు వస్తున్న కవిత్వం గురించి చర్చించుకునేవారు. నారాయణబాబు ప్రాథమిక విద్య అనంతరం పశువైద్యం నేర్చుకోడానికి మద్రాసు వెళ్ళి అనివార్య కారణాలవల్ల మధ్యలోనే మానేశాడు.

శ్రీయుతులు పురిపండా అప్పలస్వామి, వడ్డాది సీతారామాంజనేయులు, కాళూరీ, పూడిపెద్దీ, నారాయణబాబుతో కలిసి 1926 లో విశాఖపట్టణంలో కవితా సమితిని స్థాపించారు. నారాయణబాబు కవిసమ్మేళనాల్లో అనేకసార్లు కవితాగానం చేశాడు. శ్రీశ్రీతో అనుబంధం పెరిగేకొద్దీ అభ్యుదయ దృక్పథం

దినదిన ప్రవర్ధమానమైంది. అందులో రోణంకి అప్పలస్వామి, పురిపండా అప్పలస్వామిగార్ల పాత్ర కూడా ఎంతో ఉంది. ఎప్పటి కప్పుడు ప్రపంచ పరిణామాన్నీ, సామాజిక ఆర్థిక రాజకీయ పరిస్థితుల్నీ ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తున్న శ్రామిక పోరాటాల్నీ పరిశీలించేవారు. నూతన ప్రాపంచిక దృక్పథాన్నీ, ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతాన్నీ రోణంకి, శ్రీశ్రీల సహచర్యంలో ప్రపంచ సాహిత్యాన్ని అధ్యయనం చేయటం, విశ్లేషించుకోవటం, చర్చించుకోవటం ద్వారా నూతన ఆలోచనా విధానాన్ని ఆహ్వానించారు.

ఇంచుమించుగా శ్రీశ్రీతో పాటూ గొంతు మార్చుకున్న నారాయణబాబు 1935 లో రాసిన 'కావాలి' అన్న ఖండికలో

"విలయ వేళల
ప్రళయ తాండవం
చేసే శివునకు
వెనుక పాట పాడే
కవులుంటే
కావాలంటూ !!!"

పిలిచాడు. తన చుట్టూవున్న ఆకలీ, దరిద్రం, నిరుద్యోగం, ధనిక, దరిద్ర భేదం పునరాలోచించుకొనేట్టు చేశాయి. పాపం పుణ్యం చెప్పే కర్మసిద్ధాంతం, విధివ్రాతల్ని, తలరాతల్నీ అదృశ్య శక్తుల్నీ, దోపిడినీ, పీడననూ సమర్థించే సిద్ధాంతాలూ అన్నీ అభ్యుదయుల దృష్టిలో కృతకంగా అర్థంలేనివిగా అశాస్త్రీయంగా కనిపించాయి. వీటన్నింటిమీదా తిరుగుబాటు లేవనెత్తారు అభ్యుదయవాదులు. ఈ తిరుగుబాటుకు ప్రేరణ, గీటురాయి మార్క్సిజం. మార్క్సిజం వెలుగులో సర్వమానవ సమానత్వాన్ని అంగీకరించి పై చెప్పిన్న అన్ని అసమానతల్నీ తుడిచి వేయాలన్న వజ్ర సంకల్పాన్ని ఏర్పరుచుకున్నారు.

నారాయణబాబు పీడితవర్గాల చైతన్యాన్ని కోరుతూ కదన కుతూహలరాగం వినిపించాడు. అగ్గిని కురిపించాడు. 'పగిలిన ఖలేజాలే నా పాటల జలేజాలు' అని ప్రకటించుకున్నాడు. 'విప్లవ ఋషిని విద్రోహకవిని' అని చాటుకున్నాడు. 1939 లో రాసిన 'గడ్డిపరక' ఖండికలో దోపిడిని నిరసిస్తూ పీడితవర్గాల చైతన్యాన్ని ఆకాంక్షిస్తూ రాసిన కవితలో

"నడవండి ! నడవండి !
నామింంచి నడవండి,
గడ్డిపరకను, గడ్డిపరకను"

అంటూ న్యూనతా భావాన్ని ప్రదర్శించిన గడ్డిపరక చివరకు తనను తాను తెలుసుకొని మిన్నువిప్పిన రక్తపతాకం మన్ను సత్తువే తెలిపితే "నన్ను నే తెలుసుకున్నాను ఆగండి ! ఆగండి !" అంటూ దోపిడీ వర్గాన్ని, బూర్జువా వర్గాన్ని నిలేస్తుంది. ఇలాగే నారాయణ బాబు కవితా జీవితంకూడా భావ కవిత్వం రాయటంతో ప్రారంభమై అభ్యుదయం వైపు నడిచింది.

1935 లో రోణంకివారు నారాయణబాబు 'దేశమాత' గేయాన్ని పాడగా విన్నారు. ఆయన కవితా జీవితంలో అనేక సన్మానాలు, అభినందనలు కూడా అందుకున్నారు. 1945 లో క్రిష్ణశాస్త్రి అధ్యక్షతన కాకినాడలో ఒక సన్మానం జరిగింది. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఉపన్యసించాడు. నారాయణబాబు అధివాస్తవికతను గురించి ఉపన్యసించాడు. 1952 లో సామర్ల కోటలో నారాయణబాబుకు సన్మానం జరిగింది. అందులో ఆయన కవిత్వాన్ని నిరసిస్తూ అవమానపరుస్తూ కాటూరి వెంకటేశ్వరరావు గారు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ఉపన్యసించారు. రాంషా, సోమసుందర్ వాళ్ళను ఖండిస్తూ నారాయణబాబును

సమర్థించారు. 1954 ఏప్రిల్ 24న అమలాపురం దగ్గర రాజవరంలో ఒక సన్మానం జరిగింది. నారాయణబాబుకు ఉపన్యాసకుడుగా మంచి పేరుండేది.

నారాయణబాబు జీవితం భూషణలకన్నా దూషణలకే ఎక్కువగా గురయ్యింది. సన్మానాలకన్నా అవమానాలనే స్వీకరించింది. సుఖాలకన్నా కష్టాలనే ఎదుర్కొంది. ఆయన ఒక కంటక కరీటధారి. ఆయన జీవితం ముళ్ళ సోపానం. జీవితాన్వేషణలో ఈ సుఖాలూ, దుఃఖాలూ, ఐంద్రిక ఇచ్ఛలూ, కాఠిన్యాలూ, పేదరికాలూ వ్యక్తిగతంగా హృదయగతంగా ఆయనేమీ చేయలేకపోయాయి. గమ్యం తెలియని ప్రయాణంలో జీవితం ఎటు విసిరితే అటుపోతూ నడిసముద్రంలో చిక్కుకొన్న నావికునిలా ఆటుపోట్లను చిరునవ్వుతో ఎదుర్కొంటూ పయనించాడు. లేమి నిరంతరం వెంటాడుతున్నా మొక్కవోని గుండె ధైర్యంతో ముందుకే అడుగేశాడు. ఆయన ఎక్కడా నిలకడగా ఉన్నట్టు కనిపించదు. ఈ నిలకడలేని తనం ఆరోగ్యాన్నికూడా పాడుచేసింది. అప్పుడప్పుడు మిత్రుల సహాయాన్ని నిర్మొహమాటంగా తీసుకొన్నా చివరకు లేమి ఆయన జీవితాన్ని నిర్దాక్షిణ్యంగా బలితీసుకొంది. శివలెంక శంభుప్రసాద్, చాగంటి సోమయాజులుగార్లు అనేకసార్లు ఆర్థికంగా ఆదుకున్నారు. 2-10-1961 ఉదయం 7-30 గం॥ మద్రాసు రాయపేట ఆసుపత్రిలో దుర్భర దారిద్ర్యంలో మరణించాడు నారాయణబాబు.

1935 ప్రాంతంలో కుటుంబ ఆర్థిక పరిస్థితులు క్షీణించడంతో విజయనగరాన్ని వదలి భీమునిపట్నం చేరినట్టు తెలుస్తోంది. 1954 తర్వాత ఎక్కడా స్థిరంగా ఉన్నట్టు తెలియటంలేదు. కొంతకాలం మద్రాసు, కొంతకాలం విజయనగరం, విశాఖపట్నంలో ఉన్నారు.

చివరి రోజుల్లో మద్రాసులోనే గడిపారు. వ్యక్తిగత జీవితం గురించి తెలియటానికి అంతగా అవకాశాల్లేవు. ఆయన సాంసారిక జీవితం సుఖంగా సాగినట్టులేదు. తర్వాతి కాలంలో ఆయన మద్రాసులో ఒక మెడికో అమ్మాయిని ప్రేమించాడు. పెళ్ళి చేసుకోవాలను కొన్నాడు. కానీ ఆమె అకాల మరణం ఆయన జీవితానికి పెద్ద అశనిపాతంలా తగిలినట్టు ఆయనే అనేక సందర్భాల్లో మిత్రులతో చెప్పేవాడట.

నారాయణబాబుకు సంగీతంలో మంచి ప్రవేశం వుంది. విజయనగరం సంగీత కళాశాలలో జరిగే పోటీలలో న్యాయ నిర్ణేతగా వ్యవహరించేవాడు. అందులో న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించేందుకు అంతంతమాత్రం పరిజ్ఞానం ఉండేవాళ్ళకు సాధ్యం కాదు. నారాయణబాబుకు సంగీతంమీద ఉన్న విషయ పరిజ్ఞానాన్ని తెలియజెప్పేందుకు ఆయన రాసిన 'నాయుడు గారి వ్రేళ్ళు' చెప్పుకోవచ్చును. దరిద్ర సంగీతంలో "నాడు సంగీతం మంటలు పుట్టిస్తే నేడు ఆకలిమంటలే సంగీతాన్ని పలికించాయి" అని కాలానుగుణంగా కళ స్వభావం ఎలా మారుతుందో విప్పిచెప్పాడు. స్వతహాగా ఆయన గాయకుడు. ఎన్నో సభల్లో తన గేయాల్ని, జానపద గీతాల్ని శ్రావ్యంగా పాడేవాడు. ఆయన గొంతు సవరిస్తే శ్రోతల కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లేవట. ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు శ్రీ ద్వారం వెంకటస్వామినాయుడుగారిమీద నారాయణబాబు 'నాయుడుగారి వ్రేళ్ళు' అన్న గీతం రాశాడు. నారాయణబాబు స్వయంగా నాయుడుగారికి శిష్యుడు.

నారాయణబాబుకు చిత్రలేఖనంపట్ల మంచి అభిరుచి ఉండేది. శ్రీ అంట్యాకుల పైడిరాజుకు పాశ్చాత్య చిత్రకళను గూర్చి, చిత్రకారులను గురించి ఎన్నో ఆధునిక చిత్రాలను చూపిస్తూ

అందులోని కళారహస్యాలను, మెళకువలను విప్పి చెప్పేవాడు. శ్రీ పైడిరాజు తనదైన సొంత బాణీని కూర్చుకోడానికి దోహదం చేశాడు. కానీ ఆయన నారాయణబాబును అందుకోలేదని చెప్పాలి. ప్రఖ్యాత ఆధునిక పాశ్చాత్య చిత్రకారుడు సాల్విడార్ డాలి చిత్రాలను నారాయణబాబు గంటల తరబడి చూస్తూ గడిపేవాడు. అందుకే ఆయన కవిత్వంకూడా మార్మిక రహస్యాలను కూర్చుకొని ఒక పట్టానా అందకుండాపోతోంది.

చివరివరకూ కవిగా బతికిన నారాయణబాబుకు తోడునీడగా నిలిచినవాళ్ళు సాహితీ బంధువులే. నారాయణబాబుకు సాహితీ క్షేత్రంలో తటసించిన మిత్రులంతా అతిరథ మహారథులే. ఆయన యవ్వన తొలిదశలో కాళూరీ, పూడిపెద్ది ప్రభావంతో భావగీతాల్ని రాశాడు. ఆనాడు కలంపట్టిన ప్రతి యువ కవీ భావగీతాల్ని రాసి ఆలపించాడు. తర్వాతికాలంలో రోణంకి, పురిపండా, శ్రీశ్రీ, చాగంటి సోమయాజుల సాహచర్యంతో అభ్యుదయ దృష్టితో అభివృద్ధి చెందుతూ వచ్చాడు. శ్రీశ్రీకి నారాయణబాబు పట్లా, నారాయణబాబుకు శ్రీశ్రీ పట్ల ఎంతో అభిమానం ఉండేది. కాని వ్యక్తిగత కారణాలవల్ల ఒక దశలో ఇద్దరి మధ్య మనస్పర్ధలొచ్చాయి. 'సంపంగితోట' అనువాద విషయంలో అభిప్రాయ భేదాలు తారస్థాయినందుకున్నాయి. శ్రీశ్రీనీ, నారాయణబాబును సమరించేవాళ్ళ మధ్య వివాదం తలెత్తింది. ఒకానొక స్థాయిలో శ్రీశ్రీ, నారాయణబాబును 'సృజన' ఇంటర్వ్యూలో 'అతనొక ఇమిటేటర్' అన్న అభిప్రాయం వెలబుచ్చినా తర్వాతికాలంలో నారాయణబాబును మంచి కవిగా ఒప్పుకున్న సందర్భాలు లేకపోలేదు. (బైరాగి సంస్మరణ సంచిక, స్వాతి మాసపత్రికలో వచ్చిన 'అన్నీతం' లో 'విశాఖపట్నం' మంచి కవిత అని మెచ్చుకున్నాడు) శ్రీశ్రీ నారాయణబాబును 'ఇమిటేటర్' అన్నా

అందుకు ఆధారాలు ఏ మాత్రం దొరకలేదు. కనుక ఆ అభిప్రాయం నిలబడలేదు.

నారాయణబాబు సన్నిహితుల్లో చాగంటి సోమయాజులు గారు ప్రథములు. నారాయణబాబు కొన్ని గేయాల్ని చాసోగారి ఇంట్లోనే రాశాడు. 'చిన్నా' అన్న గీతం చాసోగారి కుమార్తె చాగంటి తులసిమీద రాశాడట.

నారాయణబాబుగారి ఆత్మీయుల్లో రోణంకి అప్పలస్వామి గారు ముఖ్యులు వారి బహుభాషా పాండిత్యం, జ్ఞానంపట్ల నారాయణబాబుకు అపారమైన గౌరవం. ఫ్రెంచి కవిత్వ రహస్యాల్ని నారాయణబాబు వారి దగ్గరే తెలుసుకున్నారు. 'వెన్నెల లోతుల్లో' అన్న గేయంలో నారాయణబాబు

"అప్పలస్వామి ఆంగ్లంలో అద్భుతమైన కవి
ఫ్రెంచిలో పండితుడు పాడుపాట
లలూన్ నెగర్డ్ ఓకూన్ రకూన్"*

అంటూ ప్రశంసించాడు.

నారాయణబాబుకు అతి సామీప్యమున్న కవి బైరాగి. ఇద్దరూ కంటక కిరీటధారులే. ఖండిత శిరస్సులను చేత ధరించిన వారే స్వీయానుభూతిని ప్రపంచానుభూతిలో ఏకంచేసి వర్తమాన జీవితంలో తాదాత్మ్యంచెంది నిలువెల్లా కవులుగా జీవించినవాళ్ళు. బైరాగి భాష జటిలమైనా నారాయణబాబుకు భాషా దారిద్ర్యం ఉందన్న వాదాన్ని ఖచ్చితంగా ఖండించాడు. నారాయణబాబు

ఫ్రెంచి అర్థం :- చంద్రునివల్ల ఎప్పుడునూ చెడుపు సంభవించదు.

మరణించినప్పుడు బైరాగి "భూతా భూత జ్యోతిష్కుడు, సంత తాన్య చేతస్కుడు, అతడే ఊర్ధ్వరేతస్కుడు, హర్షామర్షాలు లేని మహర్షి" అని రాసినస్మృతిగీతం నారాయణబాబుపట్ల అక్షరాక్షర సత్యం. బైరాగి చెప్పినట్టు నారాయణబాబు నిజంగా హర్షామర్షాలులేని మహర్షి. అందుకే ఆయన సమరాహ్వానము నినదించే రణభేరీ, నాలుకపై రక్తారావము, అరుణరాగ తరుణ సంధ్యలో అదృశ్యమై పోయిన వేగు చుక్క.

# తన చుట్టూ . . .

అంతర్జాతీయంగా ఆర్థిక సామాజిక పరిస్థితులు కారణంగా ప్రపంచ సాహిత్యంలో 17, 18వ శతాబ్దులనుంచే అనేక విధాలయిన ధోరణులు తలెత్తాయి. ముఖ్యంగా పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ఫలితమయిన ఆధునిక నాగరికతవల్ల (యూరప్‌దేశాల్లోని తాత్త్విక కళారంగాల్లో) విభిన్నమయిన ధోరణులు పోకడలు ప్రవేశించాయి. వైజ్ఞానికమైన పారిశ్రామిక విప్లవం (1748), రాజకీయమైన ఫ్రెంచి విప్లవం (1789), మొదటి ప్రపంచ మహాయుద్ధం (1914–18), పెట్టుబడిదారీ నాగరికత అక్కడి సమాజాల్లోని ఆలోచనా విధానాన్ని సమూలంగా మార్చివేశాయి. కొత్త నాగరికతలో మారిన పరిస్థితుల్లో మేధావుల్లో, కళాకారుల్లో పెరిగిన నిస్పృహా, నైరాశ్యం వాటి ఫలితమైన వ్యక్తివాద, అరాచకవాద ధోరణులు సాహిత్యంలో ప్రతిఫలించాయి.

ఈ విభిన్న ధోరణులు తలెత్తటానికి కావలసిన బలమైన పునాదులు భారతదేశంలో తెలుగుదేశంలో లేవు. అందుకే యూరప్‌లో 17వ శతాబ్దిలో వచ్చిన హేతువాదం, 18, 19 శతాబ్దాలలోని కాల్పనికవాదం, 20వ శతాబ్దంలో ఆధునికత పేరిట వచ్చిన కొన్ని ధోరణులు కలిసికట్టుగా ఒక చారిత్రక క్రమంలో కాకుండా 1910 నుండి తెలుగు సాహిత్యంలో కనిపిస్తాయి.*

* రంగనాథాచార్యులు కె. కె. : ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు (సంపాదకీయం) పుట iii, ఆధారం.

యూరప్‌లో పారిశ్రామిక విప్లవంవస్తే, రాజకీయంగా కొత్త సిద్ధాంతాలను ప్రచారంచేసింది ఫ్రెంచి విప్లవం. ఈ మార్పులు ప్రపంచదేశాల మానసిక తాత్త్విక రంగాలను గొప్పగా ప్రభావితం చేశాయి. యథాతథంగా కాకపోయినా ఆ స్ఫూర్తితో అవి భారత దేశపు అంచుల్నికూడా తాకుతూవచ్చాయి.

కాల్పనికవాదం రూసోతో యూరప్‌లో 1797లో ఆరంభమై 1830లో వ్యవస్థీకృతమై 19వ శతాబ్దం చివరి దశవరకు ఉధృతంగా సాగిపోయింది. సుమారు 110 సం॥ తర్వాత ఇరవయ్యో శతాబ్దంలో (20 శ॥) కాల్పనికోద్యమం తెలుగుదేశంలో ఆవిర్భవించింది. ఈ విపరీతమయిన సామాజికకాల వ్యత్యాసం తెలుగు కాల్పనికోద్యమానికి సరైన పునాదులు లేవనే విషయాన్ని సూచిస్తోంది. ఐరోపాలో కాల్పనిక వాదానికి 1748లో ప్రారంభమయిన పారిశ్రామిక విప్లవం, 1789లో పెల్లుబికిన ఫ్రెంచి విప్లవం ప్రేరకాలుగా పని చేశాయి. అలాంటి ఆర్థిక రాజకీయ ప్రేరణలు తెలుగు కాల్పనిక వాదం వెనుక కన్పించవు. బ్రహ్మసమాజం, బెంగాలులోని వైష్ణవ గీతాలు, బంకించంద్రచటర్జీ, టాగూరుల రచనలు, వీరేశలింగం సంస్కరణవాదం ప్రభావాలు భావకవిత్వ ఉద్యమ ఆవిష్కరణకు దోహదంచేసిన కారణాలుగా చెప్పుకోవచ్చు.

ఆంగ్లభాషా ప్రభావంవల్ల పాశ్చాత్యుల అనేక రంగాలతో భారతీయులకు గాఢమైన సంబంధాలు ఏర్పడ్డాయి. దాంతో వివిధ రంగాలు అమితమయిన ప్రభావాలకు లోనయ్యాయి. తెలుగు సాహిత్యరంగం ఇందుకు భిన్నమైనదికాదు. ఇతర సాహిత్య ప్రక్రియలకంటే తెలుగు కవిత్వంలో ఈ ప్రభావాలు తారస్థాయికి చేరుకొన్నాయి.

రొమాంటిసిజాన్ని విభిన్న రచయితలు తత్త్వవేత్తలు రకరకాలుగా నిర్వచించారు. జర్మనీలో ఆదర్శవాదంగా, ఇంగ్లండులో సౌందర్యవాదంగా, ఫ్రాన్సులో స్వేచ్ఛావాదంగా ప్రకటితమైంది. యూరప్‌లోని కాల్పనిక రచయితలలో కొందరు మాత్రమే విషాద మాధుర్యాన్నీ, శోక తిమిరాన్నీ గానం చేయగా తెలుగు కవులందరూ (దేవులపల్లి, వేదుల, విశ్వనాథ, నండూరి, బాపిరాజు మొ॥ ప్రముఖులు) ఇదే విధానాన్ని అవలంభించారు. అంతే కాకుండా శోక నిరాశా వాదాలతోపాటూ వాస్తవికత నుండి పారిపోయే పలాయన వాదాన్ని మామూలు స్థాయికంటే ఎక్కువగా స్వీకరించారు.

కాల్పనిక వాదానికి వ్యతిరేకంగా ఫ్రాన్సులో ముఖ్యంగా చిత్రకళలో జరిగిన కొన్ని ప్రయోగాలు క్రమంగా సాహిత్యానికి అన్వయించుకున్నారు. అందులో ముఖ్యంగా క్యూబిజం, ఇంప్రెషనిజం, సింబాలిజం కళా సంబంధమైనవిగా పేర్కొనవచ్చు. ఇందులో క్యూబిజం, ఇంప్రెషనిజం వంటివి ప్రధానంగా చిత్ర కళకు సంబంధించినవి.

'ది ఇమేజిస్టు' అన్న కవితాసంకలనం ద్వారా ఫ్లింట్, ఎజ్రాపౌండ్, హెచ్. డి. వెల్సు మొదలయిన కవులు తొలిసారి రంగప్రవేశం చేశారు. దీర్ఘ గీతాల్ని వర్ణనాత్మక గీతాల్ని నిరసించి కేవలం భావ చిత్రాల్నీ, కుదించిన కవిత్వాన్నీ ఉత్తమ కవిత్వంగా నిర్వచిస్తూ ఉద్యమించారు.

20వ శతాబ్దానికి పూర్వమే సింబలిస్టు కవితోద్యమం ప్రతికల విలువను గుర్తించింది. బాడ్లేర్, వెర్లేన్, యులార్మే చేతుల్లో

ఈ ఉద్యమం కవిత్వాన్ని భావ ప్రకటన దశనుంచి భావ సూచనకు, విషయ వివరణంనుంచీ వాతావరణ కల్పనకు దారితీయించింది.

మొదటి ప్రపంచ యుద్ధంలో మానవ మేధస్సు, సంస్కృతి, సాంఘిక చట్టం కుప్పకూలిపోయి, నిస్తేజకరమైనవిగా పరిణమించాయి. శాస్త్ర విజ్ఞాన ఫలితం సర్వమానవాళికీ చెందకపోవటమే కాక మానవ మారణహోమానికి దోహదం చేసింది. ఈ దృశ్యాలను కళ్ళారాచూసిన తర్వాత గతకాలపు సకల విలువల్నీ ధ్వంసం చేయాలంటూ జ్యూరిచ్‌లో ట్రిస్టన్ జారా నాయకత్వాన 1916లో డాడాయిజం ప్రారంభమయింది. ఈ ఉద్యమం యూరప్ అంతటా కళాసాహిత్య రంగాలను ప్రభావితం చేసింది.

ఆ ఉద్యమంలో కొంతకాలం ఉండి ఆచరణాత్మకత ఏమీ లేక విధ్వంసన తర్వాత మరో తాత్త్విక సిద్ధాంతం ఏమీలేక డాడాయిజంనుండి బయటికివచ్చి లూయీ ఆరగాన్, పాల్ ఎలార్డ్, పెరె, ఫిలిప్ సోపాల్ మొదలయినవారు దాదాపు పన్నెండు మందితో సర్రియలిస్టు ఉద్యమాన్ని ప్రారంభించారు. 1924లో మొదటి మానిఫెస్టోని వెలువరించారు. వీరు ఫ్రాయిడ్ ప్రచురించిన **'Interpretation of Dreams'**ను తమ తాత్త్విక గ్రంథంగా చెప్పుకున్నారు.

20వ శతాబ్దంలో మేధావి వర్గాన్ని గుప్పిట పట్టుకున్న మహాశక్తుల్లో ఒకటి ఫ్రాయిడ్ మనో విజ్ఞానశాస్త్రం, రెండు మార్క్సు సిద్ధాంతం. ఫ్రాయిడ్ మనో విజ్ఞానశాస్త్రం ఫలితంగా సాహిత్యంలో సర్రియలిజం వెలువడింది. మార్క్సు సిద్ధాంతం భౌతిక వాద ప్రధానమయిన అభ్యుదయ కవిత్వానికి దారితీసింది.

1931 ప్రాంతంనుంచే భావకవిత్వంమీదికి 'విష్ణుధనువు' ను సంధించిన అతినవ్యుడు శిష్ట్లా. తోడు నిలిచినవాడు ముద్దుకృష్ణ.

బడలిక తాళ జాలక
సడలు అవయవాలను
ఆపి నిలపలేక
మానవాళి పొలిమేర
గుమ్మాల కడకు
వేచివేచి నిలిచిన శాంతి
సొమ్మసిల్లినదని
దుర్వార్త తూర్పునుంచి – వంటి వచన

గేయాల్ని ముద్దుకృష్ణ రచించి వచనగేయ రచనలో శిష్ట్లాతో పాటు తనుకూడా మార్గదర్శి అయినాడు. ముద్దుకృష్ణ 1932 లోనే 'జ్వాల' అనే సాహిత్య పత్రికను వెలువరించి భావ కవిత్వ వ్యతిరేకోద్యమానికి నాందివాచకం పలికాడు.*

1930 తర్వాత పెట్టుబడిదారీ ప్రపంచాన్ని ఆర్థికమాంద్యం మొత్తంగా అతలాకుతలం చేసింది. దాంతో దేశం ఒక దశాబ్దం పైగా పులినాకి వదిలేసినట్టు తయారయ్యింది. పేదరికం నిరుద్యోగం వ్యాపించింది. చిన్న చిన్న ఆస్తులు కరిగిపోయి ఋణభారం పెంచ్చింది. రైతాంగం నడ్డి విరిగింది. ఉప్పు సత్యాగ్రహం చప్పబడటం తోటి గాంధీ ఉద్యమాలమీద గురిచెదిరి యువ జాతీయవాదులు, టెర్రరిస్టులుగా పిలవబడేవాళ్ళు సోషలిస్టు ఆకర్షణకు లోనయినారు. ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రవేశించింది. 1936 ఏప్రిల్‌లో ప్రేమ్‌చంద్, రఘుపతి సహాయ్

---

* నారాయణరెడ్డి, సి. : ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు : ప్రయోగములు. పుట 506 – ఆధారం.

ఫిరాక్, నిరాలా, సుమిత్రాపంత్ వంటి రచయితల సంతకాలతో అభ్యుదయ రచయితల ప్రణాళిక తయారై 1936 ఏప్రిల్ నాటికి అది లక్నోలో మహాసభ జరుపుకొంది. అబ్బూరి రామకృష్ణారావు అక్కడి సభలలో పాల్గొని పురిపండా, శ్రీశ్రీ వంటి యువ రచయితలనుకూడ గట్టి 'ఆంధ్ర వర్ధమాన లేఖక సంఘం' పేరుమీద ఒక ప్రణాళిక అచ్చు వేయించాడు.*

ఆంధ్ర సాహిత్య క్షేత్రంలో అభ్యుదయ బీజాలు మొలకెత్త డానికి భారత దేశంలోని అనేక పరిస్థితులు దోహదం చేశాయి. బ్రిటీష్ ప్రభుత్వయుగంలో ఆంగ్ల విద్యావాప్తి ఫలితంగా దేశీయులలో స్వదేశోద్ధరణ సంకల్పం మొదలయ్యింది. 1851లో కలకత్తాలో 'బ్రిటీష్ ఇండియన్ అసోసియేషన్ అనే ప్రజాసంస్థ దేశీయుల హక్కుల రక్షణకోసం ఏర్పడింది. రైతుల పక్షాన నిలబడి వాళ్ళ హక్కులకోసం కష్టనష్టాలకోర్చి పోరాడింది. దక్షిణ దేశంలో దేశీయుల విజ్ఞాన వికాసాని 'హిందూ లిటరరీ సొసైటీ' అనే ప్రజా సంస్థ సభలు జరిపించి ప్రముఖులతో ఉపన్యాసాలు ఇప్పించింది.

ఉద్యోగ రీత్యా ఆంగ్లేయులకు అవసరమైన ప్రాంతీయ భాషాభ్యాసం తెలుగులో క్యాంబెల్ నిఘంటువుకు, బ్రౌను నిఘంటువులకు దారితీసింది. చీకటిలో చిక్కుకుపోయిన తాళపత్ర గ్రంధాలకు ముద్రణ భాగ్యాన్ని కల్గించిన భాషా పోషకుడు బ్రౌనుదొర.

ప్రాథమిక దశలో భారతీయ పత్రికలు క్రైస్తవ మత ప్రచారాని వేదికగా ప్రారంభమయ్యాయి. అవి తెలుగు దేశంలో

* రమణారెడ్డి, కె. వి. : అభ్యుదయ సాహిత్యోద్యమం, వ్యాసం 'సృజన' మాసపత్రిక. జూన్, జూలై 1984. — ఆధారం.

క్రైస్తవ మత ప్రచారంతో మొదలై తత్త్వబోధినితో వేద సమాజ సిద్ధాంత చర్చలకు నిలయంగా మారి ఆంధ్రభాషా సంజీవిని, వివేకవర్ధని, మంజువాణి, వైజయంతి, కళావతి, మనోరమ మొదలయిన పత్రికలు భాషా సాహిత్య విమర్శలకు, సాహిత్య వికాసానికీ విస్తరించాయి.

ఆంగ్ల విద్యావ్యాప్తి ఫలితంగా పాశ్చాత్యుల అనేక రంగాలతో భారతీయులకు గాఢమైన సంబంధాలు ఏర్పడ్డాయని ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఇతర సాహిత్య ప్రక్రియలకంటే తెలుగు కవిత్వంలో ఈ ప్రభావాలు తారాస్థాయికి చేరుకున్నాయి. ఎందుకంటే 'బ్రిటీష్‌వాళ్ళకు నాటకం, రష్యా జాతికి నవల మాధ్యమికం అయినట్లు ఈ జాతికి కవిత్వం మాధ్యమికం కనుక'.*

అప్పటికే ఆంధ్ర దేశంలో కందుకూరివారి సంఘసంస్కరణ మహోద్యమం ఉప్పెనలా పొంగుతుంటే గిడుగువారి భాషా సంస్కరణోద్యమం పండితుల్ని భయకంపితుల్ని చేస్తోంది. 1914 తర్వాత రాయప్రోలువారిని తాకుతూ వచ్చిన కీట్సు, వర్డ్సువర్త్, షెల్లీ స్పందనలు రవీంద్రుని శాంతినికేతనం సాన్నిహిత్యంతో గుండెలోనికి దిగబడ్డాయి.

1907లో రాయప్రోలు సుబ్బారావుగారి 'లలిత' కావ్యం ప్రచురణతో తెలుగులో కాల్పనిక ఉద్యమం ప్రారంభమయ్యింది. అంతకుముందే గురజాడ కవిత్వంలో కాల్పనిక ఛాయలు కనబడతాయి. కాల్పనికోద్యమం యూరప్ సాహిత్యంలోలాగే తెలుగు సాహిత్యం వస్తువులో, భాషలో, శైలిలో ఒక కొత్త సంచలనాన్ని సృష్టించింది.

* శేషేంద్రశర్మ, గుంటూరు : చర్చలు, లేఖలు. పుట. 14.

తెలుగు కాల్పనికవాదులు కాల్పనిక ఉద్యమాన్ని ప్రధానంగా సాహిత్యానికి పరిమితంచేశారు. దేశభక్తి గీతాలు, కావ్యాలు రాసినా సమున్నత ఉద్యమంగా మార్చలేదు. వ్యక్తివాదంగా, పలాయనవాదంగా పరిణమించిన దశలో భావ కవిత్వానికి వ్యతిరేకంగా జండా ఎత్తిన కవులలో అతి ముఖ్యులు శిష్ట్లా, శ్రీశ్రీ, నారాయణబాబు, పఠాభి. వీరి తిరుగుబాటు ఒక ప్రణాళికాబద్ధంగా కానీ ఒక త్రాటిపైగానీ నడిచింది కాదు. వీరిలో శ్రీశ్రీ 1933 లోనే భావ కవిత్వం నుంచీ బయటపడి అభ్యుదయాన్ని ఆహ్వానించాడు. ఇంచుమించు శ్రీశ్రీతో పాటే గొంతు మార్చుకున్న ప్రతిభాశాలి నారాయణబాబు.

పై నలుగురు తమ నవ్యరీతులతో నాలుగు మార్గాల్ని తొక్కారు. పురిపండా అప్పలస్వామి వీరిలోకే వస్తాడు. రొమాంటిసిజం, సింబాలిజం, సర్రియలిజం మధ్యవున్న అంతర్ పరిణామాలను గుర్తించి శ్రీశ్రీలాగే నారాయణబాబు స్వతంత్రమైన క్రమ వికాసాన్ని పొందుతూ వచ్చాడు.[1]

పాశ్చాత్య రొమాంటిసిజమ్‌లోంచి వచ్చిన మొలక సింబాలిజం. సింబాలిజానికి కొత్తరూపమే సర్రియలిజం.[2] కానీ శ్రీశ్రీలో సర్రియలిజం ఉపదేశంగా (ప్రాథమిక అభ్యాసంగా) నిలకడ ఇవ్వగలిగిన సామర్థ్యంగా నిలువలేకపోయింది.[3]

---

1. శ్రీరాములు, గూడ : శ్రీశ్రీ అధివాస్తవిక ఉద్యమం, యుగ కవి సంస్మరణ సంచిక. పుట. 4 చూడండి.

2–3. Romanticism కి చెందిందే Surrealism (Herbert Read) చేతన పుట. 4 చూడండి.

3)

ఫ్రాయిడ్ నిర్వచించిన అంతశ్చేతనా లక్షణాల్ని జెరార్డ్ లూజన్ ఇలా తెలియజేశాడు.

"Froeud's title to glory is that he advanced alone, inadequately equipped but Consumed by the desire to know, and heal-advanced in to that irrational, terrifying Universe, full of fantacies and pre-logical Constructions, in which time, space and Cousality play their Parts in a special characteristic way, a mode of experience whose exploration and Comprehension have brought out the full meaning of Rimbaud's famous" Jest Unnature.[1]

శ్రీశ్రీ అధివాస్తవికతా తత్వాన్ని సీరియస్‌గా ఆచరించ లేక పోయాడనిపిస్తుంది. సర్రియలిజంలోని అధిక్షేపణనీ, విదూషకత్వాన్నీ, విభ్రమాన్నీ ప్రధానంగా స్వీకరించాడు. అయితే నారాయణబాబు సర్రియలిజంలోని తాత్వికాంశంతో కొంతయినా తన స్వంత అవగాహనను జోడించి అతివాస్తవికాన్ని అధివాస్తవికంగా మార్చి,[2] సర్రియలిస్టు సిద్ధాంత అవగాహనకు నూతన, లోతయిన సర్రియలిస్టుదారులకు మార్గ దర్శకుడయ్యాడు.

అధివాస్తవికతను గురించి తెలుగులో విమర్శ సమ్యగ్ దృష్టితో సాగలేదనిపిస్తుంది. తెలుగు కవులకు సర్రియలిజాన్ని ఉపదేశించిన శ్రీశ్రీయే అధివాస్తవిక గాఢతను ఒడిసి పట్టుకోలేక పోవటంతోను, అధివాస్తవికతపట్ల నిలకడ గలిగిన దృష్టి లేకపోవటంతోను సర్రియలిస్టు సిద్ధాంతాల పొంగునుంచి బయటపడి దాని అసలు తత్వంతో తాదాత్మ్యంచెందే సహనం, స్వాస్థ్యం లేక

1. Jerard Lauzun, : Sigmund Froaud - The Man and his Theorems. Page 112.
2. సోమసుందర్, ఆవంత్స : పురిపండా ఎత్తిన పులిపంజా. పుట 40 చూడండి.

పోవటంతోను, విమర్శకులు సహితం అప్పుడు వచ్చిన కవిత్వాల్ని అధివాస్తవిక కవిత్వాలుగా భావించకుండా, స్రియలిస్టు తాత్విక కతను, తెలుగుకవుల ప్రభావాలను సహృదయతతో వివేచనతో గుర్తించి స్రియలిస్టు మౌలిక దృక్పథాన్ని తెలుగు సాహిత్యంలో ప్రోత్సహించకపోవటంతోనూ – తెలుగు సాహిత్యంలో స్రియలిజం హాస్య స్థాయికి దిగజారిపోయింది.[1]

నారాయణబాబుకు స్రియలిజంపై ఉన్న పట్టు శిల్పపరమైన శక్తి సామర్థ్యాలు దీర్ఘగీతమయిన 'మౌనశంఖం' లో స్పష్టంగా గమనించవచ్చు. రుక్మిణీనాథశాస్త్రిగారి అభినందనలో దీన్ని గుర్తించవచ్చు.[2]

నారాయణబాబు అగమ్యగోచరమైన అధివాస్తవిక కవిత్వాన్ని రాశాడన్న విమర్శ సరైందికాదు. నారాయణబాబు

"తెలుగులో అధివాస్తవికత సాధించినది ఏదయినా ఉందా అనే ప్రశ్నకు ఏమీలేదు అనటం తొందరపాటు సమాధానం అవుతుంది. వెల్చేరు నారాయణరావుకూడా దీన్ని లోతుగా పట్టించుకోలేదు. తెలుగు రచనా విధానంలో అధివాస్తవికత తెరిచిన అవకాశాన్ని సి. నా. రె. గారు కొంత వెలకట్టగలిగారు" – చేతన. పుట 6.

అధివాస్తవిక రచనలు అర్థాల వెతుకులాటకు లొంగకపోవటంలో 'అర్థాన్ని అడవిలోకి తోలి' అనే అధివాస్తవికుల అర్థవంత మయిన మాటని హాస్యంగా తీసుకున్నారు విమర్శకులు – చేతన, పుట 6.

2. రుక్మిణీనాథశాస్త్రి, జలసూత్రం : 'మౌనశంఖం' అభినందనగీతం, రుధిరజ్యోతి.

యొక్క జీవితపు లోతునూ, రీతినీ యధాతథంగా అర్థం చేసుకోక పోవటమే కారణం.

అభ్యుదయ సాహిత్య విమర్శ అంతా శ్రీశ్రీతో అల్లుకు పోయింది. ఇక శ్రీశ్రీ ప్రక్కనున్న వారిమీద, వారి సాహిత్య కృషిమీద దృష్టి సరిగా నిలపకపోవటం సాహిత్య విమర్శలో స్పష్టంగా కన్పిస్తుంది. ఆధోరణిని ఛేదించి పఠాభిని కాస్త బయటికి వెలుగులోకిలాగి తెలుగు కవిత్వ విమర్శకు కొత్త కోణాన్ని పట్టు కొచ్చారు వెల్చేరు నారాయణరావుగారు. కానీ ఆయన అధి వాస్తవిక లక్షణాల్ని బేరీజు వేయటంలో ఇంకా తృప్తిగా ప్రిజిడీసెస్ లేకుండా ఆలోచించలేదు.

అధివాస్తవికులు మనపెద్దలు చెబుతున్నంత రాక్షసులుకారు. మూర్ఖులు అంతకన్నా కారు. వారిని సాల్విడార్ డాలీ వివరించేంత వరకూ ఫ్రాయిడ్ కూడా అర్థంచేసుకోలేక పోయాడు.

"Until now I have been inclined to regard the Surrialists who apparently have adopted me as their patron saint, as Complete fools. That young Spaniard (Salva-Dali) with his Candid, fanatical eyes and his undeniable technicol mastery has Changed my estimate" 1

బలమయిన అనుభూతి లేనప్పుడు పేలవమయిన స్రియలిస్టు గీతాలు వస్తాయి. పేలవమయిన అనుభూతిని నవ్యత పేరుతో బాలగంగాధర తిలక్ చెప్పినట్లు – ఇది పసితనం, ప్లస్ వెర్రితనం ఇంటూ డికడెన్స్‌గా కవిత్వాన్ని సృష్టించటమవుతుంది.

1. Lauzen, Gerard : Sigmund Froeud The Man and his theorems. Page 109.

చైతన్యాన్ని కవిత్వంలో అనుభూతి పర్యవస్థాయికి వాడుకున్న అభ్యుదయ కవుల్లో నారాయణబాబు మొదటివాడు. వెల్చేరు నారాయణరావుగారు అన్నట్టు తిలక్ కాదు. శ్రీశ్రీ మార్గం ప్రత్యక్షంగా అభ్యుదయ పరంగా, విప్లవ పరంగా, వస్తు పరంగా కొనసాగుతుంటే నారాయణబాబు మార్గం పరోక్షంగా నగ్నముని తదితర దిగంబరకవులు, తిలక్, బైరాగి, అజంతా, గుంటూరు శేషేంద్రశర్మ, వేగుంట మోహనప్రసాద్, ఇస్మాయిల్ కొంతమంది యువకవుల ద్వారా ఆయనలోని సాంప్రదాయ ప్రతీక దృష్టిని విదిలించుకొన్న సాహిత్య విలువలతో అనుభూతి పర్యవస్థాయికి చేరుకున్న చైతన్యంతో కొనసాగుతోంది. అట్లే సర్రియలిస్టు తాత్త్వికతకూడా ఏదో ఓ రూపంలో కొనసాగుతోంది.

నారాయణబాబులా విధ్వంసత్వాన్ని ఆయుధంగా తీసుకొన్నవాళ్ళు దిగంబరకవులు.[1] "ఏ ఆచ్ఛాదనలకీ తలవొగ్గని ఏ భయాలకూ లొంగని నిరంతర సజీవ మానవుడికోసం ఎలుగెత్తి పిలుస్తున్నాం"[2] అని పాఠకుడికై గొంతెత్తి అరచినా "దేన్నీ నమ్మకు, నీలోపల ఈ ముసుగులలోపల ఈ వంచన అంచుల కింద ఉన్న నీ అసలు స్వరూపాన్ని, నీ తనాన్ని నమ్ముకో"[3] అని పాఠకుడికి బోధించినా నారాయణబాబు ఆనాడే తన పాఠకుడ్ని ఉద్దేశించి అన్న ఈ వాక్యాలు గుర్తుకొస్తాయి.

"కాలం కన్నువిప్పిన నాటినుండీ కవులు పఠితలతో రకరకాల సంబంధం పెట్టుకొన్నారు. అతినవ్యకవి నీతో కల్పించుకొన్న

---

1. రమణారెడ్డి, కె. వి. 'అక్షర జగత్తు' – వ్యాసం. 'ఆంధ్రప్రభ' దినపత్రిక.
2. దిగంబరకవులు : దిగంబర కవితా సంపుటి. పుట 70.
3. నారాయణబాబు, శ్రీరంగం : ప్రవర – 'రుధిరజ్యోతి'.

సన్నిహితత్వం ఎవరూ కల్పించుకోలేరు. అతినవ్య కవిమాట అభిమానపుమాట. నీరక్తంనుంచీ ఉద్భవించాడు, నువ్వే"* పీఠికలోని ఈమాటలు (రెంటాల 'సంఘర్షణ'కావ్యానికి ఒదుగుతాయో లేదో గాని) కవి, శ్రోత సంబంధానికి వీటిని సరైన ఉదాహరణగా చెప్పవచ్చు.

'కదలేది కదిలించేది, మారేది మార్పించేది, పాడేది పాడించేది, పెనునిద్దుర వదిలించేది, మునుముందుకు నడిపించేది కావాలోయ్ నవకవనానికి', అన్నపాదాల్లో కవి, శ్రోత (పాఠకుడు) మధ్య ఉన్న ఏక సూత్రస్థాయి సంబంధాన్ని గుర్తించవచ్చు. అయితే వెల్చేరు నారాయణరావుగారి వర్గీకరణలో కవి, శ్రోత (పాఠకుడు) మధ్య ఈ స్థాయి సంబంధం (ఒకే వ్యక్తిలోనే, కవిలో కూడా శ్రోత, పాఠకుడు కలిసి ఉంటారు. రెంటికీ గ్రాహ్యతే ఆధారం. అవగాహనకోసం లేదా కవిత్వం కల్గిస్తున్న ప్రేరణలను పరిశీలించటం కోసం తప్ప- తన్ను శ్రోతగా పాఠకుడిగా విభజించుకొని స్పందనల్ని, అనుభూతుల్లోని తీవ్రతల్ని వేరు చేసుకొని గ్రహించటమే లక్ష్యంగా చేసుకోడు) ఉన్నట్టుగా కన్పించదు. సామాజిక పరిస్థితుల్తో సమస్యలతో కదిలి కదిలేలా నడిపి నే నడిచేలా శ్రోత (పాఠకుడు) కన్పిస్తాడు.

'సరససాహిత్యమూ పాఠకుడి అంతరంగానికి రచయిత విజ్ఞప్తి మాత్రమే. తనలక్ష్యం నెరవేరాలంటే పాఠకుడి స్వేచ్ఛ ఉండాలి. పాఠకుడి ఉద్రేకాలు ప్రకోపించే స్థితిలో అతనికి స్వేచ్ఛ లేదు. అందుచేత ఉద్రేకాలను ప్రకోపింపచేసే రచయిత తన లక్ష్యాన్ని నాశనం చేసుకొంటున్నాడన్న మాట'- ఈమాటల్ని అన్న వెల్చేరు

నారాయణబాబు, శ్రీరంగం : ప్రవర - 'రుధిరజ్యో

నారాయణరావుగారే సార్త్ర్ మాటల్ని ఉటంకిస్తూ నిష్పాక్షిక దృష్టి రచయితకు అసాధ్యమని చెబుతారు. అయితే పాక్షిక దృష్టి కలిగిన రచయితకు తన పాక్షిక దృష్టే సర్వస్వంగా మారటం వలన పాఠకులు ఒప్పుకోవాలనే ఉద్దేశ్యం గాఢంగా ఉంటుంది. అంతే కాకుండా కవిలో పాక్షిక దృష్టి ఉద్రేకాల్ని ప్రకోపింప జేయకుండా పాఠకుడి అంతరంగిక స్వేచ్ఛను మరవకుండా విజ్ఞప్తిగా మాత్రమే కృషి చేస్తుందని భావించటం మోసగించుకోవటమే అవుతుంది. అలాంటి రచయితో కవో పాఠకుడి అంతరంగ స్వతంత్రతను ఎలా గౌరవించగలడు ? అంతరంగ స్వేచ్ఛను ఎలా పరిరక్షించ గలడు ? కాబట్టి పాక్షిక దృష్టి కలిగిన రచయితల రచనల్లో పాఠకుడు మనస్సును రెచ్చగొట్టే, ప్రలోభపెట్టే అంశాలు అంతర్లీనంగా నయినా ఉండి పాఠకుడి అంతరంగ స్వేచ్ఛను హరిస్తాయి. హరించేందుకే ప్రయత్నిస్తాయి. ఈ వైరుధ్యాన్ని వెల్చేరు నారాయణరావుగారు మరచి పోయినట్టు అనిపిస్తుంది. ఇక రూపవ్యత్యాసంతో కవి శ్రోతకుమధ్య అగాధాన్ని గుర్తించి అసలు వాస్తవాన్ని మరిచి పోరాదు కవికి శ్రోతకు మధ్య ఉండే సంబంధం ఒకే తాటి మీద నడకలాంటిది. ఈనడక సాగనప్పుడు కవికి శ్రోత దగ్గరగా రాలేడు. గురజాడ విషయంలో జరిగింది ఇదే. అయితే వెల్చేరు నారాయణ రావుగారు పరిశీలించినకోణం తద్భిన్నమయినది.*

అధివాస్తవికత ఏ ఆచ్ఛాదనలు, ఏ సంకెళ్ళూ లేని స్వేచ్ఛాయుత మానవుడ్ని చూడాలని కాంక్షించింది. మనిషి ఆలోచనలు, చర్యలు అతని జీవితమంతా నిద్రాస్థితిలోనే జీవం పోసుకొంటున్నాయి. ఆ ప్రదేశానికి వెళ్ళటానికే అతను భయ

* నారాయణరావు, వెల్చేరు : తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. పుటలు 218, 220 చూడండి.

పడుతున్నాడు. ఆ ప్రదేశానికి తీసుకెళ్ళాలని ప్రయత్నం చేసేది కవితా మార్మికత కాదు, అధివాస్తవికత. మనసును బంధ విముక్తిని కావించేది, లేక అలాంటిది. దానికి భావం పదార్థం కంటే అత్యంత అధికమైనది. మేం తిరుగుబాటు చేయటంలో సిద్ధహస్తులం దానికి ఏ పద్ధతి అవలంభించ వలసి వచ్చినా వదలం. మాకు సాధ్యంకాని పద్ధతేమీ లేదు. మతం, వ్యవస్థ, నీతి విధించిన సంకెళ్ళు బద్ధలు కొట్టాలి. అప్పుడే నూతన మానవుడి ఆవిర్భావం జరుగుతుంది, అన్న అధివాస్తవిక స్ఫూర్తి తెలుగు కవిత్వంలో ఆచరణలోకి వచ్చేంత వరకూ (శ్రీ)(శ్రీ), నారాయణబాబులు గుర్తుకు వస్తారు. ముఖ్యంగా సక్రియలిస్టు చైతన్యంతోనే గాఢంగా జీవితాంతం తపస్విలా ఉండిపోయిన నారాయణబాబు సాహిత్య చరిత్రనుంచీ చెరిగిపోడు.

# సా మి ధే ని*



"సంకుల పయోధరాచ్ఛటా పంకిల నిబిడాంధకార నిర్జన వీధికాంతరముల నాచరించెడి వేళ ప్రోన్మత్తరీతి ఆవశ మొనరించు, నందన వనీలతాంత కాంతస్రజమ్ముగా నొకక్షణమ్ము"1 కౌగిలించగా అందులోని నిర్జీవత్వాన్ని తెలుసుకొన్నాడు. శ్రీశ్రీ. అదే ప్రేరణపొందిన నారాయణబాబు "సంజ్ఞ సరిహద్దునలో మాంచాల లోయలోన నీడలు కూడేచోట అగణిత గణిత చిహ్నాలు ఆకాశపు శాఖలపై పొంచి సంక్రమించేచోట"2 తన ఆకలిని, లోకం ఆకలిని మేసి రుధిరజ్యోతిని ప్రేల్చి (త్రేంచి) వివేకపు విరిగిన గద్దెపైన అరాచకపు రాచరికాన తలక్రిందులుగ తపస్సుకు ఉద్యమించాడు.

హంతకు చేతిని
కత్తులు
వింత హృదయమున
భావాలు
శిరస్సున రతనము
గళమున విషమ్ము
కలమ్ము నోసలో

1. శ్రీశ్రీ, శ్రీశ్రీ సాహిత్యం : కచనకావ్య విభాగం. పుట 113.
2. బైరాగి, ఆలూరి : 'శ్రీరంగం నారాయణబాబు' – స్మృతికవిత ఆగమగీతి.

* సామిధేని : యాగ ప్రారంభానికిముందు వినిపించే ప్రణవనాదం.

కాటుక మబ్బులు
కాగితమే కంపించింది
సూరన అడిదాన్ని
తిక్కన ఖడ్గాన్ని
పేలిన బిజాపూరు
ఫిరంగి గుండు
నాగుండె — సామి థేని (రుధిరజ్యోతి)

అని శంఖం పూరిస్తూ "ప్రకృతి కాంతాధర రసమ్ము వడియగట్టి పోత పోసినట్లొప్పు నొప్పుల గులాబి క్రూర కంటక హతి సొంపు గోలుపోక కన్నులకు విందొనర్చెడు కాలమెపుడొ"1 అని తన ప్రేయసి సంఘం, విధి అడ్డురాకుండా దైవాన్ని ప్రార్థించే అనుభూతి దశనుంచి సంఘాన్ని విధిని బలంగా ధిక్కరించే ధ్యేయాన్ని చేరుకున్నది నారాయణబాబు కవిత్వం.

"సూర్యుని వెలుతురుల్ సోకువందాక, అందాకగల యనంత భూతలిని మన భూమివంటి చల్లని తల్లి"2 లేదని స్తోత్రాలు పాడుకుంటూ కాల్పనిక మబ్బులమీద దేశమాతను దర్శిస్తున్న భావకవిత్వానికి ఎదురు తిరిగిన కళ్లలో ఎర్రని జీరలు వాస్తవానికి అద్దం పట్టాయి.

ఉసురుసురైంది
ఉమ్మలించింది
అసువులు వీడి
చచ్చిన దేశమాతయై
చాపచుట్టగ నేలకు వాలింది. — దేశమాత

1. నాయని : సౌభద్రుని ప్రణయ యాత్ర.
2. రాయప్రోలు : 'జన్మభూమి' - ఆంధ్రావళి.

సమాజంలోని క్రౌర్యం కౌటిల్యం దారిద్ర్యం, దగాభయం కరత్వాన్ని మంచు తెరల్లోకి దించింది భావకవిత్వం. కంటికి కనిపించేదంతా బాగా ఉందనే పలాయన వాదానికి నింగి మూలల నీలి పందిళ్లువైచి వింత చిరుమల్లెతోట వేయించినానని భావకోకిల పాట పాడుతుంటే మంచు తెరలు కరిగి

నల్లని త్రాచుకోరలు
తెల్లని మసూచికుండలు
గగనమ్మున చుక్కలు

కవిత్వానికి లక్ష్యంగా కనిపించాయి నారాయణబాబుకు.

భావకవులకు జీవితంలో అశ్వరీ శృంగార నాయికలు వారితో విరహాలు మాత్రమే కనిపించాయి. ఆ వర్ణనే ప్రాణ ప్రదమైనది. కానీ నారాయణబాబుకు కవితా వస్తువు భిన్నమయింది. ఆయన కవిత్వానికి కవితా శక్తికి మూలం వేరు, భావకవుల దృష్టికి పూర్తిగా భిన్నమైంది. అది జీవితంలోని చేదునిజం. ఆకలి, దారిద్ర్యం.

వ్యోమ మార్గముల
ఊహ కతీతంబగు
దృగంచలాలకు
దొరకని
వ్యక్తి
సంచరించినది
సంచలించినది
సందేశాలను
పెంపొందించే
మూగకేకలే వేసింది — కావాలి

రోగాన్నీ, దారిద్ర్య దౌర్భాగ్యాన్నీ మరిచి మబ్బుల్నీ, చుక్కల్నీ, మల్లెల్ని ప్రణయపు ఊహలతో నింపివేసిన భావ కవిత్వాన్ని ధనస్సులా వంచాడు నారాయణబాబు. వీధిపాటకుల కుష్ఠి రోగి గీతాలూ, ప్రపంచ దరిద్ర సంగీతం ఆయన కవిత్వానికి నేపథ్యం. ఆయన సమాజంలోని చీకటి అంచుల్ని తెంచి భావ కవిత్వంలోని నిర్జీవత్వంతో కుంగిపోయిన కవిత్వానికి వెన్నముక గుచ్చి కవిత్వ దిశను మార్చాలని తీవ్రంగా ప్రయత్నించాడు.

"నాదంత్ర సం
గీతానికి
భూమ్యాకాశాలే
తాళం చిప్పలు
కష్టమయిన
సంకీర్ణపు
నరజాతికి
ఆకలి
ధృవతాళం
వెయ్యిమరి" అన్నాడు. – దరిద్ర సంగీతం.

ఇనుని కప్పి ఎగిరే ఇనుపడేగల రెక్కల చప్పుడులో, మృత్యు జననాశ్వాల వెనుడెక్కల చప్పుడులో, కేకలు, కేకల కేకలు కే వినిపించనిచోట, నారాయణబాబు కవిత్వం ప్రతి పదమూ ఒక శకటంగా ప్రతిఊహా ఒక వ్యూహంగా భావకవిత్వానికి భరత వాక్యం పాడింది.

"రేయి ముసుగు
పుడమి కొసగి
డివ సావ సాను

కాష్ఠ జ్వాలల్లో
కాలం
సహగమనం
చేసింది" – కావాలి

సమాధిలో
మృత శిశువట్టుల
జలదాంతర శశి – కావాలి

ఆయనకు కన్పించాయి.

అంతే కాకుండా ఆయన ప్రపంచ వ్యాప్తిగా విస్తరిస్తున్న మార్క్సిజపు దిగ్విజయ సాఫల్యాన్ని

"సమరాహ్వానము
నినదించే
రణ భేరీ
రక్త రావము
అరుణ రాగ
తరుణ సంధ్యను' ను – 'ఢంకాబజావ్'

కవిత్వంలోకి ఆహ్వానించాడు.

ప్రపంచ వ్యాప్తంగా ఫ్యూడల్, బూర్జువా, కార్మిక వర్గాల్లో అలుముకుంటున్న విప్లవ పోరాటాల్ని, తిరుగుబాటు తత్వాన్ని అభివ్యక్తిగా మార్చాడు. శ్రీశ్రీతో పాటు నారాయణబాబు

ఇనుప సరుకు ఎనుపోతు
ఎము నెక్కడో దింపేసి
తను మాత్రం ఎదురాయెను – ఊరవతల.

పెద్దబయలు, నట్టనడుమ ఒక పతాక రాబోతున్న పెనుగాలి కుసికట్టినట్టు నారాయణబాబు కవిత్వం. అప్పటికింకా నిదురలో

ఉండి కదలని కిందిలోకపు జీవాల మూతపడిన తలుపుల్నీ, టప టప మన కొట్టుకొని కిటికీల్నీ, నేలపై నే పడివున్న ధూళికెరటాల వాస్తవాల్ని కవిత్వంలోకి లాగి

మిన్ను విప్పిన
రక్త పతాకం
మన్ను సత్తువె
తెలిపింది
ప్రభాత పశ్చిమా నిలము
పాడిన పాట
కాకాసురుని కథ
జ్ఞాపకం తెచ్చింది
నన్ను నే తెలుసుకున్నాను
ఆగండి ! — గడ్డిపరక

అంటూ వర్గ చైతన్యాన్ని కలిగిస్తుంది.

ఆనందాన్ని ఉల్లాసాన్ని తియ్యటి శోకాన్ని కవితా వస్తువుగా స్వీకరించటాన్ని నిరాకరించి బలై పోతున్న అధోజగత్ సహోదరుల్ని తిరుగుబాటుకు ప్రేరేపిస్తుంది.

అంతా ఆరిపోయింది
గాలి కూనిరాగం తీస్తూ పోతోంది
చెట్లు వణుకుతున్నాయి
జంతువులు చనిపోయాయి
ఎవ్వరూ మిగలలేదు చూడు చూడు
చుక్కలన్నీ మెరవటం మానివేశాయి
భూమి తిరగటం మానివేసింది

[illegible]
[illegible]

ఒక శిరస్సు ముందుకు వంగింది
జుత్తు తోటి రాత్రిని ఊడ్చివేస్తూ
మిగిలివున్న కట్ట కడపటి ఘంట
స్తంభం పన్నెండు కొడుతోంది.*

తెలుగులో మౌనఘంటారావం నారాయణబాబు కవిత్వం.

కట్ట కడపటివరకూ స్ర్రియలిస్టు కవిత్వానికి ఖండిత శిరస్సును అర్పించిన భైరవి నారాయణబాబు. ఏకైక వ్యక్తి, బ్రహ్మాండపు గోదాలో మిత్రుల నెత్తుట తడిసిన జేగురు మంటిలోన కాలునిపై కలియబడి కుస్తీ పట్టాడు తప్ప కీర్తి, కనక సౌధ సింహద్వారంవద్ద పడిగాపులు కాయలేదు నారాయణబాబు. ఆయన స్వయంగా దీనిమీద ఎద్దేవాచేస్తూ రాసిన గీతం గమనించదగింది.

ఖ్యాతిగడించే
గీతంగాసి
ప్రేయసి కంకిత
మీయాలంటూ
మూతి బిగించి
చేతులు నులుముతు
కూచున్నావా
కపీ ! — 'కపీ !'

నారాయణబాబు ప్రపంచ దారిద్ర్యాన్ని పారద్రోలేందుకు మార్క్సిజాన్ని అంగీకరించాడు. మనసిక (భావ) దారిద్ర్యాన్ని వదులుకొనేందుకు కవిత్వంలో స్ర్రియలిజాన్ని ఆశ్రయించాడు.

---

* పాల్ రివర్డ్ (ఫ్రెంచి) : ఆంగ్లంనుండీ బైరాగి తెలుగుసేత, ఆగమ గీతి.

ఆయన మార్క్సిజమ్, సర్రియలిజమ్ అన్న రెండు విభిన్న వాస్త వాల్ని మేళవించి గాఢమైన కవితా సాధనచేశాడు. అందుకే లోహ విహంగాలను ఎగిరించాడు. సుప్తభుజంగాలను కదిలించాడు. మస్తిష్క కులాయంలో మనో వల్మీకంలో మానమృదంగాలను పలికించాడు. శాంతి తరంగాలను కెరలించాడు".* హృదయంలో దీపం పెట్టాడు. మంత్రనగరి సరిహద్దులు ముట్టాడు. అంతరాంతర భయంకర ప్రాంతాారలలోన విహారం చేశాడు. ముళ్లదారిలో సంచరించాడు.

అందుకే ఆయనకు నిరుపహతి స్థలాల్లేవు. రమణీ ప్రియ దూతిక తెచ్చియిచ్చు కప్పురపు విడియాల్లేవు. జరీ నగిషీ కాశ్మీర శాలువలు, గండపెండేరాలు లేవు. కాలిన ప్రేయసి చమురు కంపు లోకంలో, మర ఫిరంగులూ, మందు గనులు ప్రేలేచోట నారాయణ బాబుకు గాయాల పూలతోటలో

'నీసజీవ అంభారవమునకే
చెవులు మూసుకొని
నా నిర్జీవపు గీతాలను
వినేందుకు
సభచేసిన లోకం' మాత్రమే కనిపించింది.

(గేదెపెయ్య). సెభాస్ అన్నాడు నారాయణబాబు. ఇలా పరిశీలించి చూసినప్పుడు తనకూ ప్రపంచానికీ ఉన్న వ్యత్యాసాన్ని గుర్తించగా వింతగా అనిపించింది. తనలోకి స్వగతంలోకి జారు కున్నాడు. అదృష్టవంతులు మీరు, వెలుగును ప్రేమిస్తారు. ఇరు లను ద్వేషిస్తారు. మంచికి చెడ్డకి నడుమ కంచు గోడలున్నాయి. మంచి గదిలోనే మీ ఊహలు సంచరిస్తాయి. ఇదివరకే ఏర్పడింది ఆ గది అందుకే వడ్డించిన విస్తరి మీ జీవితం.

---

శ్రీశ్రీ : సాహసి (గేయం) - మహాప్రస్థానం.

మంచినిగురించి మర్యాద మప్పితంగురించి నడత నాణ్యం విలువల విషయం గురించి నిశ్చల నిశ్చితాలు మీవి. మీ కన్నుల చూపులు సరళ రేఖలో ఉన్నాయి. రేఖ చెదిరితే గొల్లుమని పోతారు. రేఖ అవతలి వారంతా నేరగాళ్లు మీకు. రేఖను రక్షించడానికే న్యాయస్థానాలు, రక్షక భట వర్గాలు, చెరసాలలు, ఉరికొయ్యలు. రేఖను కాపాడుతూ వుంటాయి. అంటూ సాగిపోయాడు.

నారాయణబాబుకు శోచన మార్గం ప్ర పూరి విరుద్ధంగా అనిపించింది, కనిపించింది. ఆయన దాన్ని గురించి సమాధానం చెప్పుకున్నాడు.

అభాగ్యులం మేము, సరిహద్దులు దొరకని సంధ్యలలో మా సంచారం. అన్నీ సమస్యలే, అన్నీ సందేహాలే మాకు. వెలుగులోని చీకటే ఇరులలోని మిణుగురులే చూస్తాం. మీకు దోషాలలోని ఒక సుగుణం, మాకు పుణ్యాలలోని ఒక ఘోరం. వ్యత్యాసాలు, వ్యాఘాతాలే మాకు. మాదృష్టిది వర్తుల మార్గం, ఆద్యంత రహితం. సంధ్యాజీవులం, సందేహభావులం, ప్రశ్నలే ప్రశ్నలె. జవాబులు సంతృప్తి పరచవు. ముళ్లూ, రాళ్లూ అవంతరాలు ఎన్ని ఉన్నా ముందుదారి మాది.

అలాగే సాగుతూ హర్ష శోకాల ఋతువులు, రక్తాశ్రువులు, ఆశల ఆకాంక్షల ఆద్యంతాలు కడచి పాములా పాత్రబతుకు కుబుసాన్ని విడిచాడు. నిర్జల నిష్ఫల వంధ్యా సంధ్యాభూమిని తాకుతూ, చివరకు రుధిర సరసి జనాభిమధ్య రక్త పింగళ మధురస్పర్శ దార్చి, కీలలెగిసేచోట దివ్యరాశ్మి నివహావేశ్మం ప్రాణజ్వాల మధ్య నారాయణబాబు తుదని రుధిరజ్యోతీ మానశంఖాన్ని అందుకున్నాడు.

కొండలోయలలో పూలతోట
చెట్లులేవు! అన్నీ పూవులే
ఉపనిషత్తులు తుమ్మెదలై
ఝుంకారం చేస్తున్నాయి
పార్వతి నగ్నంగా నిలబడి
పూలు కోస్తున్నాది
ఈశ్వరుడు నిద్రపోతున్నాడు
పార్వతి దర్శనం అయ్యేసరికి
నాబట్ట అంటుకున్నాది
నే కాలి పోతున్నాను
మూగనై నిలుచున్నా
దగ్గరగా ఒక మానశంఖం తోచింది
మానశంఖం స్పృశించా
నాగుండె అంతా అంసమై
'సోహం' అని అరచింది

— 'మానశంఖం'

రుధిర జ్యోతి మానశంఖం రమ్యత చూసి రూపోన్మత్తుడయ్యాడు. రుధిరజ్యోతి మానశంఖం ఘోషను చవిచూసి రాగోన్మత్తుడయ్యాడు.

# 4 దరిద్ర సంగీతం

(రుధిరజ్యోతి కవితా వస్తువు)

"I know of nothing finer, more complex, more interesting, than man. He is every thing".[1]

— Maxim Gorky

"one must believe, one must
believe that man has the power
to be free, to be better
than what fate holds in store for him"[2]

— Paul Eluard

- ఇది మహాకవుల కవితా వస్తువు.

"Poetry is beautiful and eternal, like the ears of corn and the stars. It is Created for living and serves people".[3]

— IZVESTIA

" ... ... ... ... ... art is the reproduction of reality in artistic images".[4]

— GRIGORYAN

- ఇవి కవిత్వానికి లక్ష్యం, లక్షణం.

---

1–2. Ovecharnenko, A : Socialist Realism and the Modern Literary Process. Page 9.

3. Ovecharnenko, A : Socialist Realism and the Modern Literary Process. Page 34.

4. Grigoryan, M : N. G. Cherny Shevsky's World out look.
N. G. Cherny Shevsky Selected Philosophical essays Page 41.

"సకల మానవ మేధాక్రియలకూ ధ్యేయం ఉన్నతసంస్కృతీ సంపన్నమైన ఉత్తమ మానవజీవితమనే. ఉన్నత మానవసంస్కృతీ ప్రమాణాలు నిరూపించడం, మానవ మనః ప్రపంచపు సంకుచిత స్వార్థదుర్గాలు బద్దలు కొట్టడం. నూతన సౌందర్యలోకాల దర్శనం చేయించడం. నూతన ఆనందమయ జీవిత వ్యవస్థకు, మానవహృదయాలకు పరిపక్వం చేయడం – ఇవీ ఉన్నత సాహిత్యలక్ష్యాలు."*

సాహిత్యం జీవితానికి వెలిగా, వేరుగా, ఒంటిస్తంభపు మేడ మీద కొలువయిన ప్రత్యేక ప్రపంచమేమీ కాదు. జీవితంలో అదీ ఒక భాగమే. ఉన్నత సాహిత్యానికి గర్భస్థానం జీవితమయినట్లే దాని గమ్యస్థానంకూడా జీవితమే.

సాహిత్యం ఒక ప్రత్యేక రంగమయినా జీవితంతో పెనవేసుకొన్నదే. దానికి ఒక స్వతంత్ర ప్రతిపత్తి ఉన్నా వివిధ రంగాల పరస్పర సంబంధాల మధ్య దాని ఉనికి వేరయినదికాదు. అట్లే దానికి హద్దులున్నప్పటికీ హద్దుల్ని నిర్ణయించడం కష్టం. అందువల్లే జీవితంలోని మరే రంగం నుంచైనా సాహిత్యం ప్రేరణ పొందవచ్చు. ఆ ప్రేరణప్రోత్సాహం రాజకీయాలు కావచ్చు, తాత్త్విక చింతన కావచ్చు, మరేదైనా కావచ్చు.

సమాజం ఫ్యూడల్ వ్యవస్థనుంచీ బూర్జువా వ్యవస్థకు మారినప్పుడు ప్రబంధ కవిత్వం గతించి భావకవిత్వం వచ్చింది. ప్రతి వ్యక్తీ తన హృదయ పరిపక్వతనుబట్టి జీవితానందాన్ని ఆస్వాదించవచ్చుననే లక్ష్యాన్ని నిర్దేశించుకొన్నారు. కవిత్వాన్ని జీవితంకంటే ఉన్నతమయిందిగా భావించారు భావకవులు. వాస్తవ జీవితానికి దూరంగా ఆనందాన్ని వెతుక్కున్నారు. జీవితానికీ కవి

---

* రామచంద్రారెడ్డి, రాచమల్లు: సారస్వత వివేచన–లక్ష్య నిర్వచనం.

త్వానికీ అగాధాన్ని కల్పించుకున్నారు. జీవితంలోని వాస్తవమైన ఆనందాన్ని, చైతన్యాన్ని, సౌందర్యాన్ని దూరంచేసుకొన్నారు.

అభ్యుదయ కవుల తిరుగుబాటు సరిగ్గా ఇక్కడినుంచే ప్రారంభమయ్యింది. భావకవితానందం మత్తులోంచీ, క్రియారాహిత్యంలోంచీ విముక్తిని ఆశించారు. నిరంతర జీవిత సమరానికి కావల్సిన సజీవత్వాన్ని, చైతన్యాన్ని సాధించేందుకు మార్క్సిజాన్ని ఆయుధంగా స్వీకరించారు. దాంతో అభ్యుదయ కవుల ఆలోచనా విధానంలో మౌలికమైన మార్పు వచ్చింది. ఆ మార్పు వారి కవిత్వంలో ప్రతిఫలించింది. అది వారి కవిత్వంలో నూతన వస్తు స్వీకారానికి వస్తు వైవిధ్యానికి దారి తీయించింది.

భావకవితాఉద్యమం తెలుగు సాహిత్యాన్ని ఒక్క ఊపు ఊపింది. ఆ వూపులో కొట్టుకు పోకుండా ఎడంగా ఉన్న కవులు ఆనాడు అరుదు. శ్రీశ్రీ, నారాయణబాబు, విశ్వనాథ, వేదుల మొదలైన ప్రతిభావంతులుకూడా ఆ ఉద్యమంలో లీనమై భావకవిత్వాన్ని ఇంకా మధురంగా మార్చారు.

వెనుక
పాటలకారు గనుక
మా కంఠము మరి మరి
మకరంద ఝరి
మధుకర వనప్రియ మధుర గీతికాలహరి
పిమ్మట
కష్టకాలపు వేసగి చెమ్మట
తరువాత
మరిలేనే లేదు వరువాత
అహోరాత్రుల దేవనిగ వానకారు తలపోత

— దులుపు బూజు (రుధిరజ్యోతి)

అయితే ఆ ఉద్యమం ఎంతోకాలం నిలబడలేకపోయింది. దారిద్ర్యం దేశవ్యాప్తంగా విస్తరించింది. వాస్తవాలు తీవ్రంగా భయపెడుతుంటే అందరికాళ్లకింద భూమికదిలి, కల్పనలు వర్తమాన సమస్యలకు సమాధానాలు ఇవ్వలేకపోయాయి. అందుకే దారిద్ర్య తాపాన్ని రూపుమాపజేసే నూతన వ్యవస్థకై కలలు కన్నాడు నారాయణబాబు.

నారాయణబాబు కాల పరిణామంలోని క్రమాన్ని వస్తువుగా తీర్చిదిద్దాడు. ఆ క్రమమే ఆయన కవిత్వంలో విభిన్న రీతుల్లో ప్రతి ధ్వనిస్తుంటుంది.

"మిన్ను విప్పిన
రక్త పతాకం
మన్ను సత్తువే
తెలిపింది
ప్రభాత పశ్చిమా నిలము
పాడిన పాటను" – గడ్డిపరక.

ప్రపంచంలో సంభవిస్తున్న వివిధ పరిణామాల్ని, సుఖజీవన మార్గాల్ని కవి ఆకళించుకోకుండా ఉండలేదు. అంతేకాకుండా తన చుట్టూ ఉన్నవాళ్లను సైతం ఆమార్గానికి మళ్లించేందుకు ప్రయత్నిస్తాడు. ప్రపంచంలోనే మొట్టమొదటి సోషలిస్టు రష్యా విజయాన్ని గుర్తిస్తూ భారత దేశంలోనూ అటువంటితిరుగుబాటును కాంక్షిస్తాడు నారాయణబాబు.

శ్రామిక వర్గంపట్ల నారాయణబాబుకు అమితమైన సాను భూతి ఉంది. వారి కష్టాలు, కన్నీళ్లు, దారిద్ర్యం, దౌర్భాగ్యం ఆయన్ను అమితంగా ప్రభావితం చేశాయి.

"పాతాళమ్మున
పతితులు పల్లవించే
మాటల
జిలిబిలి తేటల
చీకటిగుండె కదల్చే
జాలి పాట" (ఏమంది) ఆయన కవిత్వానికి

ప్రాణం.

సంఘంలో పతితులు, నారాయణబాబు దృష్టిలో నిజంగా సంఘంయొక్క దురన్యాయాలకింద నలిగి చెడినవారు. దైహికంగా మానసికంగా కృంగిపోయినవారు. వారికి ప్రేమ, దయ, సానుభూతి, తీయటి మాట చిత్తశుద్ధితో పంచగల గాలి. తిరిగి వారికి పునర్జన్మ కల్పించాలి, సంఘంయొక్క నిర్దయను తుడిచి పెట్టాలి. ఈ మార్పు సాహిత్యంనుంచీ రావాలని ప్రయత్నించాడు నారాయణబాబు.

సామాజిక చైతన్యమంటే సమాజంలోని కష్టాలకు, అన్యాయాలకు, అక్రమాలకు, దౌర్జన్యాలకు, దారిద్ర్యానికి జాలిపడటమే కాదు. ఆ మాత్రం సానుభూతీ, ఓదార్పుతో సమస్యలు పరిష్కారం కావు. సమస్యల్ని మూలమట్టం చేయనిదే దరిద్రులకు విముక్తి లభించదని విప్లవ వాదాన్ని చేపట్టాడు. శ్రామిక వర్గపు సమస్త సహజ సంపదను దోచుకొనే వారిపట్ల నిర్లిప్తత పనికిరాదన్నాడు.

ముండ్ల గులాబి
పూలన్నిటిని
మాయం చేసిన వారిని

"గాయంచేసే
రక్త సిక్త
గీతాలేతామే
తోడమంది" (ఏమంది ?) ఇదే నారాయణ

బాబు విప్లవ సాహిత్యానికి ఆనాడే గుర్తు చేసిన కవితా నిబద్ధత.

విప్లవం ఓమూల రహస్యంగా జరుపుకొని వెండితెర దించి నట్లు ముగించేయటం సరికాదు. అది ఒక చోట నుంచి ఇంకొక చోటుకు గాలిలా వ్యాపించాలి.అది అందరిలోకీ చొచ్చుకుపోవాలి. అందుకు ఉద్యమ స్వరూప స్వభావాల్ని అందరిలోకీ తీసుకు వెళ్ల గలిగే చైతన్యవంతుల్ని కూడగట్టుకోవాలి. అందుకే-

"గాలి చెవుల
పోయమంది" (ఏమంది ?) అనే వివేక

వంతమయిన ఉద్యమ నిర్మాణ సూత్రాన్ని తెలియజేస్తాడు.

శ్రామికవర్గం బూర్జువా వర్గాన్ని అనుసరించటం చారిత్రక భౌతికవాదం దృష్ట్యా అసహజం, కృతకం. ఒకవేళ అనుసరించినా ఎంతోకాలం దాని భయంకరమైన బూర్జువా విధానాన్ని, క్రూరమైన దోపిడిని భరించలేదు. ఏదో ఒక రోజు తన వర్గస్వభావ మేదో తెలుసుకొని న్యూనతా భావంనుంచి, ఉక్కపాదంనుంచి విముక్తి చెంది తిరుగుబాటు ప్రకటించక మానదు. 'గడ్డిపరక' గేయంలో ఈ వాస్తవాన్ని చక్కగా గమనింపజేశాడు.

"నడవండి !
నడవండి !
నామిూంచి నడవండి
గడ్డిపరకను ! గడ్డిపరకను !" అని న్యూనతా భావాన్ని చెప్పుకున్న వర్గానికి ఆత్మ విశ్వాసం కల్పించి
"

నన్ను నే తెలుసుకొన్నాను !
ఆగండి ! ఆగండి !" (గడ్డిపరక) అన్న చైతన్యాన్ని సూరిపోస్తాడు. ఈ చైతన్యస్థాయి చాల కవితల్లో ఇతి వృత్తంగా మారుతుంది.

మార్క్సిజం ప్రకారం విప్లవం ఏమహానుభావుని సంకల్పం వల్లనో, ప్రయత్నంవల్లనో రాదు. చారిత్రకంగా సామాజిక పరిస్థితుల్లో సంఘర్షణలనుంచి వైరుధ్యాలనుంచి విముక్తి కొనసాగటంలో బలీయమైన అవసరంగా విప్లవం, విప్లవ నాయకత్వం పుట్టుకొస్తుంది. అది ప్రధానంగా రాజకీయమైనది. ఈ యదార్థాన్ని నారాయణబాబు ఒక్కోసారి విస్మరిస్తాడు, అనేందుకు క్రింది పాదాలు ఉదాహరణ.

మహాశక్తినై
మారణ మంత్రం
పారణచేస్తూ
చివురించిన ఈ
జనాళి యుద్ధం
జైత్ర రథమ్మ్నగ
కజ్జల కాళి
గజ్జల గుఱ్ఱం

కాల భుజంగం
కళ్ళెంలాగి
"ఛలో ! ఛలో !" యని
సాగిపోయెదను (కదన కుతూహలరాగం.)

అంటూ విప్లవాన్ని ఓ మంత్రంగా జపిస్తూ మహోన్నత శక్తిగా యిప్పుడిప్పుడే లేస్తున్న శ్రామికవర్గ పోరాటాన్ని విజయవంతం చేస్తానని ఆశిస్తాడు. దోపిడివర్గానికి కళ్లెంవేసి, శ్రామికవర్గ నియంతృత్వ వ్యవస్థకు చేరుకొంటానని పిల్లాడిలా కలలు కంటాడు. ఈ ధోరణికి కవిసేన ఒక ఉదాహరణగా చెప్పటం అతిశయోక్తి కాదేమో ! రుధిరజ్యోతిలోని 'కావాలి' ఖండికలో 'ప్రళయవేళల విలయతాండవం చేసే కవులుంటే కావాలంటూ' అన్నకవే ఇలా వ్యక్తిగత ఉద్దేశాన్ని కూడా అరుదుగా పొందకపోడు.

నారాయణబాబు తన కాలాన్నుంచి సమకాలీన సమస్యల నుంచి కవిత్వాన్ని వేరుచేయలేదు. ఆనాడు దేశసమస్యల విముక్తికై సాగుతున్న ఉద్యమం ఆయన్ను కదిల్చింది. అయితే నారాయణ బాబుకున్న స్వాతంత్ర్య దృక్పథం వేరయినది. ఆనాటి స్వాతంత్ర పోరాటానికి నాయకత్వం ప్రధానంగా బూర్జువావర్గానిది. ఆనాటి బూర్జువా రాజకీయాలకు, ఫ్యూడల్ భావాలకు, అతీతమయిన నిర్దుష్టమయిన దృక్పథం ఆయనది. అంతకుమించిన విశాలదృక్పథం. అందుకు మంచి ఉదా॥గా 'కిటికీలో దీపం' గేయాన్ని చెప్పవచ్చు. దాన్నిగురించి ముందు ముందు వివరంగా చర్చించవచ్చు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది కానీ, దేశంలోని జనావళికి ఇంకా స్వాతంత్ర్యం రాలేదు. వచ్చిందనుకుంటే అది ఒట్టి భ్రమే. స్వాతంత్ర్యానుభవం దైనందిన జీవితంలో సామాన్యుడి అనుభవానికి వచ్చేంతవరకూ స్వాతంత్ర్యానికి అర్థంలేదు.

స్వాతంత్ర్యం వచ్చిన మార్గాన్నిబట్టి కూడా దాని విలువ కొలవ వచ్చు.

ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల యొక్క దోపిడీ స్వభావాన్నే కాక, భారత దేశంలో స్వాతంత్ర్యం తెచ్చిన కాంగ్రెసులోని ప్రత్యక్ష పరోక్ష జాతీయ పెట్టుబడిదారీవర్గ నాయకత్వం యొక్క దోపిడినీ, స్వాతంత్ర్యం యొక్క బూటకాన్నీ ఏనాడో గ్రహించాడు నారాయణబాబు. కాబట్టే –

దొంగ నిశ
అమావాస్య
అర్ధరాత్రి
గాఢనిద్ర
పెరట్లోను
చప్పుడయితే
ఇరుగుపొరుగు
'లెండోయ్' అని కేకేయగ (ఎవరికి తెలుసు?)

ఎవరూ పట్టించుకోరు. బూటకపు స్వాతంత్ర్య భ్రమల్లో పిడికిలి సడలిపోకుండా బిగించటానికి ఉద్యుక్తులు కారు.

స్వాతంత్ర్యం రాకముందు జరిగేదోపిడి అంతా ప్రత్యక్షంగా (ఇంటిముందునుంచి) జరిగేది. కాని అర్ధరాత్రి స్వాతంత్ర్యవచ్చాక పరోక్షంగా దోపిడి జరుగుతోంది. 'పెరట్లోను' అన్న పదంద్వారా కొత్త పాలకవర్గంయొక్క దోపిడి స్వభావాన్ని చక్కగా గుర్తు చేశాడు. స్వాతంత్ర్యం వచ్చిందని లోకం సంబరంతో గాఢనిద్రలో మునిగిపోతుంటే ఎంత ప్రమాదం జరుగుతున్నదో హెచ్చరించినా, లోకం తెలుసుకోకపోనూ గద్దిస్తోందని వాపోతాడు.

"పాము చెవుల లోకం
వినపడలేదని వాదిస్తుంది
కనపడలేదని గద్దిస్తుంది" - ఎవరికి తెలుసు.

నారాయణబాబులో నిరాశకూడా లేకపోలేదు. 'ఏమంది?' గీతంలో దోపిడినుంచి విముక్తికై తిరుగుబాటును ప్రేరేపించి హింసావాదాన్ని లక్ష్యంగా భావించిన కవి 'ఎవరికి తెలుసు' గీతంలోనే

"అనుకోకుండా
హటాత్తుగా
అమాంతంగా
నా హృదయం
పురాణ బౌద్ధస్థూపం
మహాధ్యానం చేస్తూ
కూలిపోతే" - ఎవరికి తెలుసు?

అనే నిరాశను వ్యక్తంచేస్తాడు. ఈ గీతం రచనాకాలం తెలియక పోవటంవల్ల, ఆయన్ను ఇంకా లోతుగా ఎలా అర్థం చేసుకోవాలో తెలియటంలేదు. చివరి దినాల్లో ఆయన మార్క్సిజపు సిద్ధాంతంపట్ల ఏమేరకు ఏకీకరణ వుందో తెలిసే ఖచ్చితమైన ఆధారాలు ఏవీ దొరకటంలేదు.

సెలవిమ్మా
కలదేమో
స్వజాతీయ
సభావేది
ధరణికి
ముక్తి
సామ్యవాద సంస్క
రణ శక్తి - రాజాజీ.

నారాయణబాబులో ఆరని జ్వాలగా ఉండిపోయిన తపనకు పై పాదాలు మచ్చుతునక.

అభ్యుదయ కవిత్వం ఉద్యమంగా సాగినరోజుల్లో కవిత్వంలో నిర్దుష్టమైన జీవిత స్పందన, గాఢత అధికంగా అగుపించేది. ఆ తీవ్రత అందరిలో చల్లారినతర్వాత కవిత్వంలో నిర్దుష్టమైన స్పందన, గాఢత లోపించి ఉద్యమం అలంకారప్రాయంగా తయారయ్యింది. భావకవిత్వానికీ, అభ్యుదయ కవిత్వానికీ మధ్యవున్న స్పష్టమైన గీత చెదిరిపోయింది. అంతేకాకుండా అభ్యుదయ కవిత్వంలో ఉన్న కవితా విలువలు సహితం కరిగిపోసాగాయి.

కనరాదు నేడు ఋతువుకు ఋతువుకు నడుమనేల
కనుకనే లేదు నారాయణబాబులకున్న శరద్వేళ
– దులుపుబూజు

అభ్యుదయ ఉద్యమం తర్వాత కవిత్వంలో స్తబ్ధత చోటు చేసుకొంది. సృజనాత్మకమైన అభివ్యక్తిని దెబ్బతీసే వాతావరణం కూడ ఏర్పడింది. దాంతో నారాయణబాబులో నిస్పృహ చోటు చేసుకొంది.

వచ్చిపడెను ఒక్కసారి
మౌన మృత్యుప్రతీహారి
మోడు సీతువు
పాడు తీతువు
కంఠమిప్పుడు చీకురాయి
పాడునూయి
అయితే నేడు కవితాకామినికే వచ్చింది ఖాయిలా
అసలు గూటిలోనుంచే అదృశ్యమైందా కోయిలా

కల్పనకిది కానిరోజు
కవికంఠంలో పట్టింది బూజు
కలదింకా నీకోకరోజు, దులుపు బూజు

– దులుపుబూజు*

ఆనాడు ఆత్మహత్యా సదృశంగా మారిన కవిత్వాన్ని మొత్తం వాతావరణంలోంచి ఏర్పడిన ప్రభావంగా గుర్తించాడు. సాహిత్య గూటినుంచి అదృశ్యమైన కవిత్వానికి హేతువును నైరాశ్యాన్ని స్తబ్ధతను పసిగట్టాడు. దాంతో భావకవిత్వం మీద తిరుగుబాటుగా వచ్చిన అభ్యుదయ కవిత్యంలా (ఋతువుకు ఋతువుకు మధ్య కవితాక్షేత్రంలో వచ్చేమార్పులా) అభ్యుదయ కవిత్వం తర్వాత కూడా రావల్సిన మార్పును ఆయన కవిత్వంలో ఎంతో ఆశించాడు. ఉద్యమ స్వభావాన్ని ఋతుచక్రంతో పోల్చటం గొప్ప భావుకతను తెలియజేస్తుంది. ఋతుప్రభావాన్ని చూడగల్గినట్టు కవితాప్రభావాన్ని కూడా చూడగల్గటం కవికీ, సాహిత్య ప్రపంచానికీ ఎంతో ఆరోగ్యకరం.

నారాయణబాబులో అభ్యుదయ కవిత్వంపట్ల మొదలైన ఈ అసంతృప్తికి, మథనానికి దిగంబరకవులు తమ కవిత్వం ద్వారా నూతన ద్వారాన్ని తెరిచారు. ఛేదించరానంత బలమైన స్తబ్ధత ఏర్పడిన కవితా ప్రపంచంలోకి తీవ్రవాదాన్ని తెచ్చారు. నారాయణబాబు 'దులుపుబూజు' రాసిన కాలానికీ, దిగంబర ఉద్యమ ఆవిర్భావానికి కాలభేదం ఐదారు సంవత్సరాల కంటే ఎక్కువ లేదు. అంతకుమునుపు వచన కవితా ఉద్యమం వచ్చినా ఋతుభేదాన్ని (ప్రభావాన్ని కవిత్వంమీద కల్గించలేకపోయింది.

* దులుపుబూజు ముద్రణ : భారతి – మార్చి 1959.

అభ్యుదయ సాహిత్యంలో జీవితాన్ని ఎంతో వాస్తవంగా, సమస్యలపట్ల ఆర్ద్రితతో, తిరుగుబాటుతో రచించిన గీతాలు ఉన్నాయి. అలాంటివి నారాయణబాబులోనూ ఉన్నాయి. కానీ రాజకీయాలపట్ల ఉన్న అవగాహన, నైశిత్యం, విచక్షణ, ఒక్క నారాయణబాబు కవిత్వంలోనే కనిపిస్తుంది. అదే నారాయణ బాబులోని విశిష్టత.

## దేశమాత - "స్త్రీ"

ఈనాడు సమాజంలో స్త్రీ అన్ని రంగాల్లోనూ పురుషుడితో సమానంగా పాల్గొంటోంది. మెత్తని దిండుగా స్త్రీని భావించే దశ నుంచీ హృదయం, బుద్ధిగల శక్తిగా గుర్తించే స్థాయికి పరివర్తన సాగుతోంది. అలాగే సాహిత్యంలోనూ స్త్రీ తాను కోల్పోయిన అస్తిత్వాన్ని క్రమక్రమంగా సాధించుకొంటూ బహుముఖాలుగా విస్తరించింది. ప్రబంధ కవిత్వంలో దేహంగా కనిపిస్తే, భావ కవిత్వంలో ఇంద్రియ గోచరం కాని మానసిక దివ్యానుభూతుల సమ్మేళనంగా కన్పిస్తుంది స్త్రీ. ఈ రెంటిలోనూ స్త్రీ అసమగ్రంగా, కాల్పనికంగా చూడబడింది. కానీ యథాతథంగా – సమాజంలో విభిన్న కోణాల్లోంచి జీవితాన్ని పాలుపంచుకోవాల్సిన సహచారిణిగా చూపించటం జరగలేదు. ప్రణయం, కామం జీవితంలో భాగమయినా అవే సర్వస్వంగా తాల్యంగా మార్చి స్త్రీయొక్క విభిన్న మానసిక భౌతిక స్థాయిల్ని గుర్తించాల్సిన చిత్తశుద్ధిని మరచిపోయారు ప్రబంధ, భావకవులు.

అంతరాంతరాల్లో స్త్రీపట్ల చులకనభావం జీర్ణించుకు పోవడం వల్ల సృష్టిలో సగభాగమైన స్త్రీ శక్తిని ప్రధానంగా గుర్తించక పోవడం జరుగుతోంది. నారాయణబాబు కవిత్వంలో స్త్రీలు భిన్న భిన్న ముఖాలతో ప్రత్యేకంగా కొట్టొచ్చినట్టు కన్పిస్తారు. ఆయన కవిత్వం అంతటా ఒక అంతర్లయగా వ్యాపించారు. స్త్రీపట్ల ఎంతో ఆర్ద్రత, సానుభూతి, ప్రేమ, గౌరవం వుంటేతప్ప ఇది సాధ్యం కాదు.

రాగంలేని
భోగవస్తువట
గుడ్లను పొదగే
పిల్లల కోడట
మాట తప్పని
మగువ బానిసట
అమాయకాత్మల
బాలల
అబలలటంచూ
బేలలటంచూ
మగడే ప్రాపంటూ
సిగ్గుపీడని
చిరుత ప్రాయమున
మొగ్గ తొడగని
మొలక వయసులో
పాలే లేని
చూలాలినిగా చేసి

కుందనమే పూసి
వధ చేసి
వంటిని పసుపుతీసి
ముఖాన్ని పూసి
ఒళ్ళు తెలియక
పళ్ళు కొరుకుతూ
నృత్యం చేసే
రాక్షసి సంఘపు
కీలాలమ్మే
తైలమ్మగ
జీవనమే వత్తిగ
రుధిరజ్యోతిని వెలిగింపుమురా
విప్లవ గీతిని వినిపింపుమురా
జ్వాలనా !
జ్వాలనా ! — జ్వాలనా

అంటూ విప్లవంలోకి స్త్రీని ఆహ్వానించాడు. సమాజంలో సగభాగమైనట్టు ఉద్యమంలోనూ స్త్రీ సగభాగమవుతుంది. విప్లవంలో స్త్రీ చైతన్యం, తిరుగుబాటు ఎంతో అవసరం. నారాయణ బాబుకు స్త్రీపట్ల ఉన్న దృక్పథానికి ఈ గీతం అద్దంపడుతుంది.

స్త్రీ బాల, బేల, అజ్ఞానురాలు కాదు. అబల అంతకంటే కాదు. పురుషుడు పరాత్రో తలచుకున్నప్పుడు దేహంలోని అలుపు తీర్చే, నిద్రబుచ్చే వస్తువుకాదు. తన ఇష్టాఇష్టాలతో ప్రేమేయం లేకుండా పిల్లల్ని కనే యంత్రమూ కాదు. దేహం పెరగక ముందే, బుద్ధి

వికసించకముందే పెళ్లిళ్లుచేసి జీవితానికి భర్తనే సర్వస్వం చేసి, ప్రకృతి విరుద్ధంగా సృష్టి కార్యాన్ని ధర్మం పేరుతో, సంప్రదాయం పేరుతో బలవంతంగా జరిపితే స్త్రీకి జరిగే అన్యాయాల్ని చూసిన నారాయణబాబు తీవ్రంగా ప్రతిస్పందించాడు. ఆవేదన చెందాడు. స్త్రీని సమాజం మీద తిరగబడమన్నాడు.

స్త్రీ తన ఉనికిని తానే నిలబెట్టుకోవాలి. ప్రాణవంతమైన తన ఉనికికి భంగంవాటిల్లకుండా ఎదురు తిరగాలి. [illegible] స్వాతంత్ర్యాలు సంఘంలో ఎవరో యిచ్చేవికావు. అట్లే వాటిని ఎవరూ అపహరించేందుకు వీల్లేదు, విప్లవంతోనే స్త్రీ అన్ని సంబంధాల్లోను సమూలమైన మార్పును తెచ్చుకోగలుగుతుంది. 'రా' 'జ్వాలనా !' శబ్దాలు స్త్రీపట నారాయణబాబు దృష్టి ఏమిటో తెలియ జేస్తాయి. ఆయన దృష్టిలో స్త్రీ ఏకోమలీ, చంద్రముఖీ, మదిరాక్షీ కాదు. భావకవుల ప్రణయదేవతల్లా ఊర్వశీ, శశికళా, ఎంకీ కాదు. ఆయన స్త్రీలో చూసింది జ్వలనం. ఆయన స్త్రీలో ప్రేమించేది కూడా జ్వలనం.

కాలిన ప్రేయసి
దేహం
చమురుకంపు
ఈ లోకం
పాడాలట
పాడాలట — పండుగనాడు

ఈ పాదాల్లో ప్రేమను భగ్నంచేసి కాలినదేహాన్ని చమురు కంపుతో నింపే లోకంమీద అసంతృప్తి ఉంది. సంఘంయొక్క కపటత్వంమీద కసీ ఉంది.

కరువే రూపందాల్చి
కడుపే చెరువై ఏడ్చి
నెలత ఒకరుక
నిలబడ్డాది
భిక్షాపాత్రికతో — దేశమాత

పై పాదాలో దేశంయొక్క దుస్థితిని బొమ్మ కట్టాడు నారాయణబాబు. క్షామం ఊరేటుకూ దేశంలో అడుగంటిన దాఖలాలు లేవు. ప్రజాశక్తి ఆకలితో, దారిద్ర్యంతో నిర్వీర్యమై పోయింది. దేశసౌభాగ్యం అందరికీ అందుబాటులో లేని దీనస్థితిలో ఉంది.

రెండు కన్నులు
కాలిన బండి కమ్ములు
పట్టలేని కూర్మిని
పచ్చని ంపెంగల సి
విగత ప్రాణులు
వాలిన తెమ్మెద బారులు
కాలిన మారుని తూపులు
కలికి చూపులు — దేశమాత.

ఇందులో స్త్రీకి ఏర్పడిన దుస్థితిని భయంకరమైన సౌంద ర్యంలో బంధించి చూపాడు నారాయణబాబు. నిరాశ, దారిద్ర్యం, చీకటిగా కనిపించే భవిష్యత్తు, ఉదాసీనత దేశమాతలో క్రోధాన్ని పెంచుతోంది. ప్రేమ, స్నేహం, స్వేచ్ఛ హరించుకుపోయి ద్వేషం కళ్లల్లో మిగిలిపోయింది. దేశంమీద విప్లవాసక్తిని పెంచటం ఉద్దేశ్యమయినా స్త్రీ బాధలపట్లకూడా దృష్టిని మరల్చటం నారాయణబాబు చేయబూనిన పని.

అంటే. అంటుని
ఆమె శరీరపు
చాలీచాలని చీరను
తొంగిచూచే మానం
ఉన్నాడా చిన్నికృష్ణుడు
అనసూయేది ?
అరుంధతేదని
ప్రశ్నించింది — దేశమాత

పేదరికం కడుపును దహించటమే కాదు, అర్ధ నగ్నను చేసింది. ఇంకా చెప్పాలంటే దిగంబురాలిని చేసింది. సామ్రాజ్య వాదం యొక్క వొత్తిడి కింద ప్రాణప్రదమైన ఆత్మగౌరవం సన్న గిల్లుతోంది. శ్రీకృష్ణుడు గోపికలకు చీరలిచ్చి ఆనాడు మానం కాపాడాడట. ఈనాడు అలాంటి యువశక్తి ఉందా ? ఏనాడో గొప్పతనం ఉండి ఉండవచ్చు. అయితే ఆ గొప్పతనంతో ఈనాడు దేశానికి ఏం వొరుగుతోంది ? అనేవి నారాయణబాబు వ్యంగ్యంగా వేసిన ప్రశ్నలు. అనసూయ, అరుంధతుల పాతివ్రత్యాన్ని కీర్తిస్తున్న దేశమే ఈనాడు ఏ స్థితికి దిగజారిందీ, దిగజార్చబడిందీ తెలియజేస్తున్నాడు.

చచ్చిన బాలింతల
వెచ్చని చనుబాల తీపి
మచ్చరించు కంఠంతో
ఆకలి ! దాహం !
అన్నం అన్నం అంటూ
అలమటించింది
అగ్నివీణై
ఆలపించింది — దేశమాత

భయంకరమైన ఆకలి మనిషిని పశువును చేస్తుంది. విచక్షణా రహితుడ్ని చేస్తుంది. ఆకలి ఎంత భయంకరమైందో సూచించటమే కాదు, దాని పర్యవసానం ఎక్కడకు దారి తీస్తుందో గుర్తు చేస్తాడు.

పరిపక్వ భావసుమము
పతిత మయ్యేందుకు
పున్నె మెరుగని కన్నెగాలుల
కంచుకంఠం చాలదా నా॥

స్త్రీ ఎదగని దశలో ఇంకా తననూ, ప్రపంచాన్నీ సరిగా అర్థం చేసుకోని దశలో పురుషుడి ప్రలోభానికి మోసపోయే అవకాశం ఉంది. స్త్రీలోని అమాయకత్వం, సున్నితత్వం వంచకుడి మోసపు మాటలతో కొట్టుకుపోయి పతితగామారే ప్రమాదం ఉంది. నారాయణబాబు "కంచుకంఠం చాలదా ?" అన్న పాదంతో వంచకుడి స్వభావాన్ని చక్కగా పట్టిస్తాడు. వేమన చెప్పిన "కంచు మ్రోగినట్టు కనకంబు మ్రోగునా" అన్న పాదం ఇక్కడ స్ఫురిస్తుంది.

రోడ్డుదరిని
కొళాయి దగ్గర
బిందెల దొంతులె
గోవర్ధన పర్వతాలు.
తల్లులు
పాలీయని
పిల్లలె
తాండవ కృష్ణులు. విశాఖపట్నం

మానవ అవసరాలలో గాలి తర్వాత, నీరే ముఖ్యమైనవి. అయితే దేశంలో నీటి సమస్య నాటినుంచి నేటివరకు కొనసాగుతోంది. ముఖ్యంగా గృహిణులు నీటి ఎద్దడిని కొళాయిల వద్ద ఈ

రోజుకీ ఒకేలా ఎదుర్కొంటున్నారు. నీటికై ఎన్నో పనులను వాయిదా వేసుకోవాల్సి వస్తోంది. అంతేకాక చివరికి పసికందుల పాలకై తల్లడిల్లిపోతున్నా, బిందెల దొంతుల దగ్గర నుంచి బయటకు వచ్చి పాలివ్వలేని దయనీయ పరిస్థితి కొనసాగుతోంది.

ఆసుపత్రి కెళితే
అస్ఖలిత బ్రహ్మచారికైనా
ఆడదాని చేయి
తగలక మానదు
సకల రోగనివారిణి
సాని
దొరసాని
నరసమ్మ — విశాఖపట్నం

స్త్రీలకు దూరంగా అస్ఖలితంగా ఉండాలనే బ్రహ్మచారులు కూడా వుంటారు. స్త్రీలనుంచీ దూరంగా ఉండగలరు గానీ రోగం నుంచీ దూరంగా ఉండలేరు. జబ్బుతో ఆస్పత్రికి వెళితే నరసమ్మ హస్తస్పర్శ తప్పదు. ఆ స్పర్శతో కామరోగం తిరగబెట్టినా పెట్టొచ్చు. సకలరోగనివారిణి నరసమ్మ అని విశాఖపట్నం ఆస్పత్రిలోని నరుసుల్ని దృష్టిలో ఉంచుకొని చమత్కరిస్తాడు.

ఓ! అంతా
లేడీ స్టూడెంట్లే
ఊరంత ఒకే ఇల్లు
సమస్త గది స్కూలు
పురిటిగది ఆసుపత్రి
గాలి వస్తే
గర్భవతులకు
అనాథలు

ధూళికే విడిచే
సంతానం
ప్రేమకు ప్రాణాలిచ్చే
స్త్రీలు
ఉరికొయ్యల్లాంటి
మగాళ్ళు — విశాఖపట్నం

అవి స్త్రీ విద్యావ్యాప్తి పుంజుకుంటున్న రోజులు. విశాఖపట్నం మెడికల్ కాలేజిలో స్త్రీలు అధిక సంఖ్యలో చదువుకోవటం విశేషమేమీ కాదు. యుక్తవయసు వచ్చేసరికి స్కూలు విద్య ముగించుకొని మెడికల్ కాలేజిలో చేరేవారు. వైద్యపాఠాలు నేర్చుకొనే గదిని పురిటిగదిగా మార్చుకోవటం, పుట్టిన సంతానాన్ని అనాథల్ని చేయటం ఇందులోని చిత్రణ. ఆరోజుల్లో మెడికల్ విద్యార్థి విద్యార్థినుల కామసంబంధాలు అధికంగా సాగుతున్నాయనీ, అనాథలైన స్త్రీలు సహితం మగవాళ్ల ఘాతుకానికి బలవుతున్నారనీ మర్మగర్భంగా తెలియజేస్తాడు.

స్త్రీలు ప్రేమకై మానమే కాదు, ప్రాణమే ఇస్తారు. ఆ ప్రేమను అందుకొని మగవాళ్లు వారిపాలిట ఉరికొయ్యలవుతారు. ఈరోజుకూ ఇది చెదిరిపోని సత్యంగా ఉంది.

రా !
నాతో నరకానికి
స్వాహా వల్లభు
పూజించే
సోమయాజి మాటలు
బ్రతుకే మరచి
బంభరముల్లట్లు తిరుగు
భావకవుల పాటలు

విని మోసపోయిన
వనితా !

స్వర్గం అంటూ వుంటే
ఎప్పుడైనా చూడొచ్చు
నరకం ఇక ఎన్నాళ్ళో ఉండదట !

అనర్థం
స్వార్థం
నాకం !
పరార్థం
యదార్థం
నరకం ! !

— ప్రేయసితో నరకానికి

సంప్రదాయ వాదులుచెప్పే స్వర్గం ఎక్కడో ఎప్పుడో దొరికేది. అసలు ఉందోలేదో తెలియనిది. తెలియనిదానికై జీవితాన్ని దుర్భరం చేసుకొని ఆచారాల, సంప్రదాయాల పేరున ప్రేమను నిరాకరించటం,వలచిన ప్రియుడ్ని కాలదన్నటం అవివేకం, వ్యర్థం. ప్రేమేమిటో తెలిస్తేకానీ, ప్రేమను అంగీకరించటం, నిరాకరించటం తెలియదు.

స్త్రీ సంప్రదాయాల్లోని సంకుచితత్వాన్ని అర్థం చేసుకొని బయటికి రాలేక పోతోంది. సంప్రదాయాల్లోంచి బయటికి వస్తే కానీ ప్రేమయొక్క స్ఫూర్తి తెలియదు. స్త్రీ భావకవుల కాల్పనిక ప్రణయాన్ని ఆశిస్తుంది. కానీ పెద్దలను తిరస్కరించలేదు. ఇంటి గడపదాటి బయటికి రాలేదు. ఎడబాటుతో, విరహంతో పదేపదే కన్నీళ్లు కారుస్తూ ప్రణయ జీవితాన్ని అద్భుతంగా భావిస్తూ

కాలాన్ని సాగదీస్తుంది. ఈ పద్ధతి ఏ కన్యకయినా ఆరోగ్యకరమైనది కాదు. నారాయణబాబు ఈ ప్రమాదాన్ని గుర్తించే - నిస్సహాయంగా క్రియారహితంగా మార్చే ఈ దుస్థితికంటే ప్రేయసికి నరకం ఎంతో గొప్పదని బోధిస్తాడు.

సంప్రదాయ వాదుల 'ఉగించే' మాటలకు, అందంగా చర్విత చర్వణంగా సాగే భావకవుల పాటలకు మధ్య భేదం లేదన్న వాస్తవాన్ని ఎత్తిచూపాడు నారాయణబాబు. సంప్రదాయ వాదులు తమ మిథ్యావాదంతోనో, కర్మవాదంతోనో జీవితాన్ని దాని గమనాన్ని లెక్కగట్టి వేసే ప్రతి అడుగునూ శాసించో, బుజ్జగించో, భయపెట్టో అడ్డగిస్తారు. జీవితానికి అభిముఖంగా సాగనీరు. అలాగే భావకవులు ప్రపంచ వాస్తవాన్ని నిర్లక్ష్యం చేసి సంఘం విధించిన ఎడబాటును విరహంగా, విలాసంగా పదేపదే అంగలార్చి ఉన్న వ్యవస్థతో తాదాత్మ్యం చెందుతారు. కాల్పనిక జగత్తులో కాపురం పెడతారు. ఈ దారుణంకంటే సుఖాన్ని ఇచ్చే నరకం ఎంత విలువయిందో స్పష్టపరుస్తాడు నారాయణబాబు. ఆనాడు సాంఘికంగా స్త్రీకి సంప్రదాయవాదులు, భావకవులు ఏర్పరుస్తున్న విలువల్లోని పలాయన వాదాన్నీ, మిథ్యావాదాన్నీ బట్టబయలు చేయటమే ఈ గీతంలోని ఉద్దేశ్యం. స్త్రీకి కావల్సింది ప్రేమ, ఆరాధన, విరహంకాదు. స్త్రీకి కావాల్సింది సుఖం. నీతి నియమాలు, ధర్మాలు కాదు. స్త్రీకి కావాల్సింది తోడు. ఎడబాటు, తడబాటుకాదు. ఈ యధార్థాన్ని, ఈ నరక సౌఖ్యాన్ని స్త్రీకి తెలియజేయటమే ఇందులోని ప్రయత్నం. భావకవుల ప్రేయసుల చుట్టూ రంగులు కనిపిస్తాయి. అయితే నారాయణబాబు ప్రేయసి కాల్పనిక స్త్రీమూర్తి కాదు. మామూలు ప్రపంచంలోంచి పుట్టుకొచ్చిన 'వనిత'.

8)

స్వైర విహారం చేయిస్తా
గట్లమీద యూకలిప్టస్
వన మహోత్సవం
చేయిస్తా
కర్పూర తైలంతో
కాళ్ళు కడిగి
నీళ్ళు మస్తకాన
జల్లుకుంటా !

భావకవిత్వపు విలువలమీద తిరుగుబాటు చేసిన నారాయణ బాబుకు స్త్రీపట్ల గౌరవభావం చెక్కు చెదరలేదు. ఆరాధన అడుగంటలేదు. భావకవుల కాల్పనికత మీద తప్ప స్త్రీ పురుష సంబంధాల్లో వుండే ఆరాధనను ఆయన మరచిపోలేదు. భావకవుల్లో ఉన్న ఈ అభ్యుదయ అంశాన్ని తిరస్కరించలేదు.

నారాయణబాబులో మాతృమూర్తి పట ఎంతో రసార్ద్రమైన భావన ఉన్నట్లు తోస్తుంది.

తల్లి చేతి చల్లందనము
పిల్లల మాటల తీపి
కొల్లగొన్నారేమో బ్రతుకు !
మాతృ వక్షమున
పాల పోటుతో
పిలడు కదలాడు ! — చల ని గీతి

తల్లికి ఎప్పుడూ పిల్లవాడిమీదే మనస్సు. గర్భం మొదలవుతూనే బిడ్డమీద ధ్యాసతో చంటిపిల్లలా తయారవుతుంది. పిల్లాడు ఎక్కడ ఆకలి గొన్నాడో అని అమాయకంగా తపిస్తుంది. అప్పటినుంచి ఆత్రుత పడుతుంది. దినదినము అందుకే వక్షంలో పాల పోటు. ఆ

తల్లి పాలపాటుతోనే శిశువు సజీవత్వాన్ని పొంది తల్లి ప్రేమకు ప్రతిస్పందిస్తుంది.

ఆనాటి బాల్య వివాహాల మీదకూ ధ్వజమెత్తాడు నారాయణబాబు. అందుకే బాల వితంతువులు, వితంతుగర్భాలు, పతితులు, ఆకలి చావుల స్త్రీ మూర్తులు, బహిష్కృతులు, కుష్ఠు వారు ఆయన కవిత్వంలో కన్పిస్తారు.

అన్ని బాధల్లోకి దారిద్ర్యబాధ భయంకరమైంది. అది దేహాన్ని, మనసునూ, హృదయాన్ని పీల్చి పిప్పిచేసి వదిలి పెడుతుంది.

వల్లుకాలిన తల్లి శవం !
తండ్రి పెండ్లికై తహతహ !
కడవడు నీళ్ళకు నేడ్చె
గంపెడు పిల్లల దుఃఖపు
కంటి వాన
మిన్నంటి కురియు మంచుసోన !

పసితనమున పెండ్లి
భర్త పరమపదము జేర
విధవ
మసక మసక యవ్వనమున
కుసుమించే తల్లి తలపు
గుండెల్లో పాల పాట
ఆకాశపు పాలబాట ! — తెనుగురాత్రి

ఆనాటి మర్బరమైన బాల్య వివాహానికి ఈ గీతం ఒక ఉదాహరణ. అట్లే విధవావివాహానికి ప్రోత్సాహకంగా లేస్తున్న యువ శక్తికి దర్పణం పట్టటం ఈ గీతంలోని ప్రత్యేకత.

మనది పితృస్వామిక సమాజం. భార్య చనిపోతూనే మరొక స్త్రీని వివాహంచేసుకోవచ్చు. అందుకు ఏఆచారం, సంప్రదాయం అడ్డురాదు. అతడికి బిడ్డలమీద మమకారం ఉండొచ్చు ఉండక పోనూవచ్చు. సమాజం మగవాడి విషయమై ఏమీ అడ్డు చెప్పదు. "వల్లుకాలిన తల్లిశవం" అని సూచించటంద్వారా నారాయణబాబు పితృస్వామిక వ్యవస్థలో స్త్రీ పరిస్థితి ఎంత ఘోరమైనదో తెలియ జేస్తాడు. స్త్రీ జననానికి మరణానికి ఉన్న విలువ, కొత్తవస్తువుకు శిధిలమయ్యే వస్తువుకు వున్న సంబంధమనే. ఇక చిన్నప్పుడే పెళ్ళి ళ్ళుచేసి భర్త చావటంతో పునర్వివాహంలేక చీకట్లో విధవలు మాతృత్వం కోసం పడే వేదనను దయనీయంగా చిత్రించాడు.

తెగనంతవరకూ తీగ శ్రుతికి ఒదుగుతుంది. రాగాలు పలి కించటానికి వీలవుతుంది. దాంపత్య జీవనానికి కూడా ఇదివర్తిస్తుంది. దాంపత్యానికి హృదయాల తాదాత్మ్యం ఎంతో అవసరం. బాహ్య సౌందర్యం ఉన్నంత మాత్రాన అది సాధ్యంకాదు. అందుకే-

దంతపు వీణై తేనేమి
ఒళ్ళు ?
తెగిపోయిన తీగ
బ్రతుకు
మేళన చేయని హృదయం
నీ వ్రేళ్ళకు
బాధె మిగులు
నను ముట్టకు
నా చక్కని స్వామి !! – వేశ్య !

అని వేశ్య గొంతుకగా తెలియజేస్తాడు నారాయణబాబు. అంతే కాకుండా, లోతయిన దయనీయ నిజాన్నికూడా ఆవిష్కరిస్తాడు.

సాంఘిక దురన్యాయంకింద పతితగామారిన స్త్రీ జీవితంలోని మాధుర్యాన్ని, సున్నితత్వాన్ని పోగొట్టుకొంది. అవేవి తను పంచలేని దయనీయ స్థితిలో ఉంది. ఆమెను ఓవ్యక్తి ప్రేమించి తన భాగస్వామిగా అభ్యుదయ దృష్టితో ఆహ్వానించాడు. అయితే ఆమెను భాగస్వామిగా స్వీకరించేందుకు కారణం ఆమె అందమైన, నాజూకైన దేహమే. ఈ బాహ్యసౌందర్యం ఎంతోకాలం నిలవదు. దానిమీద ఆధారపడే దాంపత్యం ఎంతోకాలం నిలవదు. తెగిన తీగను సవరించినట్లు – ఆమె జీవితాన్ని అర్థంచేసుకొని ఆమె హృదయాన్ని శృతిలోకి తెచ్చుకోగలిగితేతప్ప ఆమెతో దాంపత్యానికి అర్థంలేదు. ఈ జ్ఞానం ఆమెకు తెలుసు. సంస్కరణలోని లోపమూ తెలుసు. అయితే అభ్యుదయ దృష్టితో తన్ను సంస్కరించవచ్చిన వారిని కఠినంగా తిరస్కరించలేదు. అందుకే అసలువిషయం చెప్పి 'నను ముట్టకు నాచక్కని స్వామి' అని మెల్లగా తప్పుకొంటుంది. నారాయణబాబు పతితలో సహితం చూసిన చైతన్యం ఎలాంటిదో తెలియజేయడానికి ఈ గీతం చక్కని ఉదాహరణ. నిజంగా స్త్రీ

జననానికి
మరణానికి
మానవులకు
భూమి.
పాటలకె గాలి.

అన్నపాదాలు చాలు నారాయణబాబుకు స్త్రీపట్ల వున్న తాత్త్విక దృష్టిని పట్టివ్వటానికి.

# రక్షణా మందిరం - మృత్యువు

జన్మ ఎంత ప్రాచీనమైందో మృత్యువూ అంతే ప్రాచీనమైంది. జన్మ, మృత్యువూ రెండూ పరస్పర కాలవ్యవధిలో వచ్చే విడదీయరాని ఫలితాలు. ఆదిమ సమాజంలో సహితం ఆనాటి జ్ఞానానికి అందని అన్ని ప్రాకృతిక భయోత్పాతాలనూ మృత్యురూపంగా భావించటం జరిగింది.

మనిషి అస్తిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని, జీవనాన్ని, కల్పించుకొన్న ఆశల్ని, ఆదర్శాల్ని, కలల్ని ధ్వంసంచేసే భయానక సంఘటనలన్నింటితో మృత్యువు భయం తాకటం సహజం. ఇందుకు స్త్రీ పురుష, ధనిక దరిద్ర భేదంలేదు: అందరిలోనూ ఎప్పుడో ప్పుడు ఎక్కడో ఒకచోట ఏదో ఒక రూపంలో మృత్యుభావనలు కలుగుతుంటాయి. ముఖ్యంగా కవిలో, మరీ స్పష్టంగా సాగుతుంటాయి. ఎందుకంటే తనకే పరిమితం కాకుండా ప్రపంచంతో కూడా తాదాత్మ్యం చెందగలడు కాబట్టి.

కవిని సమాజంలో క్రూరపాలన భయపెడుతుంది. తన జీవితం భయపెడుతుంది. అందుకే వెంటనే మృత్యువు గుర్తుకొస్తుంది. మనిషిలో భయంచావనంతవరకు చావు భయపెడుతుంది. ప్రకృతిలో సమాజంలో భయోత్పాతాలు, సామాజికదుర్గతలు ఉన్నంతవరకు చావు భయపెడుతూనే ఉంటుంది. మృత్యువైనా గుర్తుకు వస్తూనే ఉంటుంది.

వెనుతిరిగి చూచాను
వెంటాడే మృత్యువులా
వెరపు గొలిపె
నా ఛాయ !

ఊరవతల

కలల పొదరిళ్లలో సౌఖ్యంపు నిదరలో ఉన్న కవికి ఘటా కాశంలో మృత శరీర ఆక్రమణతో గాజుకళ్ల పురిటిపిల్ల ఎదురయి నప్పుడు తళుక్కున మృత్యువు ఊహాత్మకతనుంచి వాస్తవమై చాకులా గుచ్చుకొంటుంది. అది అంతటితో ఆగదు, నీడలా వెంటా డుతూనే వుంటుంది. ఇది ఒక్క ఆధునిక కవి గుండెను మాత్రమే కదిలించే మృత్యు రేఖ. 'వెరపు గొలిపె నాఛాయ' అనటం ప్రపంచం బాధతో తన బాధను, తన బాధతో ప్రపంచం బాధను జోడించు కొన్నప్పుడే సాధ్యం.

కాష్ఠ జ్వాలల్లో
కాలం
సహగమనం చేసింది — కావాలి

మృత్యువుకు దగ్గర కానివాడు కవికాడు. మృత్యువును ధైర్యంగా ఆహ్వానించలేనివాడు కవి కాలేడు. ఆధునిక ప్రపంచం, నాగరిక జీవితం మృత్యువుకూ-జీవితానికీ మధ్య వ్యవధానాన్ని క్షీణింపజేసింది. ఇలా కాల సహగమనంలో నిరంతరం అడ్డుపడ కుండా నిలబడటం

చీకటిలో
దీర్ఘమయిన చావు
చచ్చి బ్రతుకు
మృత్యువు లో
వెలుగున్నది. — అగ్నిపణ

వర్తమానంలో భూతకాలం ఎప్పుడూ సహగమనం కావా ల్సిందేనని నారాయణబాబుకు తెలుసు. అందువల్లే నారాయణబాబు బ్రతుకు చావుల మధ్య ఉన్న కొత్త అర్థాల్ని వెతుక్కోవటానికి ప్రయత్నించాడు. చావులో కొత్త వెలుగులు కనుక్కోవటానికి కారణం అయ్యాడు.

కట్ట తెగిన
కాల భైరవుడు
గాలి
పండుటాకుల
మోడుటాశల
మరణ శయ్యనె
పరిచాడు
కొత్త సృష్టికే
పిలిచాడు — రక్షణమందిరం

నిత్యం మృత్యువుతో సహవాసం చేసేవాడికే కాలభైరవుడు గుర్తుంటాడు. విధ్వంసంతో నూతన సృష్టికి పురికొల్పేవాడు కాల భైరవుడు. పండుటాకుల మోడుటాశలు రాలిపోతేకాని కాలభైరవుడి ప్రజ్ఞ ఏమిటో తెలియదు. ఈ రహస్యాన్ని గ్రహించిన నారాయణబాబు మరణశయ్యను పరిచి కొత్త సృష్టిని పిలిచాడు.

జీవితాంతపు
వెలుగులు
కాంతి గోళములు
కమ్మని మృత్యు పరిమళము
రమ్మని పిలిచాయి — రక్షణమందిరం

ఎముకల పంజరంలో ఆత్మ బందీ ఐపోతాను. గతమంతా చుట్టుకొని మనిషిని స్వేచ్ఛగా ఎగరనీనప్పుడు బ్రతుకు చావయి బాధ పెడుతుంది. దాన్నుంచీ విముక్తి చెందినప్పుడు జీవితాంతపు వెలుగులు బ్రతుకై కొత్త ఆశల్ని పరిమళింపజేస్తాయి. అందుకే కమ్మని మృత్యు పరిమళాన్ని రమ్మని ఆహ్వానించటం, కవితా వస్తువుగా స్వీకరించటం. నారాయణబాబుకు అసలైన రక్షణ

మందిరమేదో తెలుసు. కనుకనే ఆయన కవిత్వంలో బ్రతుకు ఛాయల్లానే మృత్యు ఛాయలు వెలుగు నీడల్లా పరుచుకొని ఉంటాయి. అనేక రూపాల్లో దర్శనమిస్తాయి చూడండి.

గుండెల్లోపాలే
పాముకాటులా బాధపెడితే,
ఒక యిల్లాలు
ఒక చీకటి రాత్రిలో
కురిపించిన పాలవానను ! — మౌనశంఖం

నారాయణబాబు తనలోని స్పందనల్లో తాదాత్మ్యం చెందుతాడు. 'తాను' ను దర్శించే ప్రయత్నంలో శిశుమరణాన్ని, తల్లికి పట్టిన శిశువియోగాన్ని దర్శిస్తాడు. మృత్యువేమిటో, మృత్యు స్వభావ మేమిటో తెలుసుకొనే విచారణలో భిన్న దృశ్యాల్ని పరామర్శించుకొంటాడు.

నీలగిరిలో పురుడు పోసుకొని
దాహం దాహం అంటూ మరణించిన
చూలాలి వక్షంలో గడ్డకట్టిన
చనుబాల జిడ్డును. — మౌనశంఖం

అది ఎంతో చల్లటి ఆరోగ్యవంతమైన వాతావరణం. పుష్కలంగా నీటి సౌకర్యం ఉండాల్సిన ప్రాంతం. సృష్టి ఆవిష్కరణలో నిర్నిమిత్తంగా మరణించిన మాతృమూర్తి నిస్సహాయత్వానికీ, శిశువియోగాన్ని తాదాత్మ్యం చెందుతాడు. తన స్పందనల్లో భాగమయిన ఈ దృశ్యాన్ని తానుగా గుర్తిస్తాడు.

జీవితంలో నిరుపయోగంగా ఉండిపోయిన తన అస్తిత్వాన్ని గుర్తించి, మృత్యువు దెబ్బతో ఎడబాటయ్యే ప్రేమల్ని నెమరేసుకుంటూ మృత్యువును జయించే మౌనశంఖాన్ని వెదుకుతాడు.

బూజు పట్టిన భావాలు, ఊహలు అంతరాంతరాల్ని దారి మళ్లించే కార్యకారణ సంబంధాల్లోని అభిప్రాయాలు. ఈ సమ్మోకాలు, సంకుచితత్వాలు, విరహాలు వాటి తాలూకు సాహిత్యవాసనలు – వీటన్నింటి నుంచీ దూరంకావటం నారాయణబాబు గాఢ అభిలాష. అందుకే

పట్టులో చిక్కి చచ్చాంకామని
ఆకాశం చూరు నుంచి సిరాలోబడి
ఆత్మహత్య చేసుకొన్న కృశాస్త్రి'ని

– మౌనశంఖం

చచ్చి బ్రతకమని చావులోని వెలుగు మహత్తును తెలియజేస్తాడు. సిరాబుడ్డిలో చస్తే, ఆకాశపు చూరునుంచి జారిపోతే (జీవనరేఖలు కావచ్చు) బ్రతుకులో స్వారస్యం ఎలా దొరుకుతుంది.

దేశంలోని దారిద్ర్యం, ఆకలి చావులు, దౌర్భాగ్యం చూసినప్పుడు నిరాశతో మృత్యువును తనకుతానై అర్పించుకొని

హఠాత్తుగా
అమాంతంగా
నా హృదయం
పురాణ బౌద్ధస్తూపం
మహాధ్యానం చేస్తూ
కూలిపోతే – ఎవరికి తెలుసు ?

అంటూ సంతాపాన్ని వ్యక్తం చేస్తాడు. ఆశ నిరాశలు మానవ సహజం.

నీలితావుల
చావు పూవులే
మొలిపిసాను — కదన కుతూహలరాగం

నారాయణబాబు మృత్యువు ఆటుపోట్లు తెలిసినవాడు. అందుకే నీలితావుల్లోనే చావు పూవులను పూయిస్తాడు.

ఆధునిక కవిత్వానికి వస్తువు జీవితం. జీవితానికి చరమదశ మరణం. జీవిత ప్రయాణంలో ఎన్నో ఒడుదుడుకులుంటాయి. జీవితం పూలబాట కాదు. ముళ్లుంటాయి, రాళ్లుంటాయి. ఎన్నో ఎదురు దెబ్బలుంటాయి. అన్నిటికీ ఎదురు తిరిగి మహాప్రస్థానం చేయాలి. అదే జీవితం.

జీవితం అనేక రంగాలతో ముడిపడివుంది. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, కళారంగాలతో పరివేష్టింపబడి ఉంది. కవిత్వానికి వస్తువు జీవితం కనుక జీవితమంతా కవిత్వంలో ప్రతిఫలించాలి. నారాయణబాబు కవిత్వంలో సమకాలీన రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు చోటు చేసుకున్నాయి.

ఆర్థిక, రాజకీయ, సాంఘిక సమానత్వం లేనంతవరకు మానవ జీవితం దుర్భరంగా ఉంటుంది. అందుకే అభ్యుదయ కవులు మానవజాతి విముక్తికోసం సామ్యవాదాన్ని ధ్యేయంగా ఎంచుకున్నారు.

నారాయణబాబు కవిత్వానికి జీవితం మినహా మరో 'వస్తువు' లేదు. అందుకే కాలపరిణామంలో మారే విలువలు, మారే విలువల్ని అనుసరించి నడిచే సాహిత్యం, మార్పును ఆహ్వానిస్తున్న ఆయన కవిత్వం రుధిరజ్యోతి నిండా పరుచుకొని ఉంది. ఆయన శ్రామిక జన పోరాటాల్ని వినిపించాడు. పాతాళమ్మున్న పతితులు

పలవించే మాటల్ని, చీకటి గుండె కదిల్చే జాలి పాటల్ని జ్ఞప్తికి తెచ్చాడు. శ్రామికవర్గ దృక్పథంతో శ్రామిక వర్గానికి చైతన్యాన్ని నూరిపోశాడు. కరిగిపోతున్న కవితా విలువల్ని కాపాడాలని ప్రయత్నించాడు.

నారాయణబాబు కవిత్వంలో జీవితాన్ని ఎంతో విస్తృతంగా, సమస్యల పట్ల స్పందనతో తిరుగుబాటుతో రచించిన గీతాలు కన్పిస్తాయి. స్త్రీకి సమాజంలో ఉన్న స్థానం ఆయన్ని కలచివేసింది. స్త్రీని బాలగా బేలగా అబలగా చూస్తున్న స్థాయినుంచి దీనంగా రోదిస్తున్న దేశమాతగా, జ్వాలగా, ఎదురుతిరిగే కాళిగా ఆయన కవిత్వంలో ఎదిగింది. సమాజం స్త్రీపట్ల చూపిస్తున్న నిర్లక్ష్య వైఖరినీ, ఆమె ఎదుర్కొంటున్న అనేక సమస్యలను ఎత్తి చూపించాడు. కరువే రూపందాల్చి కడుపే చెరువై ఏడ్చే నెలత దేశమాతగా భిక్షాపాత్రికతో నిలబడుతుంది. చచ్చిన బాలింతలు, దీనంగా రోదిస్తున్న పసిపిల్లలు ఆయన కవిత్వంలో అడుగడుగునా కనిపిస్తుంటారు.

అభ్యుదయ కవుల్లో పఠాభి తర్వాత నగర జీవితాన్ని వచన కవిత్వంలో అద్భుతంగా వర్ణించిన వాడు నారాయణబాబు. నగర జీవితంలో ఎదురయ్యే సమస్యలకు దర్పణం పట్టాడు. కళాశాల విద్యార్థులు, విద్యార్థినులు, చీకటి సందులు, మురికి కాల్వలు, వాటి ప్రక్కనున్న చీకటి బ్రతుకులు, రోగాలు, రోగాలను నయం చేసే ఆసుపత్రులు, ఆసుపత్రుల్లో నర్సులు, డాక్టర్లు, పేషెంట్లు, క్లయింట్లను వేపుకుతినే లాయర్లు, కోర్టులు అన్నీ 'విశాఖపట్నం' గేయంలో కన్పిస్తాయి.

ఆయన కవిత్వంలో మృత్యువు రక్షణ మందిరంగా దర్శనమిస్తుంది. ప్రాచీనమైన మానవ జీవితానికి మృత్యువూ ప్రాచీన

మైందే. అనివార్యంగా మృత్యువు మానవుడ్ని తన చల్లనిఒడిలోకి తీసుకొంటుంది.

నారాయణబాబు కవిత్వంలో మృత్యువు వ్యక్తిగతమైనా బాహ్యరూపంలో, ఆధ్యాత్మికమైన ఆంతరిక రూపంలో, సామాజికమైన బాహ్యాంతర రూపాల్లో కనిపిస్తుంది. మృత్యువును విభిన్న రూపాల్లో రీతుల్లోచూసి అనుభూతి చెందినవాడు నారాయణబాబు అత్యధిక జనావళి శుభంకోసం

"మహాశక్తినై
మారణ మంత్రం
పారణ చేస్తూ
ఛలో ! ఛలో ! యని
సాగి పోయెదను." – కదనకుతూహలరాగం

అంటూ సాహిత్య దిగంతాల వరకూ ప్రతిధ్వనిస్తూ ప్రయాణించిన వాడు నారాయణబాబు.

# మౌనశంఖం 5

( రుధిరజ్యోతి శిల్ప విన్యాసం )

రుధిరజ్యోతి 'సామిధేని' ఖండికతో ప్రారంభమై 'మౌన శంఖం'తో ముగుస్తుంది. 'సామిధేని' అంటే యాగ ప్రారంభానికి ముందు వినిపించే ప్రణవనాదం. 'రుధిరజ్యోతి' ఈ ప్రణవనాదంతో ప్రారంభమై 'మౌనశంఖం'తో అంతమవుతుంది.

నారాయణబాబు కవిత్వం విప్లవశంఖం కాదు, మౌనశంఖం. అది శబ్దిస్తూనే ఉంటుంది, కానీ ఆ శబ్దం వినిపించదు. పాఠకుల హృదయసీమల్లో మౌనంగా శబ్దిస్తూ విపరీతమైన అలజడిని సృష్టించి కలచివేస్తుంది. ఇంత అంతర్మథనం జరిగినా అది పైకి వినిపించదు. అయినా అది పూరించిన శంఖమే.

కవికీ రూపానికీ ఉన్న సంబంధాన్ని గురించి ఏంగిల్స్ "The more the opinions of the author remain hidden, the better for the work of art".[1]

శ్చెర్బినా – "If Literature is to reach millions of people, belong to them and enrich their culture, it must be artistically perfect and striking. Otherwise, the author's Idea does not achieve expression"[2] అన్నారు.

1. Engels, F : Letter to the Margaret Harkeness, Markists on Literature, An Anthology.
2. Sherbina, Vladimir : Lenin and problems of Literature.

ప్రతికవికీ తాను చెబుతున్న విషయంతోపాటు చెప్పే విధానం కూడా ఉంటుంది. చాలమందికి ఈ విధానం మీద అట్టే నిఘాఉండదు. తమకు ముందు ఉన్న కవుల్ని గతాను గతికంగా అనుసరించే వాళ్ళు కూడా ఈ దృష్టిని అంతగా పట్టించుకోరు. మిగిలిన అలవాట్లలాగే కవిత్వం రాయటంకూడా ఒక అలవాటుగా పరిణమించడం వల్ల దీన్ని గురించి లోతుగా ఆలోచించటం మరచిపోతుంటారు.

కవిత్వం ఒక ప్రత్యేక అభివ్యక్తి కరణ. దానికొక విశిష్టత ఉంది. అది కవి వ్యక్తిత్వం తప్ప వేరుకాదు. అది కవిది తప్ప మరెవ్వరిదీ కానిది. దాన్ని ప్రతి కవీ గుర్తుంచుకోవాలి. అదొక వింత గొంతు. అది మరెవ్వరి గొంతుకూ అనుకరణకాదు. చీకటిలో కూడా అతనిదే అని పోల్చదగినదయి ఉండాలి.[1]

'అనాఘ్రాతం పుష్పం, కిసలయ మలూనంకర రుహైః రనావిద్ధం రత్నం' లాంటి దృశ్యాల, రూపచిత్రాల జాబితా, వేద కాలం నుండీ నేటిదాకా ఈ Evocation అనేది కవిత్వపు ముఖ్య లక్షణాలలో ఒకటయినట్టు శ్రీశ్రీ తెలియజేశారు.[2] Eliot, Auden మొదలయిన కవులుకూడా ఈ పద్ధతిని అవలంభించారు. నారాయణ బాబు కవితాల్లో ఈ పద్ధతిని చూడవచ్చు.

---

1. శ్రీశ్రీ : నా కవిత్వం - 1, వచన విభాగం మూడు, శ్రీశ్రీ సాహిత్యం చూడండి.

2. శ్రీశ్రీ : నా కవిత్వం - 11, వచన విభాగం - మూడు చూడండి.

ఉదా॥ 1. శిరసున రతనము
గళమున విషమ్మే
కలమ్మే కోసలో
కాటుక మబ్బులు
కాగితమే కంపించింది — సామిధేని

ఉదా॥ 2. ఇక్కడ
సోడాలో కాక్ టైల్
కిల్లీలో ఉల్లి పాషాణం
సిరాబుడ్డిలో ఆత్మహత్య
విమానంలో భ్రూణహత్య
పెట్టెబండిలో గర్భస్రావం
సూటులో సుడిగుండం
టార్చిలైటులో కొరివిదయ్యం
రోగంలో శృంగారం
రేడియోలో సింహగర్జన
మనీపర్సులో దొంగలు — విశాఖపట్నం.

ఇందులో మనస్సును ఆకర్షించేది ఛందస్సు కంటె ఒకదాని తర్వాత ఒకటిగా వచ్చి అనుకూల వాతావరణాన్ని సృష్టించే రూప చిత్రాలు మాత్రమే.

వచనం నడుస్తుంది. కవిత్వం పరిగెడుతుంది. వచనంచేత పరిగెత్తించి దాన్ని కవిత్వం చేయవచ్చు. అప్పుడు వచనంలోవలే లేదా గణిత శాస్త్రంలోవలే అన్ని మెట్లమీద అడుగు వెయ్యానవసరం లేదు. ఒకానొక కాలానికి, స్థలానికి సంబంధించిన దృశ్యం నుంచి వెంటనే ఇంకొక స్థలకాల దృశ్యానికి గెంతువేసి ఒప్పించు

తుంది కవిత్వం. T. S. Eliot రాసిన Waste Land లో ఇందుకు చాల ఉదాహరణలున్నాయి.*

ప్రతి మాటకు ఒక కొలతా, ఒక బరువు, ఒక ఒరుపు ఉంటాయి. రెండు మాటల్ని సరైన ఉద్దిష్టమైన అర్థం వచ్చేటట్టు కలపడం చాలకష్టం. కొన్ని మాటల్ని ఒక వాక్యంగా చెయ్యటం ప్రతిభతో కూడుకొన్నపని.

కవిత్వంలో వేగం సాధించే ఒక ఉపాయంగా ఛందస్సును ఇంతవరకూ భావించటం జరిగింది. ఛందస్సు సహాయం లేకుండా ఈ వేగాన్ని తీసుకురావచ్చు. ఉత్తమమైన Prose Poems అన్నింటిలో ఈ గుణం కనబడుతుంది. అనుప్రాసలవల్ల, ఒక మాటగానీ కొన్నిమాటలుగానీ పునశ్చరణ చెయ్యటంవల్ల, యమకంవల్ల, వాక్యరూపాన్ని మార్చడంవల్ల వచన గీతంలో ఈ గుణాన్ని సాధించే సాధనకు కాలం చెల్లిపోయింది.

వచన కవిత్వానికీ, వచన కవిత్వానికీ తేడాలుంటాయి. అలాగే శ్రీశ్రీ వచన కవిత్వానికీ, నారాయణబాబు వచన కవిత్వానికీ, అజంతా వచన కవిత్వానికి భేదం ఉంది. ప్రతి వచన కవిత్వాన్నీ దేన్ని దానిగా విశ్లేషించి సమాలోచించాలి. చాలా వచన కవిత్వాలు మంచి కవిత్వంకాక పేలవమైన వచనం మాత్రమే. పదాల్ని మీద మీద గుప్పించి బాహ్యమైన లయనుసృష్టించినంత మాత్రాన కవిత్వం కాదు.

వ్యర్థపదాలు లేకుండా వచనం రాయడం ఎంతోచిక్కు. అటు వంటప్పుడు వచన కవిత్వాన్ని రాయటం కష్టం. ముఖ్యంగా అంద

---

* శ్రీశ్రీ : నా కవిత్వం - 1, వచన విభాగం మూడు, శ్రీశ్రీ సాహిత్యం చూడండి.

మైన వచన కవిత్వాన్ని రాయడం మరీకష్టం. పద్య రచనలో ఛందస్సు తెడ్డులా సహాయపడుతూ నడిపిస్తుంది. వచనగీతంలో బయటనుంచీ ఈ విధమైన సహాయమేదీరాదు. కవి తన అంతరాంతరాల్లో నిరంతరం చలించే జ్వలించే అనుభూతుల కదలికల నుంచే ఛందస్సును మలచుకోవాలి. తుఫానులో కొట్టుకు పోయిన తన ఆసరాలు మరిచి సముద్రంలో ఈతకొట్టే ప్రయత్నం వచన కవితా రచన. వచన కవిత్వం తనరూపం తనే నిరూపించుకొంటుంది. అయితే దీని ప్రాశస్త్యం నిర్ణయించడానికి ఉపయోగించ వలసిన ప్రమాణాలు ఇంకా స్పష్టంగా సృష్టికాలేదని చెప్పాల్సి ఉంటుంది.

ఛందస్సు సంప్రదాయాలను ధ్వంసం చేయటం కవికి ఆట కావచ్చు కానీ, పిల్లల ఆట మాత్రంకాదు. వీటి వినాశనం వల్లనే లోకాన్ని ముందుకు తీసుకు వెళ్లవలసి ఉంటుందన్నప్పుడే అతడం దుకు ఉద్యమిస్తాడు. తన ప్రజ్ఞాతిశయంవల్ల నూతన సంప్రదాయా లను విధిస్తాడు.

ఆనాడు వివిధ దేశాల సాహిత్య క్షేత్రాలలో విజృంభిస్తున్న అనేక నవీనోద్యమాలు, భావపరిణామాలు భారత దేశంలోకి తెలుగు దేశంలోకి ప్రతిధ్వనులయి ప్రసరించాయి.

ఒక్కసారి తమచుట్టూ చూస్తే సంఘదూషితులైన ప్రవాస జీవులు, దరిద్రబిక్షువులు, కుష్ఠువారు, వేశ్యలు, పిచ్చివారు, అనాథలు, జీవనోపాధికి కష్టంతప్ప వేరే ఆధారంలేని అభాగ్య జీవులు, తమ కష్టాన్నీ, శ్రమనూ హారతికర్పూరంలా దోపిడీదారునికి సమర్పించుకొంటున్న అమాయకులైన శ్రామికులు కళ్లఎదుట నగ్నంగా కన్పిస్తున్నారు. తమ కవిత్వంలో ఈ దారుణ దృశ్యాల్ని సృజిం

చకుండా వాటికి రూపం ఇవ్వకుండా ఆధునిక కవి ఉండలేడు. మారుతున్న ప్రపంచాన్నీ, యాంత్రిక జీవనప్రభావాన్నీ, నేటి ఆధునిక ప్రపంచ మానవుని అస్థిత్వాన్నీ, తమ కవితనుంచీ వేరు చేసుకొని చూడలేడు. అట్లే తన కవితారూపాన్ని ప్రపంచ చైతన్యంలో, అంతశ్చైతన్యంలో ఉన్న లయనూ గమనాన్ని విడదీసి రచన సాగించలేడు.

ఉత్కృష్టమైన రచనలన్నింటికీ సహజ సిద్ధమైన నిర్మాణ సౌష్టవం, సమత (Symmetry) ఉంటుంది. అయితే ఈ సమత ఉన్నవన్నీ ఉత్కృష్ట రచనలు కావు. ఇక ప్రాచీన లక్షణ కర్తలు విధించిన వ్యాకరణాలు, ఛందస్సులు, అలంకారాలు, రసాలు నిస్సహాయంగా, నిస్సారంగా ఉండిపోతుంటాయి. మహాకావ్యాలను శ్రద్ధతో అధ్యయనంచేసి ఏర్పరచిన సూత్రాలు, చట్టాలు కవిని బంధించి మార్గ నిర్దేశం చేయలేవు. ఇవి ఒక కాలానికీ ఒక కాలానికీ మోడుపోతాయి. కవి వీటి నన్నింటిని తన వ్యక్తిత్వంతో నాశనంచేసి వాటి శిధిలాలనుంచీ ఇదివరకు కనీ వీనీ ఎరుగని ఉత్కృష్ట రచనకు భూమికగా మారతాడు. Arther Rinband ఉద్దేశ్యంలో "Only those could Qualify as true poets who could find a new world and a new Language".*

వ్యక్తిత్వాలతోపాటూ పద్ధతికూడా కావాలి. కానీ పద్ధతివల్ల కూడా వ్యక్తిత్వమే ద్యోతకం కావాలి. ఇది మనకు చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రిగారి కవిత్వంలో కనిపిస్తుంది. దేవులపల్లి కృష్ణ శాస్త్రిలో కనిపిస్తుంది, రాయప్రోలు కవిత్వంలో కనిపిస్తుంది, శ్రీశ్రీలో కనిపిస్తుంది. వీరిని అనుకరిస్తూ రాసిన కవిత్వం శిల్పంలో

* శ్రీశ్రీ : శ్రీశ్రీ సాహిత్యం, వచన విభాగం – పుట 45. శ్రీశ్రీ ఉదాహృతంనుండి.

ఎంత పరిణతి పొందినప్పటికీ హృదయ సాన్నిహిత్యాన్ని పొంద లేదు. స్వసత్వ ద్యోతకమైన ప్రత్యేకత గల కవిత్వం తప్ప హృద యంలో గాఢమైన ముద్ర వేయలేదు. నారాయణబాబు కవిత్వంలో కొన్నింటిని గమనించండి.

ఉదా॥ 1. నల్లని త్రాచుకోరలు
తెల్లని మసూచికుండలు
గగనమ్మున చుక్కలు. — కవి

2. పేదవాని కడుపు మంట
కాలి పేలిపోవు కోర్కె
గగనమ్మున చుక్క — తెనుగురాత్రి

3. కాలిన ప్రేయసి దేహం
చమురు కంపు
ఈ లోకం. — పండుగనాడు

4. కాలం
కాలిన గుడ్డ పీలికై
ధూళి రేగినది — దేశమాత

5. ఒళ్ళు తెలియని
పుళ్ళ బాధతో
వెక్కి వెక్కి
ఏడ్చినది
చుక్కల ఆకాశం — కవి

6. కిటికీలో దీపం
కంపించింది
ఊపె తిన

వెర్రి పీరులా
ఊగి ఊగి
సాగి సాగి
తెగిపోయిన
రబ్బరు ముక్క
తెగటారెను. — కిటికీలో దీపం

7. బ్రతుకంటే
చీకటిలో
దీర్ఘమైన చావు
చచ్చి
బ్రతుకు ! — అగ్నివీణ

కళాత్మక రచనలో ఎంత నిగూఢత్వాన్ని నిక్షేపిస్తే అంత శ్రేయస్కరం ఆ కళారచనకు. కళాపరిమితుల్ని త్రోసి రాజని కళాప్రయోజనం బయటపడకూడదు. వాచ్యంగా అంతా చెప్పకుండా నిగూఢంగా సూచించి విడిచి పెట్టడంచేతనే మహాకవిత్వం సిద్ధిస్తుంది. కవిత్వంగానీ, మరే యితర కళారచనగానీ నిగూఢత్వం నుంచే (ఇతర శాస్త్రస్థాయినుంచీ) కళాత్మక దశకు చేరుకుంటుంది. ఈ నిగూఢత్వమే నారాయణబాబు కవిత్వానికి ప్రధాన లక్షణం. రుధిరజ్యోతి మొత్తం ఈ నిగూఢత్వాన్ని నింపుకొనింది. ప్రధానంగా రెండు ఖండికల్ని సంపూర్ణంగా పరిశీలిద్దాం.

## కిటికీలో దీపం*

భారతదేశంలో స్వాతంత్ర్యానికి పూర్వమే మార్క్సిజపు సిద్ధాంత ప్రభావం తీవ్రతరమయ్యింది. నాడే మేధావి వర్గం ఆ

* కిటికీలో దీపం; మొదటి ప్రచురణ : జనవరి, ఏప్రిల్ 1939, ప్రతిభ.

సిద్ధాంతదృష్టి నుంచి సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యల్ని విశ్లేషించుకొనే స్థాయికి ఎదిగింది. వాటిని విశ్లేషించి, అన్వయించి పరిష్కార మార్గాలను ఆలోచించే దశకు చేరుకున్నారు.

అయితే భారతదేశ సమస్యలకు, వాటి పరిష్కారానికి ఉన్న ఏకైక మార్గం దేశ స్వాతంత్ర్యంగా కాంగ్రెసు మేధావులు గుర్తించారు. ఉద్యమాన్ని కొనసాగిస్తున్నారు. ఆ ఉద్యమం దేశంలోని అన్ని సమస్యల్నీ పరిష్కరించేందుకు తోడ్పడుతుందని భావించారు. కాంగ్రెసు నాయకత్వాన్నీ, ఉద్యమాన్నీ నమ్మి ఆయాప్రాంతాలలో ప్రజలు ప్రాణ త్యాగాలకూ, కష్టాలకూ, కన్నీళ్ళకూ పునరంకిత మవుతున్నారు. కాంగ్రెసు ఉద్యమ సిద్ధాంతమే 'కిటికీలో దీపం'. అది

"జితేంద్రియుని బుద్ధిలాగు
జేగంట లాగు" ఉంది. అంటే ఎంతో దృఢ సంకల్పంతోనూ, పవిత్ర బోధనలతోనూ సిద్ధంగా ఉంది.

నారాయణబాబు 'కిటికీలో దీపం' అనటంలోనే ఆ సిద్ధాంతం యొక్క నిస్సహాయత్వాన్ని తెలియజేశాడు. ఆ వెలుగులోని బలహీనతను వ్యంగ్యంగా చిత్రించాడు. ఈ విషయం పద్యం ముగింపు వరకూ అర్థంకాదు.

గాంధీ దేశ స్వాతంత్ర్య ఉద్యమాన్ని దేశమంతా ఉధృతం చేయడానికి ఎన్నో విధాల ప్రయత్నిస్తున్నాడు. ఆయన అనుచరులుకూడా దేశ విముక్తికై చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్నారు. ఆయన సిద్ధాంతం వెలుగులో నడుస్తున్నారు. అయితే బ్రిటీష్ ప్రభుత్వం వారిని ఎక్కడికక్కడ అణగద్రొక్కుతోంది. లాఠీలతో చితక బాదుతోంది. కాబట్టి

హృదయంలో
ఒకటి రెండు
వెలుతురు గాయాలు.

"వెలుతురు గాయం" అన్నది గొప్ప పద ప్రయోగం. మనసును కదిలించే నైరూప్య చిత్రం.

గాంధీ ఉద్యమ లక్ష్యం సంపూర్ణంగా రామరాజ్యం స్థాపించాలని. అందుకే సమాజంలోని

"స్వర్గం
నరకం
చావు
బ్రతుకు
గొప్ప
బీద
వ్యత్యాసం
తెలివి తక్కువ
చదు వెక్కువ
తారతమ్యం"

గుర్తించి రూపుమాపడానికి బ్రిటీష్ వలస దుల్ని పారద్రోలటానికి సిద్ధమయ్యింది. కానీ వారు ఉద్యమానికి భయపడి తమ దోపిడిని వదులుకొని వెళ్ళడానికి సిద్ధంగా లేరు. ఎంతో అహింసాత్మకంగా ఉద్యమాన్ని నడుపుతున్నారు. లాఠీలతో జైళ్ళలో చిత్రవధ చేస్తున్నా ఉద్యమలక్ష్యాన్ని మరచిపోరాదు. ముఖ్యంగా అహింసామార్గాన్ని తప్పరాదు. హింస ఎదురయినా తనకు కానట్టు తప్పుకోవాలి. కాబట్టి

"జీవహింస
చేయనని
చూడనని
నా శపథం" చేసుకోవాల్సి వచ్చింది కవి.

సామ్రాజ్యవాదులు తమ మూర్ఖత్వాన్నీ, ఆధిపత్యాన్నీ, తమ వర్గ స్వభావాన్నీ వదులుకోరు. తమ సమస్యల పరిష్కారానికై ఉద్యమాలను ఎంత సాత్వికంగా, సామరస్యంగా కొనసాగించినా వారికి పట్టదు. ప్రజా సమస్యలపట్ల వారికి సానుభూతి లేదు. ఉద్యమ లక్ష్యంమీద దయలేదు. ఉద్యమాలను కాలరాయందే వారికి సింహాసనం దక్కదు. అందుకు ఎందరి ప్రాణాల్ని బలితీసుకోడానికైనా వారు వెనుదీయరు.

గదిలోపల
వెలుతురు కాసించి
చేరిన జీవుల
ఆకలితో
బక్షించే
బల్లి !

"ఆకలితో బక్షించే బల్లి" అన్న వాక్యంతో వర్గస్వభావాన్ని చక్కగా సూచించాడు.

యూరప్‌లోని పెట్టుబడిదారీ దేశాల్లో కలిగిన ఆర్థికసంక్షోభం బూర్జువా వర్గపు పునాదుల్నే పెళ్ళగించి వేసింది. దాని పర్యవసానంగా పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికోద్యమాలు చైతన్యవంతమవుతున్నాయి. సోవియట్ రష్యాలోని సామ్యవాద వ్యవస్థ ప్రపంచ ప్రజలందరిలో విప్లవాత్మకమైన పరివర్తనను కలిగించింది. మార్క్సిజం ప్రభావంతో కాంగ్రెసులోని వారుకూడా కమ్యూనిజంవైపు మళ్ళారు.

కాంగ్రెసుతో కలిసి పనిచేస్తున్న వామపక్షం వారికి గాంధీ తత్త్వంమీద విముఖత్వం ఏర్పడింది. గాంధీ తత్త్వంవలన కాక మార్క్స్ ప్రబోధించిన కార్మిక, కర్షక విప్లవసిద్ధాంతం ద్వారానే చైతన్యం రేకెత్త గలదన్న నమ్మకం ఏర్పడింది. ఆ ఆలోచన బయలు దేరింది అల్పసంఖ్యాకులలోనే అయినప్పటికీ, వారి ఉద్యమం స్వల్పస్థాయిలోనే ఉన్నప్పటికీ, అది ఎంతో నిర్దుష్టంగా దేశమంతా వ్యాపించింది. ఈ విషయాన్ని కింది పాదాల్లో బలంగా సూచించాడు.

ప్రక్కలో పాలు త్రాగు
పసిపిల్లడు
ఉక్కిరి బిక్కిరియైనట్లు
గొప్ప గాలి రేగింది

వామపక్షం ఆవిర్భావం కార్మిక, కర్షక వర్గానికి ఎంతో తృప్తిని, ఊరటను ఇచ్చింది. ఇంతవరకూ అట్టడుగు వర్గాన్ని పట్టించుకున్న వారు లేరు. నాయకుల లక్ష్యం మధ్యతరగతి వారి మధ్యనే ఆగిపోతూ వచ్చింది. నాయకత్వం మధ్యతరగతి వారికే పరిమితమైపోయింది. కార్మిక, కర్షక ఉద్యమం శ్రామిక నాయకత్వంతో ప్రారంభమయ్యేసరికి ఉత్సాహంతో

"గోడవతల
చీకటి నవ్వింది"

ప్రపంచంలో రెండు సత్యాలు ఏక కాలంలో మనలేవు. గాంధీ తత్త్వం, శ్రామికవాదం రెండూ ఏక కాలంలో సమస్యల పరిష్కారానికై భాగస్వాములు కాలేవు. బలమైన సిద్ధాంతం తప్ప అన్ని సిద్ధాంతాలూ నిలబడలేవు. అందుకే కిటికీలో దీపం

"కంపించింది
ఊపెత్తిన
వెర్రిపీరులా
ఊగి ఊగి
సాగి సాగి
తెగిపోయిన
రబ్బరు ముక్క
తెగటారెను"

ఆచరణలోనే సిద్ధాంతం బాగోగులు తెలుస్తాయి. అసలు తత్త్వం బయటపడుతుంది. ఉన్నదంతా ఊపెత్తిన పీరులా వ్యక్తిగతమైన ఆవేశం తప్ప వేరుకాదు. దీనికి ముందుకుసాగే లక్ష్యం లేదు. అటూఇటూ కాస్త మారటంతప్ప. స్వతహాగా దాని తత్త్వం యథాతథవాదం. అందులో వాస్తవంగా జ్వాలలేదు. ఎర్రటి రబ్బరు ముక్కలోని జడత్వమే ఆ సిద్ధాంతం పునాది.

దీపం ఆరిపోవటాన్ని చూపించే పదచిత్రం బాహ్యంగా ఆధునిక కవి సమయంగా ఎంతో అద్భుతంగా అగుపించినా ఖండిక అగ్రక్రమంలో దాని పాత్ర అంతకంటే అమోఘమైందని మరచి పోకూడదు.

ఇప్పుడో
కిటికీలో
గోడివతల
గోడవతల
గది లోపల
ఒకటే చీకటి !
జీవరహస్యం ! ! !

బలహీనమైన ఉద్యమాలూ, సిద్ధాంతాలు అట్టడుగు వర్గాన్ని వెలుగులోకి తేవు. అవి తాత్కాలిక ప్రయోజనాలుగా పనిచేస్తే చేయవచ్చు. ఈ కొవ్వొత్తుల కింద శాంతినీ, సౌఖ్యాన్నీ వెతుక్కోవటంవల్ల ఏ పరమార్థాన్నీ సాధించలేరు. సంపూర్ణ విప్లవం విజయవంతంకాకుండా భారతదేశంలోనేకాదు మరెక్కడా ఉన్న సమస్యలు, బాధలు, ఆకలి చావులు నిలిచిపోవు. ఈ రహస్యం ఎరగనంతవరకూ మానవజాతికి విముక్తి లేదు, వెలుగు లేదు, సూర్యోదయం అసలు లేదు.

నారాయణబాబు కవిత్వమంతా ఈ నిగూఢత్వాన్ని దాచుకొని ఉంటుంది. అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని సూచిస్తుంది. 'కావాలి' ఖండికను పరిశీలిద్దాం.

## కావాలి*

మౌలికంగా ప్రాచీన కావ్య సంప్రదాయానికి భిన్నమైనది భావకవిత్వోద్యమం. ప్రధానంగా ప్రాచీన సంఘంమీద తిరుగుబాటుగా నడిచింది. చివరికి ఈ ఉద్యమం కావ్య గౌరవంకోసం ప్రాచీనుల్ని పునరుద్ధరించే తిరోగమనానికికూడా దారి తీసింది. భావకవిత్వంలో అతి ముఖ్యమైన విలువ స్వేచ్ఛ. కవిత్వంలో ప్రాణతుల్యంగా అనివార్యంగా వచ్చిన సిద్ధాంతం. ఈ సిద్ధాంతం కవిత్వరూపంలో ఆలంకారిక నియమాల్నీ, మర్యాదల్నీ ధిక్కరించే ప్రయత్నాన్ని మానివేసింది. వారు వాడిన రసం, రమ్యత, ధ్వని, అలంకారం, వ్యంగ్యం ఇత్యాది పదాలను వాడుక చేసింది.

* కావాలి; మొదటి ప్రచురణ : జ్వాల, 1935.

కావ్య ప్రమాణ విషయంలో తిరుగుబాటునుంచీ సర్దుబాటుకు చేరుకుంది.

అంతేకాక భావకవిత్వం సంకుచితమై పోయింది. దీనికి వ్యక్తి ప్రపంచంతో తప్ప సమాజంతో సంబంధం లేకుండా పోయింది. ప్రపంచ వ్యాప్తంగా తుఫానులా కమ్ముకొంటున్న పరిస్థితులు కవిని వ్యక్తిగత పరిధిలోనే బంధించలేక పోయాయి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే వ్యక్తి పరిధిలోని సంకుచితత్వాన్ని సమూలంగా శిథిలంచేసే సమయం ఆసన్నమయ్యింది. దాన్నే నారాయణబాబు "దివసావసాన" సమయం అన్నారు.

1926 నుండీ కాంగ్రెసులో వామపక్షంవారు అతివాదులు బలపడసాగినారు. అప్పటికే కార్మిక, కర్షక సంఘాలు స్థాపించ బడినాయి. గాంధీ తత్త్వంమీద కొంత అసంతృప్తికూడా చెల రేగింది. శ్రామికఉద్యమాలు వర్గసంఘర్షణ సిద్ధాంతంప్రభావానికి లోనయినాయి. ఫాసిజానికీ, సామ్రాజ్యవాదానికీ వ్యతిరేకంగా ప్రపంచ ప్రజల స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా దేశ స్వాతం త్ర్యోద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలన్న సంకల్పం విస్తరిస్తున్న దశ అది. ఆ స్థితిలో ఝరిలా, చెట్టులా, మబ్బులా, వాగులా, ప్రకృతిలో ఒక భాగంగా సమాజానికి అతీతంగా స్వేచ్ఛగా ఉండా లనుకునే మార్గం నిర్జీవస్థితికి వచ్చింది. నాటి సామాజిక అస్థిర పరి స్థితులు కాపజ్వాలలై ఆమార్గాన్ని దహనం చేయడానికి సిద్ధ పడ్డాయి.

భావకవిత్వం రేయి ముసుగును పుడమి కొసగింది. కాబట్టి ముసుగును తప్పకుండా తొలగించాల్సిన స్థితి ఏర్పడింది. 'రేయి ముసుగు' అనడంలో అది ఎంత అంధకార బంధురమయ్యిందో గుర్తించాడు నారాయణబాబు. రేయిముసుగు పుడమి కొసగటంలో గొప్ప ఔచిత్యం ధ్వనిస్తున్నది.

రేయి ముసుగు
పుడమి కొసగి
దివసావసాన
కాష్ఠ జ్వాలల్లో
కాలం
సహగమనం
చేసింది.

సామాజిక పరిస్థితుల ప్రాబల్యంతో భావకవిత్వం సహజంగానే మరుగున పడిపోయింది. సాహిత్య ప్రపంచాన్ని వదిలి వెళ్ళిపోయింది. 'సహగమనం' అనటంద్వారా సామాజిక వాస్తవాలతో మానవ ప్రయత్నాలకు ఉన్న అనుబంధాన్ని తెలియజేస్తాడు నారాయణబాబు.

నారాయణబాబు భావకవిత్వాన్ని స్త్రీ వాచ్యార్థంలో ప్రయోగించాడు. దీని అర్థం భావకవితా వస్తువు సుకుమారము, రమ్యము కావటమే.

భావకవులు భావచిత్రాల్లో చూపిన నవ్యత అంతకు మునుపు తెలుగు కవిత్వానికి లేని నవ్యాలంకరణ. రూపం రీత్యా విలువైనది.

ఆరిన చితిలో
బూడిద వెన్నెల
జారిన ముక్కుపుడక
ఒకటే చుక్క;

'ముక్కుపుడక, ఒకటే చుక్క' అనటంలో పై భావాన్నే జ్ఞప్తి తెచ్చాడు.

బూడిద తెల్లగా కన్పించినా అది వెన్నెలలా ప్రకాశించ లేదు. భావకవిత్వపు అవశేషాల్లో ఎవరైనా వెలుగుకోసం వెత కటం ఒట్టి భ్రమే అవుతుంది.

స్థూలంగా చూస్తే అది పట్టుమని రెండు పదుల ఏళ్ళకన్నా ఎక్కువ కాలం నిలువలేకపోయింది. ఎందరో కవులూ, పండితులూ భావకవిత్వంపై విలువైన కృషి చేశారు. ఒక ఉద్యమంలా ముమ్మరంగా ముందుకు తీసుకుపోవాలని ప్రయత్నించారు. అయినా కాలగర్భంలో

"సమాధిలో మృత శిశువట్టుల
జలదాంతర శశి" కాక తప్పలేదు. కేవలం

వెన్నెలా, పక్షులూ, ఆకాశపు రంగులూ, అడవిలో చెట్లూ, చిగు రాకులు చూసుకుంటూ, ఒదిగిపోతూ గడుపుదామనుకున్న కవిత్వా నికి తీక్ష్ణమైన వాస్తవాలూ, కన్నీటి గాథలు కమ్ముకున్నాయి.

దారిద్ర్యంతో మానవ జీవితం అస్తవ్యస్థమై పోయింది. బ్రతుకు దుర్భరమైపోయి లోకమంతా శ్మశానవాటికగా తయా రయ్యింది.

"వ్రాలిన రాబందులై
శరన్మేఘములు"

జలదాంతరాలు శరన్మేఘములయిన రాబందులుగా మారడం భావకవితా దశ అభ్యుదయ దశకు చేరుకునే సామాజిక, సాహిత్య పరిణామ పరాకాష్టతను చూపే శిల్ప నిపుణతగా చెప్పుకోవచ్చు. పైకి అందంగావున్నా పరిస్థితుల్లోని నగ్నత్వాన్నీ, భయంకర త్వాన్నీ గుర్తించాడు నారాయణబాబు.

భావకవిత్వం ప్రతిపాదించిన స్వేచ్ఛ అతి విలువైనదే. అయితే అది దారి తప్పింది. అంతేకాదు ఊహల్లో చిక్కుకు పోయింది. ఆత్మలో బందీఐపోయి ప్రపంచాన్ని విస్మరించింది. ఆ సంకుచితత్వంనుంచి స్వేచ్ఛ

"వ్యోమ మార్గముల
ఊహాకతీతంబగు
శక్తి
దృగంచలాలకు" చారిత్రాత్మకంగా విస్తరించింది. అది భావకవిత్వంలోని ప్రేరణలా ఊహాత్మకమైనది కాదు, వాస్తవం. అందుకే

సంచరించినది !
సంచలించినది !

అంతవరకూ కవిత్వం గుండె గొంతుకలోన కొట్లాడుతుంది. అది బయటకు వినిపించే ధ్వనికాదు. వొట్టి గుసగుసలు. లేదా మాటలులేని సిగ్గు దొంతరలు. కానీ కవిత్వానికి ఆ దశ చెల్లి పోయింది. కవిత్వ మిప్పుడు ఆత్మనూ ప్రపంచాన్నీ సంధించిన ఘోషలో

"సందేశాలను
పెంపొందించే
మూగ కేకలే
వేసింది"

'మూగ కేకలే' అనటంతో నారాయణబాబు అర్థానికి గొప్ప స్ఫూర్తిని కల్పించాడు. చారిత్రకంగా అనివార్యమైన వాస్తవ పరిస్థితుల్లోకూడా గొంతులు మూగగా ఉండిపోయాయి.

ఆత్మగత ప్రపంచంలోని అనుభవం భావకవిత్వానికి కావ్య వస్తువు. దానికి తోడు, కావ్యం ఆనందంకోసమే. ఈ రెండు లక్షణాలవల్ల కవిత్వంలో సందేశానికీ, చైతన్యానికీ చోటున్నదన్న విషయం అప్పటివరకూ అప్రధానమైపోయింది. కాబట్టి దాని ప్రాధాన్యాన్ని గుర్తించే అవసరం ఏర్పడింది.

"నటరాజ
పాదముల
గజ్జల మ్రోతకు
పాటలు కూర్చే
కవులుండే
కావాలంటూ"

ఆనాడు చారిత్రకంగా అభ్యుదయకరమైన మార్పు నారాయణబాబుకు 'నటరాజు'గా కనిపించింది. భారతీయ తత్త్వశాస్త్రంలో భారతీయ నాట్యశాస్త్రంలో నటరాజుకు ఉన్న స్థానాన్నీ, ప్రాధాన్యాన్నీ, అర్థాన్నీ ప్రముఖ భారతీయ తత్త్వవేత్త ఎ. కె. కుమారస్వామి ఇలా వివరించారు. చూడండి.

"The five acts of Nataraja are creation, protection, destruction, removal of the veil of ignorance and Liberation".*

సంప్రదాయార్థంలో శివునికి ఉన్న అర్థసాదృశ్యాన్ని ఈ గీతంలో నారాయణబాబు ఆధునిక అనివార్య పరిణామ వాస్తవిక శక్తికి అన్వయించడంలో విచక్షణనే ప్రదర్శించాడు. నారాయణ బాబులోని సంప్రదాయ ప్రియత్వానికి ఇదొక మచ్చుతునక.

COOMARASWAMY, A. K. : 'Art of India', The Dance of Siva, Page - 8.

"గజ్జల మ్రోత" అనడంలోనే పాదాల తీవ్ర సంచలనాన్ని సూచిస్తున్నాడు. అభ్యుదయ కవితాతత్త్వం తళుక్కున మెరుస్తూ ఆ ఒక్క పదప్రయోగంతో స్ఫురిస్తుంది.

"చిలువ తాలుపు
గరళ కంఠమున
కాల సర్పము
జోల పాటలో
సొక్కిపోవగ
నాగస్వరమూదే
కవులుంటే
కావాలంటూ" ఉద్రేకాన్నీ, జాగృతినీ ఆహ్వానిస్తున్నాడు.

విప్లవాత్మకమైన మార్పును సమాజంలో తీసుకురావటానికి రాజకీయ చైతన్యం ప్రధాన పాత్ర వహిస్తుంది. ఆ చైతన్య వర్గ సమాజాన్ని కూల్చడానికి విజృంభించినప్పుడు దానికి ఉద్దీపనగా కవులు ముందుకు రావాల్సిన అవసరం ఉంటుందని

"విలయవేళల
ప్రళయతాండవం
చేసే శివునకు
వెనుకపాట పాడే
కవులుంటే
కావాలంటూ" తెలుగు సాహిత్య ప్రపంచంలోకి కవుల్ని ఎలుగెత్తి పిలిచాడు నారాయణబాబు.

# నారాయణబాబు కవిత్వంలో లక్షిత ధోరణులు

నారాయణబాబు స్మశానాలవంటి నిఘంటువుల్నీ, వ్యాకరణాల సంకెళ్ళనీ, ఛందస్సుల పరిష్వంగాన్నీ వదిలిపెట్టాడా? ఆయన కవితా రూపమేమిటి? మొదలయిన అంశాల్ని పరిశీలించాల్సి ఉంది. భావకవిత్వంలోని శబ్ద మాధుర్యంమీద, నిరర్థక శబ్దంమీద తిరుగుబాటు చేసినవారిలో పఠాభి, నారాయణబాబు, శ్రీశ్రీ తదితరులు ముఖ్యులు. అందులో పఠాభి తీవ్రవాది. ఆనాటి కవిత్వాన్ని అతి మార్దవం, నిర్జీవ ప్రౌఢిలోంచి తప్పించటానికి వారు అవసరమైన అన్ని ప్రయోగాలు చేశారు. కొందరు వాక్యాలలో, పదబంధాలలో సందర్భ శుద్ధిలేకుండా మెలికలు (తెలిసే) తిప్పటం, పదరూపాల్ని చెడగొట్టటం, ఎంతదూరం వెళ్ళిందంటే తిరిగి తాము ఆ ధోరణిని మార్చుకోలేనంత ప్రలోభంగా రూపుదిద్దుకొంది. ముఖ్యంగా నారాయణబాబుకు 'భాష తెలియదన్న విమర్శ ఇందువల్లనే ఏర్పడి ఉంటుంది. శ్రీశ్రీలో ఉన్నంత భాషా పటిమ, శబ్దాధికారం నారాయణబాబులో లేకపోవచ్చు. కానీ జీవితంలో కవితాన్వేషణ సాగించేమేరకు తన అంతరంగాన్ని వ్యక్తంచేసే మేరకు ఏ లోటూ లేదు. అందుకు మంచి ఉదాహరణ 'నశంఖం' గీతం.

సి. నారాయణరెడ్డిగారు 'వచనగేయం' అనే శీర్షికలో వచనగేయాన్ని గురించి చర్చిస్తూ,* అందులో శ్రీశ్రీ చెప్పిన విషయాల్నే వివరంగా విశ్లేషించారు (నా కవిత్వం-11). వచనగేయం

---

* ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు : ప్రయోగములు. పుట. 619.

యొక్క ప్రధాన లక్షణాన్ని చెబుతూ ఇలా అన్నారు. "పాఠకునిలో భావోద్వేగము కలిగించు 'అంతర్లయ' దీని ప్రధానలక్షణము. దీనిలో కేవలము అనుప్రాసాదుల వలన సంక్రమించు శబ్దలయ అనుషంగిక మైనది. దీని కతీతమయిన 'భావలయ' ముఖ్యమైనది. భావలయ యనగా వచనగేయమున ప్రాసలలో దారమువలెనుండు అంతర్లయ. వచనగేయములోని యీ అంతర్లయ ఎల్లప్పుడొకే రీతిగా ఉండరాదు. ఒకప్పుడీ వచనగేయము మంద మందముగా నడవవచ్చును. ఇంకొకప్పుడు తురగధాటిలో పరుగిడవచ్చును. మరియొకప్పుడు చటుక్కున విరిగివిరిగి సాగవచ్చును. ఎట్లున్నను ఆ అంతర్లయ గానీ, విరుపులుగాని మొత్తం గేయంయొక్క గమనమునకుప సంస్కారముగా నుండవలెను. అంతమాత్రమున వచన గేయములోని పాదములన్నియు ఒకే తూగులో నుండవలెనని నా అభిమతముకాదు. ఛందో నియమముగల పద్యములోని లయ ఏకతారవంటిది. దీనిలో వైవిధ్యము తక్కువ. వచనగేయములోని లయ అట్లుగాక స్వచ్ఛందమైనది. ఈ స్వచ్ఛందతవలన పద్యములో గేయములో అసంకల్పముగా చొరబాక కృత్రిమ పదబంధములు, పాదపూరణ శబ్దములు వచనగేయమున ప్రవేశించుటకు వీలు లేకుండపోయినది. చెప్పదలచుకొన్న భావమును సూటిగా గుండెకుతాకునట్లు చెప్పెడి గుణము అలవడినది." అంటూ ఇంకా ఇలా చెప్పారు. "వచన గేయమునకు నిరాడంబరత ముఖ్యమైన గుణము. నిరాడంబరత యనగా నిరలంకారత కాదు. అనవసరమైన శబ్దాప్ఛటిని పొల్లు పదముల పొర్లింతలను ఇది నిరసించినది. శ్రీశ్రీ వ్రాసిన 'ఆకాశదీపం'లో ప్రారంభ సూక్తులను చూడుడు.

"గదిలో ఎవరూ లేరు
గదినిండా నిశ్శబ్దం
సాయంత్రం ఆరున్నర
గదిలోపల చినుకుల వలె చీకట్లు"[1]

మన నిత్యవ్యవహార భాషకు సన్నిహితముగా నున్న రచన యిది. చివరి పంక్తిలోని ఉపమానము ఈ నాలుగు పంక్తులకు ప్రాణమూదినది. అయినను అలంకారము లేదన్నంత నిరాడంబరముగా రచింపబడిన గేయ భాగమిది".[2]

నారాయణబాబు కవిత్వంలో సహితం నిరాడంబరానికి ఉదాహరణగా క్రింది పాదాల్ని ఉదహరించుకోవచ్చు.

కిటికీలో దీపం
కంపించి
ఊపెత్తిన
వెర్రి పీరులా
ఊగి ఊగి
సాగి సాగి
తెగిపోయిన
రబ్బరు ముక్కలా
తెగటారెను.

---

1. 'గదిలో ఎవ + రూ లేరు
గదినిండా + నిశ్శబ్దం' అన్న ధోరణిలో విరిచి చూచినచో ఇది త్రస్యగతిలో వచ్చి చేరును. కాని ఈ గేయమును చదివినప్పుడు మాత్రాజ్ఞానమే మాత్రముండదను విషయమును గమనింపదగినది.

1-2. నారాయణరెడ్డి, సి; ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు. పుట. 619.

విషయ స్పష్టతకోసం వివరంగా ఉదహరించడం జరిగింది. ఇందులో సి. నా. రె. గారు రెండు విషయాల్ని అంగీకరిస్తున్నారు. భిన్న శబ్దాల సమ్మేళనంవలన, పాదంలోని విరుపులవలన ఏర్పడే శబ్దలయనూ, వీటితోపాటు ముఖ్యమైన భావలయనూ గుర్తించారు. అయితే ఆయన శబ్దలయనూ, భావలయనూ కలిపి సూచిస్తున్నది లిఖితమార్గమైన వచన గీతాన్ని మాత్రం కాదు. ఆయన చెప్పిన లక్షణాలు ఆశు కవితామార్గానికి చెల్లుతుంది కానీ లిఖితమార్గానికి కాదు. అదీగాక ఆయన వచన కవిత్వానికి గమన వైవిధ్యముండదు అన్న వాక్యం, ఒక్క లిఖితమార్గంలోని వచన కవిత్వానికి చెందు తుంది. లిఖితమార్గ కవిత్వానికి భావలయ ప్రధానమైనది. యతులు, మాత్రలు, అనుప్రాసలు, విరుపులు మొదలయిన బాహ్య ప్రయ త్నాల ఛందోరూపాన్ని కవిత్వానికి అభేదంగా చూపడంవలన సి. నా. రె. గారు శబ్దలయను, భావలయనూ కలిపి అసంపూర్ణంగా, అస్పష్టంగా చర్చించారు. వాస్తవంగా అవి వేరు వేరు.

ఒక్కోసారి రెండుధోరణులు మిళితమైన సందర్భాలు కూడా కన్పిస్తాయి. పాఠకులు ఎక్కువగా ఆశుధోరణికో లేదా లిఖిత ధోరణికో అలవాటుపడి లేదా రెంటికీ అలవాటుపడి ఉంటారు. పాఠకుడిలో (శ్రోత ఆవహిస్తే) లిఖితమార్గ కవిత్వంతో తాదా త్మ్యం చెందలేక పెదవి విరిచి, ఆశుమార్గంగా సాగినచోట అద్భుత మైన స్పందనను పొంది తాదాత్మ్యతకు లోనవుతారు.

ఇందులో గీతలు పెట్టిన వాక్యాలను పరిశీలిస్తే సి. నా. రె గారి ఉద్దేశ్యంలోని అస్పష్టతతోపాటు కొన్ని సత్యాలుకూడా తెలు స్తాయి. ఎటువంటి తూగు, ఊపు శబ్దక్రమ సమ్మేళనం లేకపోయినా కవిత్వంలో లయనుపట్టే మార్గముందనీ, అది నిరాడంబరత పేరుతో పేలవంగా తయారవదనీ,ఆడంబరంలేని అలంకారంతో సాగుతుందనీ,

గీతంయొక్క గమనంలో అంతర్లయకూడా ప్రధానమైనదని ద్యోతక మవుతుంది.

వీటన్నింటినిబట్టి ఒక నిర్మాణాత్మకమైన సూత్రాన్ని నిర్మించుకొని నారాయణబాబు కవిత్వాన్ని పరిశీలించవచ్చు.

కవిత్వంలో నారాయణబాబు లిఖిత సంప్రదాయంలోని మార్గాలను అనుసరించినవాడే తప్ప ఆశుమార్గాన్నికాదు. అందువల్ల నారాయణబాబు కవిత్వంలో రూపం లిఖిత సంప్రదాయానిది. భావం ఆధునిక కవిత్వానిది. పాశ్చాత్య కవిత్వంలోని ఆధునికతను, స్వదేశీయ తత్త్వసారాన్నీ పుక్కిట పుట్టాడు నారాయణ బాబు.

ఆశు సాహిత్య మార్గంనుంచి పరిశీలించేవారికి ముఖ్యంగా 'రెటరిక్కు' లక్షణాలకు అలవాటుపడినవారికి నారాయణబాబు నచ్చడు. అందువల్లనే నారాయణబాబుది సద్యః స్ఫురణ కవిత్వం కాదు.

వెల్చేరు నారాయణరావుగారు ఆశు మార్గాన్ని లిఖిత మార్గాన్ని పద్యాలకు, మాత్రా ఛందస్సు కలిగిన గీతాలకు అన్వయించారు. ఈ మార్గాలను వచన గీతాలకు సైతం అన్వయించుకోవచ్చు.

వచనగీతాల్లో ఛందస్సు, మాత్రలు ఇవేవి ఉండవు (తెలియకుండా పడితే తప్ప). ఆధునిక పాఠకుల్ని లాక్కు వెళ్ళటానికి బాహ్య ప్రయత్నంగా ఇవేవి ఉపయోగపడవు. చాలసార్లు ఇవి ఆస్వాదనకు ఇబ్బందిగాకూడా తోస్తాయి. ఇక పాఠకుడ్ని భావం వెంట తీక్షణంగా వేగంగా లాక్కు వెళ్ళటానికి ఆత్మీయమైన ఓ వ్యవస్థ అవసరం వుంది. ఆ వ్యవస్థ భావంనుంచీ వేరయినదికాదు. కానీ ఓ మేరకు దాని హద్దుల్ని గుర్తించవచ్చు.

ఆ వ్యవస్థ ప్రతీక, ఉపమ, రూపకాది అలంకారమై ఉండ వచ్చు. లేదా యాంత్రికంగా, నిర్జీవంగా, అలంకారాల ప్రోగుగా కాకుండా గాఢమై, గూఢమై, విస్తారమై సూక్ష్మాతి సూక్ష్మమైన అనుభూతుల నుండీ చీల్చుకొని ఒక విధమయిన నిత్య నూతన క్రమంతో, లయతో సాగవచ్చు. దీనికి సంబంధించి తెలుగు కవిత్వంలో వివరంగా సూక్ష్మంగ పరిశోధన సాగాల్సివుంది.

ఆశుకవి పద్య నిర్మాణంకోసం ఛందో వ్యవస్థలో భాగాలయిన ధ్వని సంపుటులతో ఆలోచిస్తాడు. అంటే అదే అతని భాష అవుతుంది. అంటే కావ్య నిర్మాణ దశలో అతని భాషావ్యవస్థ పద్య నిర్మాణ వ్యవస్థగా వ్యక్తమవుతుంది.*

ఉపమాది అలంకారాలు వచన గీతాల్లోని ఆశుధోరణికి దగ్గరగా వస్తాయి. ఆశుకవిత్వ నిర్మాణంలోని అలంకార వ్యవస్థలో భాగాలయిన ఉపమాది అలంకారలక్షణ సంపుటులు భాషావ్యవస్థలో భాగాలయిన పదాంశాలు ఒకదానితో ఒకటి సంవదిస్తాయి. దాంతో ఇందులో గీతనిర్మాణ వ్యవస్థా, భాషానిర్మాణ వ్యవస్థా ఒకటవుతాయి.

నారాయణబాబు కవిత్వంలో ప్రతీకలు ఎక్కువగా కన్పిస్తాయి. ఇవి ఎక్కువగా గీతనిర్మాణాన్ని లిఖితమార్గంలోకి తీసు

ఉపమలు, ప్రతీకలు ఒకటికావు. అవి విభిన్న ప్రక్రియలు. ఒక్క ఉపమలు, ప్రతీక లేకాదు, యావత్తు అలంకారాలు వస్తుతత్త్వంలోని భిన్న భిన్న ధర్మాలకు, లక్షణాలకు, తీవ్రతకు, కాల

* నారాయణరావు, వెల్చేరు : తెలుగులో కవితా విప్లవాల స్వరూపం పుట. 78.

పరిణామానికి బాహ్యరూపాలు. అనాదినుంచీ తత్కాలాను గుణంగా మానవ మనస్తత్వాలకు, అభిరుచులకు వింత వింత రూపాల్లో దగ్గర కాగలిగాయి. ముఖ్యంగా ప్రతీకలు, ఉపమలు వేదాల నుంచీ నేటి దాకా బృహత్తర చరిత్ర కలిగినవే కాక వీటి మధ్య ఆత్మీయ సంబంధం ఉంది.

వస్తుతత్వ జ్ఞానాన్ని సహజంగా, సులువుగా వ్యక్తం చేయ గలిగిన భాషగా ఈ రెంటినీ చెప్పుకోవచ్చు. వస్తువుయొక్క తత్వ జ్ఞాన దార్శనిక యాత్రలో కవితో ఎంత సంక్లిష్ట దారులవెంట అయినా రాగలిగిన శక్తి కలిగినవి ఇవే ఈ రోజుకూ. అలంకార వ్యవస్థలో వాడబడిన భాషా ఈ భాష ఒకటికాదు. అంతేకాక ఇతర అలంకార లక్షణాలను సైతం పట్టివ్వగల సామర్థ్యం దీనికి ఉంది. ఈ భాషలో గురుత్వాన్ని సాధించినవాడు మిగిలిన అలం కారాల్లో అవసరమయితే సులువుగా పట్టు సాధించగలడు.

లిఖితమార్గ కవిత్వంలో అర్థం సంకల్పితమైన తర్వాత ప్రతీక వ్యవస్థలో బిగింపు జరుగుతుంది. దీన్నిబట్టి అర్థం సంకల్పితమయిన భాష, ఆ పిమ్మట అలంకార వ్యవస్థలో వాడబడిన భాషా ఒకటి కావు. ఆలోచనకూ, గీత నిర్మాణాన్ని పూర్తి చేయటానికి మధ్య విలంబం వుంది. అందువలన గీతంలో అలంకార లక్షణాల సంపు టులూ, భాషాగత పదాంశాలు సంవదించే అవకాశం తక్కువ. 'ఇమేజరీ బాగా హృదయంలో మథించబడితే సింబల్‌అవుతుంది'* అని తుమ్మపూడి కోటేశ్వరరావుగారు ప్రతీకను గురించిచెప్పిన నిర్వచనం ఈ దృష్టితోనే నిజం కాగలుగుతుంది.

* స్వరూప క్రిష్ణమూర్తి, జె : రక్తం - సూర్యుడు; ఒక పరిశీలన పుట. 57.

# నారాయణబాబు కవిత్వంలో పౌరాణిక ధోరణి

పోతే నారాయణబాబులో పౌరాణిక దృష్టి బలీయమైనది. దాన్ని విడిచి కవిత్వాన్ని చెప్పలేనంత శక్తివంతమైనది. మరీ కొన్ని చోట్ల ఈ విషయంలో శ్రీశ్రీ, నారాయణబాబు శిష్టా మార్గాన్నుంచీ, ప్రభావంనుంచీ పూర్తిగా బయటికి పడలేక పోయారు. శ్రీశ్రీ ఛందస్సు విషయంలో ప్రయోగాసక్తికి ఎలా దూరంకాలేక పోయాడో నారాయణబాబు పురాణ ప్రతీకల సృష్టి నుంచీ అలాగే బయటపడలేకపోయాడు. అయితే ఇద్దరూ అతినవ్య కవులుగా అభ్యుదయ మార్గ నిర్దేశ విశిష్టులు. శ్రీశ్రీ ఛందస్సు ప్రయోగంలో ఎంతటి ప్రావీణ్యాన్ని సాధించాడో, నారాయణ బాబు పురాణ సంప్రదాయాల్నీ, కవితా సంప్రదాయాల్ని బాగా ఆకళింపు చేసుకున్నదిట్టు. ఇద్దరిలోనూ రూపానికి సంబంధించిన ఈ పద్ధతులు చెప్పదలచుకొన్న భావాల్ని మింగేంతగా మారలేదు. రెండుమూడు గీతాల్లోమాత్రం నారాయణబాబులో శృతిమించి భావాన్ని మింగేసింది. ఇందుకు ఆయన రాసిన రెండు గీతాల్ని విడిగా పరిశీలించవచ్చు. ఈ రెంటిలోనూ భగత్ సింగ్ మరణం, గొప్పతనం ప్రధానంగా చిత్రించబడింది. 'కపాలమోక్షం'లో భగత్ సింగ్ ఔన్నత్యం చిత్రించబడితే, 'భగత్ సింగ్ శాపం'లో భగత్ సింగ్ పట్ల జాలి, దేశప్రజల గుండెల్లో అతడి బలమైన ప్రభావం, అతని మరణంపట్ల కలిగిన ఉక్రోషం వ్యక్తీకరించ బడింది. రెండు గీతాల్లోనూ ఆరాధ్యవ్యక్తిగా భగత్ సింగ్ చిత్రణే ప్రధానంగా కనిపిస్తుంది.

కవి ఆధునికుడయినప్పుడు శిల్ప నిర్మాణంలో సంప్రదాయాన్ని విసర్జించాల్సి ఉంటుంది. శబ్దప్రయోగంలో వాక్య నిర్మాణంలో ఆధునికత్వాన్ని సాధించాలి. మంచి కవిత్వంలో రూపానికీ భావానికీ ద్వైధీభావం ఉండదు. రూపంభావం ఆధునికత్వాన్ని సంతరించుకున్నప్పుడు కవిత్వం ధనుర్బాణంలా ఏక లక్ష్యంగా ఉంటుంది. ఒకటీ అర సంప్రదాయ వాసనలు ఉన్నా అవి భావానికి అడ్డురావు. దృష్టిని తమవైపు తిప్పనీవు. ఇంక 'కపాల మోక్షం' గీతాన్ని పరిశీలిద్దాం.

"నిర్వికల్ప సమాధి
నిమీలి తాక్షుడు
వేద సన్నిహితుడు
ఆదిశంకరు
తపస్సమాధిని
ఓంకారమ్మే
హూంకరించినది" మొదలు

"ఎందరు పుట్టలేదు
ఇంకెందరు గిట్టలేదు
అందరికీ లభిస్తుందా
హాలాహల మంటిన
హస్తస్పర్శ
పెదవుల చుంబనం
కపాలమోక్షం !" వరకు

ఏకధాటిగా వేగంగా, ఆవేశంగా నడిచే ఈ గీతంలో ఖండకావ్యానికి కావాల్సిన విస్తృత ఇతివృత్తం ఉంది. పాదాల్లోని విరుపులనుంచి శంకరుని హుంకారం, అతని గొప్పతనం వ్యక్తమవుతుంది.

వేదసన్నిహితుడైన ఆదిశంకరుడు నిర్వికల్ప సమాధిలో ఉన్న ప్పుడు ఓంకారం హుంకరించింది. అప్పుడు

సంచలించినవి
చరాచరమ్ములు
భూతాలు ప్రదేకించినాయి
కాటుక పెట్టిన
నయనేంద్రియమై
కర్మసాక్షియే
చీకటులురిలాడు.

పై పాదాల్ని చదివినప్పుడు హుంకారానికి తల్లడిల్లిన శైవ గణాల్ని దర్శిస్తామే కాని భగత్సింగ్ మరణానికి స్పందించిన ప్రజలు, దేశంలో పెల్లుబికిన నిరసనను అందుకోలేం. కవి తీసు కున్న ఇతివృత్తాన్ని రూపం కప్పేస్తోంది. సంప్రదాయ ప్రియత్వం భావాన్ని దారిమళ్ళిస్తోంది. పైనచూపిన భావచిత్రాలు పాఠకుడ్ని అనుభూతి లోకంలోకి తీసుకెళతాయి. 'కాటుక పెట్టిన। నయనేం ద్రియమై। కర్మసాక్షియే' అన్న గొప్ప భావచిత్రానికి ద్రవిస్తాం. 'నిర్వికల్పసమాధి, ఆదిశంకరుడు, వేదసన్నిహితుడు, ఓంకారం, కర్మసాక్షి' మొదలైన పదాలన్నీ పురాణ ప్రతీకలే. 'వేదసన్ని హితుడు' అనటంలో అతని గొప్పతనాన్ని చెపుతున్నాడు. పరో క్షంగా భగత్సింగ్ మరణానికి కలిగిన ప్రతిస్పందనను తెలియ జేస్తు న్నాడు. 'కర్మసాక్షియే చీకటులురిలాడు' అనటంలో లోకమంతా లేక దేశమంతా ఒక వీరుని మరణంతో ఎంత అంధకార బంధురంగా మారిందో తెలియజేస్తాడు. ఇంకా 'అభ్రగంగలో। శుభ్రవీచికల। హాలాహలమే తలఎత్తింది। శేషునిఫణాల। మణుల కాంతులు।

పీసర వోయినవి' అంటాడు. ఈ సన్నివేశ చిత్రీకరణతో మన ముందు పౌరాణిక దృశ్యాలు సాక్షాత్కరిస్తాయి. పూదోటలు లేనే లేవు, వసంతములు రానేరావు, 'ముల్లోకములు । తబిసిమిన్నలు । ముమ్మరించారు' అంటూ దృశ్యంనుంచీ దృశ్యానికి పాఠకుడ్ని పరిగెత్తిస్తాడు. కవి ప్రయత్నమంతా భగత్సింగ్ మరణానికి దేశంలో వచ్చిన ప్రతిస్పందనను ఆవిష్కరించడమే.

"అనంతకోటి
జీవరాసులు
హాహాకారం
చేశాయి
హరోం హరా ! యని
పాహి ! పాహి ! యని" ప్రణమిల్లాయి.

ఒక సన్నివేశం నుంచి ఇంకొక సన్నివేశానికి వేగవంతంగా నైపుణ్యంతో నడుపుతాడు.

శివుని ఓంకారం హూంకరించింది. ఓంకారం నిజంగా హుంకరించదు. అది నిర్యాణ సోపానము. సాయుజ్య మార్గం. 'ఓంకారం హుంకరించినది' అన్న ప్రయోగంతో సంప్రదాయ మార్గంలో కొత్త అర్థాన్ని కల్పిస్తాడు. అది ఎంత భయంకరత్వానికి దారి తీస్తుందో సూచిస్తాడు. సంప్రదాయమార్గంలో నవ్యతను సాధించాడు. బౌద్ధికంగా ముఖ్యంగా సంప్రదాయ జీవిత అవగాహనలోంచే సరి చూసుకొంటే స్పందనకు వీలు కల్గుతుంది.

"ఆర్ధ్రమైనది
ఆ మహామహుని
అంతః కరణ
అంతట అక్షులు విప్పి

ఆకలి ! ఆకలి ! అంటూ
భిక్షాపాత్రకు
చేయి చాపినాడు.”

ఓంకారంనుంచి ఆకలి హాహాకారంలోకి దృశ్యం మారుతుంది.

ఉగ్రతపస్సున
క్రమ్మిన నది
వేడికంటికి
సూడిదపెట్టిన
బ్రహ్మకపాలం
పటపట కొరికినాడు
నటరాజు !

పరుగుతో సాగిన కథనంలో నడక మొదలవుతుంది. ఇక్కడ వేగాన్ని మార్చడంతో (ఆపడం) నారాయణబాబు విషయక్రమానికి బలాన్ని కూర్చాడు. ఇంకా వేగాన్ని పెంచి వాతావరణ కల్పన చేస్తే హృదయం బరువెక్కి గ్రహింపు సన్నగిల్లుతుంది.

“భూత పిశాచాల్
బొబ్బరిల్లినవి
వందిమాగధులు
వణికారు
భయపడి బసవడు
రంకె వేసినాడు”

ఇప్పుడు భయపడినవి భూతపిశాచాలు, వందిమాగధులు, బసవడు మాత్రమే. పాతదృశ్యం నుంచీ వేరయి కాస్త నిలకడ ఏర్పడటం వలన కొత్త దృశ్యంలోకి ప్రవేశించటంవలన మనసు తిరిగి అనుభూతి వేగానికి స్పందనకు సంసిద్ధమయ్యే వీలుంది. క్రింది

దృశ్యాల్ని చూడండి. కైలాసం నుంచీ పాశకుడిన్నలాగి భూలోకం లోని స్మశానవాటికలోకి విసిరేస్తాడు.

సమాధుల్లోని వివిధ మతస్తుల కపాలాల్ని శివుని బిక్షాపాత్రి కగా చేరటానికి వాటి ఆసక్తిని చూపించేందుకు వెంటనే దృశ్యాన్ని మార్చి పై దృశ్యంకంటె తక్కువ నిడివితో ముగిస్తాడు. దాంతో దృశ్యంలో వేగం పూర్తిగా తగ్గిపోతుంది. తిరిగి వేగాన్ని పెంచు కోటానికి వాతావరణాన్ని సృష్టించి అనుభూతి వేగాన్ని పెంచి హృదయాన్ని లాక్కెళ్తాడు.

"శ్వేత పర్వతపు
శిఖరాంచలముల
కనకభాండమే
కదిలింది" అంటూ శివుని ఆకలిని తీర్చ

డానికి ఏర్పడిన చిన్నచిన్న దృశ్యాల్ని పేర్చుకుంటూ పోతాడు.

"గంగ వక్షమే
పాల పోటుతో
కళవళ పడ్డాది" ఈ సన్నివేశం హృదయాన్ని

ద్రవింపజేస్తుంది.

"మంటల్లోనే పుట్టాడు
మంటల్లోనే పెరిగాడు
మంటల్లోనే మడిశాడు" అన్న మూడు

వాక్యాలతో భగత్ సింగ్ 28 ఏళ్ళ జీవితాన్ని కుప్పపోశాడు. మూడు వాక్యాలతో ఒక జీవితచిత్రాన్ని ఆవిష్కరించాడు. బాల్యం నుంచీ ఎవ్వనం, ఎవ్వనంలోనే ఎదురైన మరణాన్ని ధైర్యంగా ఎదుర్కొన్న భగత్ సింగ్ కళ్ళముందు ప్రత్యక్షమవుతాడు.

"అగ్నివీణవై
భగ్న కంఠమై
భగ్న గీతమై
తారక మంత్రం
పరం జ్యోతిగా
వీరశైవుడు !" ఉన్నాడు.

"భారత వీరుని
కపాలమొక్కటి
కపర్ధి చేతిని
రివ్వున వాలింది' అంటూ

"కెవ్వున కేకేశాడు
కంఠేకాలుడు
ఫాలనేత్రమే
స్పందించింది
అండపిండ బ్రహ్మాండమంతా
తాండవ నృత్యం చేసింది
ఆనందాశ్రుల నించింది.
శేషుని ఫణాల మెత్తని శయ్య
పుడమి ఒత్తిగిలింది
ఎడారి పుష్పించింది !
ఎందరు పుట్టలేదు
ఇంకెందరు గిట్టలేదు
అందరికీ లభియిస్తుందా
హాలాహల మంటిన
హస్తస్పర్శ !

పెదవుల చుంబనం !
కపాలమోక్షం !
కపాలమోక్షం ! !''

ఇలా దృశ్యాల నడకతో, పరుగుతో పట్టుని అందుకుంది. వీరశైవుణ్ణి చూపిన దృశ్యంలో రివ్వున భరతవీరుని (భగత్ సింగ్) కపాలం ప్రత్యక్షం కావటంతో మొదట్లో పకపక నవ్విన, ఘల్లు ఘల్లుమన్న కపాలాలు అసందర్భంగా లేదా వర్ణనగా ఉన్నా చిన్న చిన్న సన్నివేశాలు పరుగుని వదులుకొని నిలిచి పోతాయి. 'శేషుని పై పుడమి ఒత్తిగిల్లింది' అనేపాదం భగత్ సింగులాంటి వ్యక్తి వీరత్వం చాలు దేశాన్ని నెమ్మది పరిచేందుకు అనే అర్థాన్ని బోధిస్తుంది. అట్లే 'ఎడారి పుష్పించింది' అనే పాదంద్వారా ఎడారిగా ఉన్న విప్లవమార్గం భగత్ సింగు త్యాగంతో వికసించినట్టు సున్నితంగా గుర్తుచేస్తాడు.

వ్యక్తిలోని రసగ్రహణాశక్తిని మందగించకుండా, అలుపు కలిగించకుండా, వేగం, నడక, నిలకడ స్థాయీ భేదాల్ని పాటిస్తూ పాఠకుడ్ని పట్టుకెళతాడు. అందుకే రోణంకి అప్పలస్వామిగారు 'కపాలమోక్షం'ను ''పౌరాణిక ఇతి వృత్తాలతో సంప్రదాయపు మెళకువలను ఆకళించుకొని పఠితకు కవితను ఆస్వాదయోగ్యం కావిస్తాడు. ఒక్కొక్కసారి శరీరం జలదరింపులు చేసే మెరుపులు కురిపిస్తాడు. శబ్దం కొత్త పలుకుబడితో ధ్వనిస్తుంది. ఈ దృష్టి తోరచించిన అతని గేయావళిలో కపాలమోక్షం ఎన్నదగినది''* అన్నారు.

* ప్రస్తావన – 'రుధిరజ్యోతి' – పీఠిక.

ఆధునిక ఇతివృత్తాన్ని వస్తువుగా ఎన్నుకొని పూర్తిగా పౌరాణిక సంప్రదాయ మార్గంలో కవిత్వాన్ని సృష్టిస్తే కవిధ్యేయం నెరవేరడం కష్టం. శివుడ్ని అతని ప్రమధగణాల్ని ఇతర అండ పిండ బ్రహ్మాండ కోటిని వాస్తవ జగత్తులో చూడకపోయినా కవి యొక్క ప్రతిభతో ఏకం అవుతాం. కానీ తాదాత్మ్యం చెందలేం. భగత్ సింగు తెలిసినవాడు. స్వాతంత్ర్య పోరాటంలో అతని పాత్ర, అతని గుణగణాలు, మిత్రులమధ్య అతని ఆలోచనలు, కార్యకలాపాలు తెలుసు. భగత్సింగును ఉరితీసిన ఘట్టం భారతచరిత్రలో మరపురాని సంఘటనగా నిలిచిపోయింది. ఇదంతా పరోక్షంగా పాఠకుడి మనసులో ఉంటుంది. కపాలమోక్షంలో భగత్సింగు ఆలోచనలు, చర్యలు, ఉరితీయబడిన శిరస్సు చెప్పే రహస్యం శివుని హుంకరింపుల ముందు వినిపించకుండా పోయాయి. ఇందులో శివుడు ప్రధానమైపోయాడు. శివుడ్ని ప్రధానం చేసి తద్వారా భగత్సింగును ఉన్నతుడ్ని చేద్దామనే ప్రయత్నంలో భగత్సింగు మరుగున పడిపోయాడు. పౌరాణిక దృష్ట్యా అడుగడుగున ఆవేశం తొణికిసలాడుతుంది. "ఒక్కొక్కసారి శరీరం జలదరింపజేసే మెరుపులు కురిపిస్తాడు. శబ్దం కొత్త పలుకుబడితో ధ్వనిస్తుంది."[1] అన్న కోణంకి వారి వాక్యాలు ఈ దృష్టితో సరిపోతాయి. కానీ "భగత్సింగు వంటి యోధాను యోధుల జీవితం ఉదాత్తం చేస్తున్నప్పుడీ పద్ధతి పౌరాణిక సంప్రదాయం కవికి అత్యవసరం"[2] అన్న ఆయన ధోరణి మాత్రం విమర్శకు నిలవలేనిది. ఈ గీతంలో ఆశ్చర్యాన్నీ, అద్భుతాన్నీ తప్ప చైతన్యస్ఫూర్తిని పొందలేము.

---

1-2. ప్రస్తావన - 'రుధిరజ్యోతి' - పీఠిక.

ఈ విషయాన్ని నారాయణబాబే గుర్తించి వుండాలి. ఏమూలో వెలితి ఉండి ఉండాలి. అందుకే "భగత్సింగు శాపం" రాసి వెలితి పూడ్చాడు. 'కపాలమోక్షం' తర్వాత వచ్చిన గీతంగా దీన్ని అనుకోవాల్సి ఉంటుంది. పుస్తకంలో తారీఖులు ఇవ్వక పోయినా అందులోని విషయం మనకు ఆధారం అవుతుంది.

"భగత్సింగ్ శాపం"లో మనస్సును, దృష్టిని పౌరాణికత లోకి లాగే దృశ్యం ఒక్కటే ఉంది. ఇక కృతువు, బలిపశువు, ఋషులు అన్నపదాలు ఉన్నా అవి లౌకికార్థంలో గ్రహించటం సాహిత్యంలో మామూలై పోయింది.

'కపాలమోక్షం'లో వున్న శివుడే ఇందులోనూ ఉన్నాడు. అయితే ఇందులో అతడ్ని ఉన్నతపరచటం ద్వారా భగత్సింగు ఔన్నత్యాన్ని చూపుదిద్దే ప్రయత్నంలేదు. శివుడు నిశ్చలుడై వుంటాడు. ఏ విధమైన హుంకారాలు పళ్ళు పటపటలు లేవు.

"హిమవన్నగమున
ఆదిశంకరుని
హస్తయుగమ్మున
చల్లని రాత్రి
నల్లని జండా
నాలుక జాపింది"

చల్లగా నిద్రబుచ్చే రాత్రి సహితం మౌన నిరసనకు పూను కున్నట్లు బొమ్మగీశాడు. మౌన నిరసనలో ప్రకృతికూడా పాల్గొ నింది. రాత్రిని జండాతో పోల్చినా దానికి జండాలోని కదలిక ఉండకుంటే జీవం ఉండదు. నాలుకను రాత్రితో పోల్చిచెప్పడంతో నిరసనకు బలాన్ని, సహజత్వాన్ని కల్పించినట్టుగా అనిపిస్తుంది.

"వెన్నెల పీలిక గానీ
సన్నని గాలులు గానీ
లేనే లేవు"

'వెన్నెల పీలిక' అద్భుతమైన పదబంధం, గొప్ప భావచిత్రం. మొదటి దృశ్యంతో, రెండవ దృశ్యం సజీవ వ్యక్తిత్వాన్ని పొంది అనుభూతి గాఢతను కల్గిస్తుంది. వెన్నెలను పీలికగా చిత్రించటం నిరసన బలాన్ని గుర్తుచేయటమే.

చీకటి
కదనకుతూహలరాగం
చిందులు త్రొక్కి
చుక్కల చూపులుకూడా
సురిగిన మొండి రాత్రి అది.

ఈ దృశ్యం మొదటి దృశ్యంతో సజీవ సంబంధాన్ని అందుకొని అనుభూతి వేగాన్ని పెంచుతుంది. నిరసనకు పరాకాష్టగా చీకటి చిందులుత్రొక్కి కదనకుతూహలరాగం ఆలపించింది.

క్రతువంటూ
పశువంటూ
నినుబలియిచ్చిన
ఋషులంతా పటాపంచలైనారు
నీ గళమ్మున నిరాకరణ సూత్రం
వైచి నిలువున ఉరితీశారా
నా తండ్రీ !

భగత్సింగుకు ఉరిశిక్ష విధిస్తే కాంగ్రెస్ నాయకత్వం నోరు విప్పలేదు. పైగా భగత్సింగును బ్రిటిష్ ప్రభుత్వం టెర్రరిస్టుగా ముద్రవేస్తే, కాంగ్రెస్ వర్గంకూడా వంతపలికింది. ఆయన గళంలో నిరాకరణ సూత్రం వేసి ఉరితీశారు.

పై చారిత్రక సత్యాన్ని బలంగా, సంక్షిప్తంగా కవిత్వీకరించాడు నారాయణబాబు. పై సన్నివేశం 'క్రతువంటూ' ప్రారంభమై 'నాతండ్రీ !' అన్నచోట ఆగిపోయింది. 'నాతండ్రీ !' అన్న ఒక్క శబ్దంతో గుండె కుదిపినట్టు అవుతుంది.

గీతంలో దృశ్యానికీ, దృశ్యానికీ మధ్యవున్న సంబంధాల్లో ఇతరేతర అనుభూతుల ప్రమేయం శృతిమించటం కానీ, పౌరాణిక ప్రస్తావన విస్తరించటంకానీ, లక్ష్యానికీ, అనుభూతులకూ మధ్య సాదృశ్యం అంతరించటంకానీ జరిగితే పఠితుల్ని మూల వస్తువు యొక్క స్ఫూర్తినుంచి దూరం చేస్తుంది. తాత్కాలికంగా మన స్సును లాక్కువెళ్ళినా స్పృహను (పరిశీలనలో నిలపటం) ఏర్పరచదు.

దృశ్యం నుంచీ దృశ్యానికీ ప్రయాణిస్తూ పాఠకుడు శిల్పం కల్పించే తాదాత్మ్యంనుంచే మూల వస్తువును అందుకుంటాడు.

నాటికి
నేటికి
భారతభూమి
పాడి యావునకు
కళ్ళల్లో కాటుకపొగలు
బుజ్జను భూకంపం
గుండెల్లో
కుతకుత ఉడికే
లావా !

ఈ పాదాలు ముగియటంతో నిజమైన భగత్సింగు స్ఫూర్తి హృదయానికి దగ్గరగా వచ్చినట్టవుతుంది. చారిత్రకంగా పాఠకులకు తెలిసున్న భగత్సింగు తళుక్కున మెరుస్తాడు. కవి ఈ శక్తిని

సాధించలేనప్పుడు శ్రోతలో సంప్రదాయ వ్యామోహాన్నీ, సంప్రదాయ దృష్టినే ఏర్పరిచే పరిస్థితికి లోనుకావాల్సి వస్తుంది. ఇక్కడే 'కపాలమోక్షం' కు 'భగత్సింగు శాపం' కు ఉన్న ప్రధానమైన తేడా.

## నారాయణబాబు కవిత్వంలో కథా నిర్మాణం

కథా నిర్మాణం కన్పించే మరో మంచి కవిత 'ఊరవతల' ఖండిక. పాఠకుడు దృశ్యంనుంచీ దృశ్యానికి భావ చిత్రాలపై పయనిస్తూ సంప్రదాయ ప్రతీకల్ని ఏరుకుంటూ అనుభూతిలోకంలో చైతన్యం దిక్కుకు పయనం సాగించవచ్చు. ఊహాలోకాల్లో కృత్రిమ ప్రపంచంలో బ్రతుకుతున్న కవి, ప్రపంచంలోని వాస్తవ దృశ్యాలకు స్పందించి అవాస్తవంనుంచీ వాస్తవంలోకీ, వాస్తవం నుంచీ అధివాస్తవంలోకి ఎట్లా పయనించాడో 'ఊరవతల' గేయంలో చూడొచ్చు.

నారాయణబాబులోని చారిత్రక భౌతికవాద పరిజ్ఞానాన్ని ప్రతిబింబించేదీ ఆయనలోని ప్రాపంచిక పరిణామ విశ్లేషణనీ, నైశిత్యాన్నీ అద్దం పట్టేది 'ఊరవతల' గీతం.

కలల పొదరిళ్ళలో
సౌఖ్యంపు నిదురలో
కనిపించి
ఒక తన్వి
మేనక నా పేరు
మేఘాలకు వెనకప్రక్క
మావూరని మాయమయ్యె
చిరునామా తెలిసికూడ

చేసేదేమీ లేక
ఊహాగానం శాయగ
ఊరవతల కెళ్ళాను

ఇందులోని వ్యక్తి భావకవి. జీవితపు లోతుకు వెళ్ళడు. కాల్పనిక ప్రపంచాన్ని సృష్టించుకొంటూ, కలల పొదరిల్లు కట్టుకొని సుఖంగా మత్తుగా ఉండిపోవాలని అతని నిత్య సంకల్పం. బాధయినా తీయగా ఉండాలని మధురమయిన బాధనే కోరుకుంటాడు.

ఒకరోజు అతను కాల్పనిక ప్రపంచంలో విహరిస్తుండగా ఓ స్త్రీ కన్పిస్తుంది తనకోసమే దిగివచ్చిన అప్సరసగా భావించి నిశ్చేష్టుడయిపోతాడు. ఆమెను అలాగే చూస్తూ దేవతగా ఆరాధిస్తూ ఉండిపోతాడు. ఆమె అతని ఊహాగానంలో శృతి కలపలేదు. ఆమెకు బాధలు, సమస్యలు, దారిద్ర్యం వున్న ప్రపంచం ఉంది. అది ఆమెను తీరిగ్గా, ఓపిగ్గా అతనిలా ఉండనీయదు. అతనిలా ఊహాగానం చేయనీదు. అందుకే ఆమె వెంటనే వెళ్ళిపోయింది. దాంతో భావకవి ఉత్సాహం దెబ్బతినింది. అయినా ఆమె చిరునామా యివ్వటంవల్ల, మరోపని లేకపోవటంవల్ల అతని సహజ ధోరణిలో ఊహాగానం చేస్తూ బయలుదేరాడు.

మేనక భూలోకానికి రావటం, శకుంతలని కనటం, శిశువును వదిలి వెళ్ళటం, ఆ శిశువును శాకుంతలములుని పెంచటం మనకు తెలిసిన పురాణగాథ. కానీ ఈ గీతంలో మేనకను గుర్తుచేయటంలోని అంతరార్థం వేరు. నాటి మేనక దేవవేశ్య, ఊహాసుందరి. నేటి మేనక మామూలు వేశ్య. మురికవాడలూ, వ్యభిచారవృత్తి పారిశ్రామిక విస్తరణ ఫలితాలే. పెట్టుబడిదారీ పారిశ్రామిక విధానం పెంపొందటంవలన నగరాల్లో పరిశ్రమలు

ఏర్పడి దాని ఫలితంగా మురికివాడలు పుట్టుకొచ్చాయి. ఈ మురికి వాడల వెనుకవున్న తన నివాసాన్ని తెలియజేస్తుంది మేనక. ఈ వాస్తవాన్ని గ్రహించినాక దేవవేశ్యమీద ఆసక్తి సన్నగిల్లింది. ఆరాధన మందగించింది.

'తన్వి' అనటంతో ఆమెయొక్క వృత్తిని సూక్ష్మంగా ధ్వనింపజేస్తాడు. బాహ్య పరిస్థితులు మానవ సంబంధాల్ని ఎలా నిర్దేశిస్తున్నాయో వివరించటంద్వారా వేశ్యావృత్తిమీద అసహ్యాన్ని కాకుండా అన్వేషణ ఏర్పరుస్తాడు. మేనకలాంటివారి జీవనం మీద సానుభూతి కలిగిస్తాడు.

ఈ గీతంలో కథనాత్మక దృష్టి బాగా కన్పిస్తుంది. చిన్న చిన్న సన్నివేశాలను మేళవిస్తూ కథాశిల్పాన్ని కవిత్వంలో బంధిస్తాడు.

భావకవి తన సిద్ధాంతంలోని పేలవత్వాన్ని తనకుతానై అర్థం చేసుకొని సామాజిక వాస్తవాలతో ప్రతిస్పందించే స్థాయికి చేరుకొంటాడు. మృత్యువులా ఎదురయ్యే అనేక సామాజిక భీబత్స దృశ్యాల్ని చూడటం ద్వారా కాల్పనికత నశించి, చారిత్రకంగా కవిలోవచ్చే అభ్యుదయ దృష్టిని తెలియజేస్తాడు నారాయణబాబు. చారిత్రక పరిణామంయొక్క అనివార్యక్రమాన్ని నొక్కి చెపుతాడు నారాయణబాబు.

కావు ! కావు !<br>
ఆకాశం కాకిపిల్ల<br>
నోరు తెరిచె<br>
మేత కొరకు

పాపిష్టి ఇనోదయమ్మో
పాముకాటు ఎండ పొడిచె
భువికి తగిలె శివ జ్వరం !

'కావు, కావు – ఆకాశం కాకిపిల్ల', అన్న భావచిత్రం ఇమేజరీ లక్షణాల నుంచీ పుట్టింది. అయితే నారాయణబాబులో అన్ని పాదాల్నీ ఏదో వర్గంకింద (ఇమేజరీ అనో, సింబాలిజం అనో, స్రియలిజం అనో) చేర్చి లెక్కకట్టటంచాల కృతకంగా ఉంటుంది. ఆయన కవిత్వంలోని ఆలంకారిక దేహం ప్రాణ వంతమైన చైతన్య దీప్తినుంచీ, సజీవత్వంనుంచీ పరిణితి చెందిన విభిన్న ఉద్యమాల సారరూపం తప్ప అతుకుల బొంతకాదు. పద్యంలోలా చక్కటి శబ్దాలకు, తూగుకు, అలంకారానికి మెచ్చు కొన్నట్టు నారాయణబాబు గీతంలోని పాదాల్ని వేరుచేసి ఇందులో భావచిత్రమనో, సింబలనో మెచ్చుకోవటం అంత సరైన పద్ధతికాదు. అట్లని వాటిని విస్మరించాలనికాదు. గీతం అడుగున వున్న అసలు తత్త్వంలోంచి వాటిని అర్థంచేసుకోక విడగొట్టి పైపై సొగసులు చూసి మెచ్చుకోవటం అర్థవంతమైన సాహిత్య పరిశీలనకు నిదర్శనం కాదు. నారాయణబాబు కవిత్వ రూపాన్ని గురించి ఒక్కమాటలో చెప్పాలంటే ఆయన ఆత్మే ఆయన ప్రతీక, ధ్వని, అలంకారం.

'కావు, కావు, ఆకాశం కాకిపిల్ల, నోరు తెరిచె; మేతకోరకు' అనటంద్వారా ప్రపంచమంతా విస్తరించిన దారిద్ర్యాన్నీ, ఆకలినీ గుర్తుకు తెస్తాడు. ఆకలితో నకనకలాడుతున్న ప్రాణికి సూర్యోదయం పాముకాటులా బాధపెడ్తుతుంది. అంతేకాదు చివరికి ఆకలి చావులు ప్రపంచవ్యాప్తంగా తప్పనిసరితీవ్రమైన దుస్థితి దాపురిస్తోంది. నిజంగా అది పాపిష్టికాలం

"ఫలములు లేనేలేవు
పచ్చనకూడా చచ్చి
నీడకూడా ఈయలేని
మోడుచెట్ల జంటపొత్తు"

అందుకు కారణం లేక పోలేదు. ఫ్యూడల్ వ్యవస్థలోని ఉత్పత్తి సంబంధాలు చరమదశకు చేరుకున్నాయి. ఉత్పత్తి శక్తుల్లో కృషి క్షీణించి ఉత్పత్తి తగ్గుముఖం పట్టింది. 'పచ్చనకూడా చచ్చి నీడకూడా ఈయలేని' దశ అంటే మానవజాతికి ఏ మాత్రం ఉపయోగపడని దుస్థితికి నిరర్థకంగా వచ్చాయని చెప్పటమే. 'ఫలములు లేనేలేవు' అంటే ఉత్పత్తులు ఈ కృత్రిమ సంబంధాల్లో ఉండటానికి సాధ్యంకాదు.

"ఇనుప సరుకు ఎనుపోతు
ఎమునెక్కుడో దింపేసి
తను మాత్రం ఎదురాయెను"

ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తున్న పారిశ్రామిక వ్యవస్థ ఫ్యూడల్ వ్యవస్థలోని యజమాని, బానిస సంబంధాల్ని తెంచి వారి మధ్య నూతన సంబంధాల్ని నెలకొల్పుతోంది. యజమాని చెప్పుచేతల్లో ఉంటూ, ఎలా నడిపిస్తే అలా నడిచే దశదాటి తిరుగుబాటుదశ ప్రారంభమయ్యింది. బానిస చైతన్యాన్ని సూచించటానికే నారాయణబాబు 'ఇనుపసరుకు ఎనుపోతు' - 'ఎమునెక్కుడో దించేసిం'దని తెలియజేస్తాడు. ఎముడంటే ప్రాణాలకు శాసన కర్త. ఫ్యూడల్ లార్డ్ లక్షణాలకు చక్కటి ప్రతీక. ఫ్యూడల్ యజమాని బానిసల్ని కొట్టినా, తిట్టినా, చంపినా న్యాయమే అవుతుంది. అయితే పరిస్థితి నేడు తల్లకిందులయ్యింది. ఇంతకాలం బానిసగా

బ్రతికిన ఎనుపోతు నేడు విముక్తి చెంది యజమానిని ఎక్కడో దించేసి తనుమాత్రం స్వేచ్ఛగా ఎదురయ్యింది.

బానిసవ్యవస్థ ఫ్యూడల్ వ్యవస్థను చరిత్ర పుటల్లో ఎక్కడో దించేసి తిరిగి కొత్త బరువును మోయటానికి సిద్ధమైంది. అది బూర్జువావర్గం తెచ్చిన పారిశ్రామిక వ్యవస్థ. పారిశ్రామిక వ్యవస్థ లేకుండా బూర్జువా వ్యవస్థను వూహించటం సాధ్యంకాదు.

ఎముడు, ఎనుపోతు ఫ్యూడల్ వ్యవస్థ (పౌరాణిక) ప్రతీకలు. సంప్రదాయ ప్రతీకల్ని ఆధునికీకరించాడు. ఇక్కడ సింబల్, ఇమేజరీ కలిసిపోయిన దృశ్యం కన్పిస్తుంది. దీనికి దగ్గరగా ఉన్న పాశ్చాత్య విమర్శకుడు సి. డి. లెవిస్ వాక్యాలు చూడండి. "A Symbol is denotative; it stands for one thing only, as the figure I represents one unit. Images in poetry are seldom purely symbolic, for they are affected by the emotional vibrations of their context so that each reader's response to them is apt to be modified by his personal experience".*

"ప్రేతలతో
ఇల్లట్టుల
బూరుగు వృక్షంమీద
కళ్ళజోడు పెట్టుకున్న
గరుడ పురాణ బ్రాహ్మ
కంఠమెత్తి ఘూకము"

* The poetic Image, Page - 41.

బూర్జువావర్గం అత్యధికశక్తిని పుంజుకొనేకొద్దీ మనిషి విలువ దిగజారిపోతుంది. "అది సకల ఫ్యూడల్ సంబంధాలనూ నిర్మూలించింది. మానవుడ్ని జన్మతః తనకంటే అధికులైనవాళ్ళకు ముడి వేసిన కలగాపులగపు ఫ్యూడల్ సంబంధాలను బూర్జువావర్గం నిర్దయగా పటాపంచలు చేసి మనిషికీ మనిషికీ మధ్య నగ్నమైన స్వలాభంతప్ప కిరాతకమైన డబ్బు లావాదేవీలు తప్ప ఇక ఏ సంబంధాలనీ మిగలనివ్వలేదు. మతావేశంవల్ల, రణోత్సాహంవల్ల, మూర్ఖపు మమకారంవల్ల కలిగే అలౌకిక ఆనందాలన్నిటినీ అది స్వలాభమనే కత్తితో ఖండించివేసింది. అది మనిషి విలువను రూపాయల్లోకి మార్చింది ......"* ఈ పరిణామాన్ని ఫ్యూడల్ అవశేషాలు వున్న సనాతనవర్గం ఓర్చుకోలేకపోయింది. ఏమాత్రం సహించలేకపోయింది. అందుకే పునఃస్మరణద్వారా, స్మృతుల్ని వల్లించటంద్వారా ఆనాటి ప్రభావాన్ని చేరుకొనే మార్గాన్ని అనుసరింప జేస్తున్నారు.

'ఘూకమ్మె' అనటంద్వారా ప్రమాదాన్ని గుర్తుచేశాడు. కాలం చెల్లిన వాటిని అవి ఎంత విలువయినవయినా పునరుద్ధరించాలనుకోవడం నిరర్థక ప్రయత్నమే కాదు అపాయంకూడా, అన్న వాస్తవాన్ని సూక్ష్మంగా వివరిస్తాడు.

"కాటకంపు
తాటకిలా
ఆరుబయట మిల్లు
విశ్వకర్త హృదయంలో
దుస్వప్నంలా
భుగ భుగ మను

* మార్క్స్, ఏంగెల్స్ – కమ్యూనిస్టు ప్రణాళిక. పుట. 40.

పొగ గొట్టం
ఆకాశమే చిల్లులు పడ
అత తారస్థాయి
నా మిల్లు రచింది"

పారిశ్రామిక వర్గంవలన మిల్లులు వచ్చాయి. వాటిలో ఒకటి ఊరిబయట ఉండే మిల్లు. అది తాటకిలా కార్మికుల్ని పీడిస్తుంది. అంతేకాక ప్రకృతి వాతావరణాన్ని సహితం కాలుష్య పరిచేట్టుగా తయారయ్యింది. మిల్లు యాజమాన్యపు లక్ష్యం అధిక ఉత్పత్తిని సాధించి లాభార్జనను వృద్ధి చేసుకోవటమే. ఎంత త్వరగా కార్మికుల్ని సన్నద్ధుల్ని చేసుకుంటే అంత త్వరగా పని జరిగి ఉత్పత్తి పెరుగుతుంది. కార్మికుల్ని నిర్దాక్షిణ్యంగా పనిలోకి సాగనంపటమే తమ నిత్యకృత్యం.

"పనిగంటలు పెంచడం, లేక అదేకాలంలో కార్మికునితో ఎక్కువ పని చేయించుకోవడం లేక యంత్రాల వేగం ఎక్కువ చేయడం మొదలయిన పద్ధతులద్వారా కార్మికునిమీద పడే శ్రమ భారం పెరుగుతుంది."* దాంతో కార్మికునికి తీరిక లేకుండా పోతుంది. కంటినిండా నిద్రకూడా కరువవుతుంది.

కనీసపు ఫ్యూడల్ వ్యవస్థలోని ఆదరణాభిమానాలు మృగ్యమై అధికార దురహంకారం శ్రామిక వర్గాన్ని శాసిస్తుంది. ఈ శాసనాన్ని ధిక్కరించే వేరొకమార్గం కార్మికునికి ఏదీ కనిపించటం లేదు. జీవికకోసం ఇదంతా భరించక తప్పని పరిస్థితి కొనసాగుతోంది. కాబట్టి కణకణ మండే కళ్ళతో విశ్రాంతిలేని యాంత్రిక జీవనాన్ని అనునిత్యం భరించక తప్పటల్లేదు.

* మార్క్స్, ఏంగెల్స్ — కమ్యూనిస్టు ప్రణాళిక, పుట. 41.

"జీవనమ్మే తీసినారు
జలమంతా మిల్లుకెత్తె
పాడలేని గులకరాళ్ళు
పాత వడ్డ సెలయేరు
మురికి బట్టలెన్నో మోసి
రజకునిచే రట్టు"

బూర్జువావర్గం సామ్రాజ్యవాద స్వభావంతో దేశాల్ని తమ మార్కెట్టుగా చేసుకోవటంకోసం ప్రతి దేశంలోను సరుకుల ఉత్పత్తికి సరుకుల వినియోగానికి జాతి అతీత స్వభావాన్ని కల్పిస్తాయి. ఈ ప్రయత్నంలో భాగంగా ఆ దేశపు పరిశ్రమల్ని నాశనం చేస్తాయి. అంతేకాకుండా ఆ దేశీయ ముడి పదార్థాల్ని కారు చౌకగా కొనుగోలుచేసి ఉత్పత్తయిన సరుకులను ఆ దేశీయులకే అతి ఖరీదుతో అమ్మచూపుతాయి. దాంతో 'జీవనమ్మే' దివాలాతీసే పరిస్థితి ఏర్పడింది.

ఇంగ్లాండు సామ్రాజ్యవాదం తమ దేశంలో ఏర్పడే ఆర్థిక సంక్షోభాన్ని తుడిచివేసుకొనే అన్వేషణలో ముడిపదార్థాల ఘనిగా భారతదేశాన్ని కనిపెట్టింది. అందువల్ల 'పాడలేని గులకరాళ్ళు పాతవడ్డ సెలయేరు' అని అనటంలో ప్రాచీన జీవన ప్రవంతిలో భాగమయిన శ్రమైక జీవన సౌందర్య గానం అంతరించిపోయిందని తెలియజేస్తాడు నారాయణబాబు.

"పురమంతా
రాతిరంతా
తిరగడం
కాగితాల భోజనం
పోయిన ఆ యేటి నవ్వు

పుక్కిట నెమరేసుకొంటూ
గండశిల నీడలోన
కను మోడ్చెను
గార్దభ స్వామి"

నిరాడంబరమైన జీవన విధానాన్ని అవలంభించడం, జాతి గత సంపదను నెమరువేసుకోవడం, ప్రజల్లో జాతి చైతన్యాన్ని కల్గించేందుకై నిద్రాహారాలు మరిచి ఊరంతా ప్రచారం చేయటం ఆనాటి కాంగ్రెసు ఉద్యమం చేస్తున్న కృషి. అయితే అసలు మూలతత్త్వాన్ని గుర్తించలేదు కాంగ్రెసు నాయకత్వం.

"బ్రహ్మజెముడు
కంచెమధ్య
పూర్ణిమ సంధ్యల్లోన
ఘడియైనా ఉదయాద్రిని
రుధిరజ్యోత్యై వెలిగే
జాబిల్లి !" ని దర్శించాడు కవి.

ఇంతలో హటాత్తుగా

మృతశరీర
ఆక్రమణ
ఘటాకాశ
అరుణారుణ
రక్తసిక్త
మోముతోడ

"మా అమ్మే చంపింది
మా అమ్మే చంపింద"ను
మౌనముగ
గాజుకళ్ళ ఫురిటి పిల్ల !

నెత్తుటి అరుపు వినిపించింది. అరుపుతో పాటు చనిపోయిన పురిటిపిల్ల కనిపించింది. స్త్రీ పట్ల ఊహాగానం మాత్రమే తెలిసిన కవికి మనస్సు చలించిపోయింది.

కార్మిక మహిళలు బూర్జువాల గుప్పిట్లో అనేక విధాలుగా నలుగుతున్నారు, అనుభవింప బడుతున్నారు. వారి రాక్షసత్వానికి ఫలితంగా తమకు పుట్టిన పిల్లలను బలిచేసుకోవటంకూడా జరుగుతుంది. మార్క్సు, ఏంగెల్సు కూడా ఈ విషయాన్ని స్పష్టంగా తమ కమ్యూనిస్టు ప్రణాళికలో నిరూపించారు. చూడండి "మన బూర్జువాలు బజారు వేశ్యలమాట అటుంచి, తమ చేతికింది కార్మికుల పెండ్లాలు, కూతుళ్ళూ తమ అభీష్టాను వర్తులయ్యేది చాలక, ఒకరి పెండ్లాల నొకరు చెరచడంలో అపారమైన ఆనందం పొందుతున్నారు."*

"భూమికంత ఈనాడే
గ్రామ దేవతోత్సవమ్మ
కాలజ్ఞానులు మీరు
కాచుకోండి కత్తి పదును
కాచుకోండి
కవిగారని
గాలికబురు
చెప్పింది" అంటూ ఖండికను ముగించాడు.

ఊహల్లో తేలిపోతున్న కవికి నూతన సామాజిక బాధ్యతను సూచించాడు. డా॥ ఉప్పల లక్ష్మణరావుగారు "భావకవిత్వంలోని ఆదర్శ వాదమునకు ఎదురుతిరిగి వాస్తవిక వాదమును ప్రతిపాదించిన కవి

* మార్క్సు, ఏంగెల్సు. కమ్యూనిస్టు ప్రణాళిక. పుట. 53, 54.

నారాయణబాబు"* అన్నారు. అంతేకాదు, వాస్తవిక వాదమును ప్రతిపాదించి అధివాస్తవిక వాదమును తెలుగు కవిత్వంలో ప్రతిష్ఠించినవాడు కూడా నారాయణబాబే.

నారాయణబాబు కవిత్వంలో కన్పించే అధివాస్తవిక స్వరూప స్వభావాలను, అధివాస్తవికతత్త్వాన్ని వివరించే నగ్న గీతాలను పరిశీలిద్దాం.

## నగ్న గీతాలు

కవిత్వాన్ని సృష్టించటం గాఢమైన అనుభూతితో కూడుకున్నది. దానికీ ప్రత్యేకమైన అర్థం, పరమార్థం (ధ్యేయం) ఉంది. ఈ విషయంలో పొరపాటు పడకూడదు. సర్రియలిస్టులు ఈ సమస్యను రెండురకాలుగా చూశారు. వీరు ఆనాటి చారిత్రక దశలో **Profacist Bourgoise** ని ఎదుర్కోటానికి సిద్ధాంతపరంగా ఎంతో పోరాడారు.

సర్రియలిస్టుల దృష్టిలో కళల ఉద్దేశ్యం కేవలం ప్రబోధం కానీ లేదా విప్లవ ప్రచారంకానీ కాదు. కానీ కళ, కళకోసమే అనే వాదంతో వీరికి పొత్తులేదు. సౌందర్యాన్ని సృష్టించడంలో క్రియాశీలతను కోల్పోయే కాల్పనికవాదం వీరికి బద్ధవ్యతిరేకం. దీనితో సర్రియలిస్టులు ఎప్పుడూ పోరాడుతూనే వున్నారు.

సర్రియలిస్టు కవిత్వానికి అన్ని కవిత్వాలకి వలెనే ప్రత్యేకమైన గొంతువుంది. అది కవి, కవిత్వంనుంచే ప్రత్యేకతను సాధించుకొంటుంది. దానికి నిర్దేశింపబడిన ఆలోచన ఉండదు.

---

* ఆధునికాంధ్ర సారస్వతము. పుట. 30.

ఒక కవిత రాసినప్పుడు దాని వెనుక ఖచ్చితమైన వ్యక్తీకరణ చేయాలనే కోరిక ఉంటుందనటానికి నిరూపణలేదు. మరో విధంగా చెప్పాలంటే కవితవెనుక తూచి బేరీజు వేసినట్టు ఆలోచన ముద్ర వుండదు. చేతనలోని ఆలోచనకు సంబంధంలేని అప్రయత్న లక్షణంగల వక్తీకరణ కవిత్వంలో ఉంటుంది. ముఖ్యంగా సర్రియలిస్టు కవిత్వాన్ని, ఈ విషయంలో ప్రశ్నించటానికి వీల్లేదు అనిపిస్తుంది.

"Surrealism is a means of re-uniting conscious and un-consious realms of experience so completely that the world of dream and Fantasy would be joined to the every day rational world in an absolute reality, a surreality".*

దీనికి ఆధారం సిగ్మండ్ ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం. చేతననుబట్టి మనకు తెలిసేది మనిషి మనస్తత్వంలోని అతిస్వల్పమైన భాగం మాత్రమే. మిగిలిన చాలా భాగం అచేతనలోనే ఉండిపోయి మనిషికి అంతుచిక్కకుండా పోతూంది. అచేతనా స్వరూపాన్ని పూర్తిగా అవగతం చేసుకొనేటప్పుడే మనిషియొక్క అంతరాంతరాలని అర్థంచేసుకోవడం జరుగుతుంది.

చేతన బాహ్యప్రపంచానికి సంబంధించింది. 'చేతన' లో ఉండేవి హేతువాదానికి సామాజిక కట్టుబాట్లకు సంబంధించిన భావాలు. వీటికి 'అచేతన' సంబంధంలేదు. అచేతనలో ఉండే కోర్కెలు హేతువాదానికి గానీ సామాజిక నీతులకుగానీ సంబంధించినవికావు. మనిషియొక్క ఆదిమకాలంనాటి వాంఛలన్నీ అందులో ప్రాణంపోసుకొంటాయి. కానీ వాటిని ప్రయత్నంగానో, అప్రయ

* Encyclopaedia of Britanica ix, Page - 693.

త్నంగానో అణచివేయటం జరుగుతూవుంటుంది. చేతనకు, అచేతనకు మధ్య జరిగే ఈ ఘర్షణ మానసిక రుగ్మత ఉన్నవ్యక్తుల విషయం లోనేకాదు, అందరిలోనూ ఉంటుంది. చేతనలోకి (బయటకి) రాకుండా, లోపలికి అణచివేయబడుతున్న భావాలేమిటో, ఆ భావాలు ఏర్పడడానికి గల కారణాలేమిటో శాస్త్రీయంగా అర్థం చేసుకొంటే వాటి ప్రభావాన్ని తగ్గించగలమని ఫ్రాయిడ్ అభి ప్రాయం. నిర్హేతుకమయిన (హేతువుకు అతీతమైన) అచేతన శక్తుల్ని మనం ఎంత ఎక్కువగా అర్థంచేసుకుంటే వాటిని అంతగా హేతు బద్ధం చేయటానికి, అదుపులో వుంచడానికి వీలవుతుందంటున్నారు శ్రీ కోడూరు శ్రీరామమూర్తి, చూడండి*.

ఫ్రాయిడ్ తన మనోవిశ్లేషణలో అచేతన లోతుల్ని పరిశీలిం చటమేకాక అచేతనా లోతులు లైంగిక పరమైనవిగా, ముఖ్యంగా వావి, వరస సంబంధంలేనివిగా గుర్తించాడు. ఇది సర్రియలిస్టుల దృక్పథంలో ఎలా భాగమో నారాయణబాబు కవిత్వంలోనూ అంతే భాగమయ్యింది. కానీ పఠాభిలోలాగా ప్రధానమైన వస్తు వుగా మారలేదు.

'లెండోయ్ ఋషులు' అనే గేయంలో సెక్స్ ప్రాధా న్యాన్ని, సహజత్వాన్ని తెలియజేస్తాడు. మానవుని అన్ని కాంక్ష లకు లిబిడో (Libido) మూలకారణం అన్న ఫ్రాయిడ్ సిద్ధాంత ప్రభావంతో ఏర్పరచుకున్న అన్ని వస్తువుల వెనుకవున్న సెక్స్ భావాన్ని సూచించడానికి ప్రయత్నిస్తాడు. అందుకే సెక్స్ ప్రేరణలోని సజీవత్వాన్ని తెలియజేస్తూ సెక్స్ ప్రేరణకు దూరమై కుళ్ళిపోకుండా ఉండేలా గట్టిగా ఉద్బోధిస్తాడు.

---

తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ, పుట. 21, 22, 23 .

కనురెప్పల
సెజ్జమీద
కళ్ళజోడు
ముక్కుతోడ
వ్యభిచరించె

నట్టింట్లో
చిల్లుపడిన
మజ్జిగకుండ
కవ్వం
చీకటితప్పే
చేశాయి !

విరులంటేనే
విశ్వస్తల
పడకగదిలో
కంచెంబులో
ఉద్ధరిణి
కమ్మలు కేళిదేలె !

కుళ్ళిపోయిన
కూరగాయలు
కునికిపాట్లు
పడుతుంటే
టమాటపండు
మాంసంముక్క
కలసి
అఖండ సంధ్యారాజ్యం
చేస్తున్నాయి !          - లెండోయ్ ఋషులు

మనిషి అంతరంగంలో హేతువాదానికీ నైతికతకూ సంఘర్షణ ఎదురవుతూ ఉంటుంది. ఫ్రాయిడ్ సైకో ఎనాలసిస్ ప్రకారం ప్రతి మానవునికీ అంతరంగంలో ఈ సంఘర్షణకు 'సూపర్ ఇగో' (Super Ego) మూలకారణం. ఆదిమకాల భావాలకు చెంది జంతు ప్రవృత్తిచోటుచేసుకున్న Id, లైంగిక సంబంధమైన అన్ని కట్టుబాట్ల అధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ 'సూపర్ ఇగో'మీద తిరుగుబాటుగా లేస్తూ ఉంటుంది. 'ఇగో' (Ego) ఎప్పటికప్పుడు 'సూపర్ ఇగో' (Super Ego) ద్వారా అణుస్తూ ఉంటుంది.

మానవుడు అంతరంగంలో 'సూపర్ ఇగో' (Super Ego) చేతుల్లో తన 'Id' బలికావడం చూస్తూ ఉండిపోలేదు. దాని ప్రాధాన్యాన్నీ, బలీయమైనదాని శక్తినీ మరచిపోలేదు. 'గేదెపెయ్య'లో ఈ సత్యం ద్యోతకమవుతుంది.

"కుక్షింభరత్వం నీది
దక్షయజ్ఞం నా బతుకు
రాక్షసివై సుఖపడు
యక్షుడనై విలపించెద నేను.
నీ సజీవ అంభారవమునకే
చెవులు మూసుకొని
నా నిర్జీవపు గీతాలను
వినేందుకు సభ చేసిన లోకం
సెభాస్ !!! — గేదెపెయ్య

నారాయణబాబు గేదెద్వారా Id యొక్క సజీవత్వాన్ని కవిత్వంలో వస్తువును చేశాడు. ఇది భావకవిత్వంలోగానీ అభ్యుదయ కవిత్వంలోగానీ వస్తువుగా స్వీకరింపబడలేదు. అట్టి వస్తువు లోకంతీరుకు దగ్గరగా ఉండలేదు. ఎన్ని ముసుగుల్ని వేసి అంత

రాంతరాల్ని ఎంత వుపాయంగా ఉన్నతంగా అణచగలిగితే అంతగా చప్పట్లుకొట్టి మెచ్చుకొంటుంది లోకం. జీవితంలో ఇదే ధ్యేయంగా మారిపోయింది. అందుకే నారాయణబాబు దీన్ని ఎద్దేవాచేస్తూ లోకాన్ని 'సెభాస్' అన్నాడు.

సి. నారాయణరెడ్డిగారు అధివాస్తవికుల కవిత్వాన్ని పరిశీలిస్తూ శ్రీశ్రీ అధివాస్తవిక కవిత్వంతోపాటు నారాయణబాబు కవిత్వంలోని మౌనశంఖం, లెండ్లోయ్ బుష్షులు, భావం, చిన్నా, నీవెవరే, గేదెపెయ్యవంటి గీతాల్లో కామోద్రేక ప్రకటన, జుగుప్సా ప్రియత్వం, తీవ్రభావ ప్రకటన ఉందని విమర్శించారు, చూడండి[1]. అయితే వెల్చేరు నారాయణరావుగారు దిగంబర కవుల అశ్లీలాలకు సమాధానంగా ఇచ్చిన వాక్యాలు ఖచ్చితంగా ఈ సందర్భంలో సి. నా. రె గారి వాక్యాలకు జవాబుగా ఉంటాయి.

"అశ్లీలమన్నది ఇదీ అని చెప్పడానికి అవకాశంలేదు. ప్రతి సందర్భమూ వేరువేరుగా పరిశీలించి అశ్లీలత ఉన్నదా లేదా అని నిర్ణయించవలసినదే. లోకంలో అశ్లీలార్థం వున్న పదం సాహిత్యంలో అశ్లీలమయి తీరుతుందని చెప్పలేము. లోకంలో అశ్లీలార్థం లేని పదాలతో అశ్లీలార్థం సాహిత్యంలో కలిగించలేమని చెప్పలేము. అసభ్యార్థం ప్రకరణాన్నిబట్టి చెప్పవలసిందే కాని లైంగిక ప్రసక్తి ఉన్నంతమాత్రాన అశ్లీలం అని నిర్ణయించటానికి వీలు లేదు. అశ్లీలాన్ని అలంకారికులు నిర్వచించకపోవడానికి అది అనిత్య దోషంగా పరిగణించడానికి కారణం ఇది".[2]

---

1. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు. పుట. 587.

2. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. పుట. 205.

నారాయణబాబు మార్క్సునేకాదు ఫ్రాయిడ్ నుకూడా తన గురువని చెప్పుకున్నాడు, చూడండి*. నారాయణబాబు సర్రియలిస్టు కవిత్వం ఆకాశవిహాయసంనుంచీ, ఎయిర్ కండిషన్ అంతస్థుల్లోంచీ, సుఖాల అజీర్తినుంచీ పలాయనత్వంలోకి ప్రవహించే చాపల్యంకాదు. దానికి ఆకలిదారిద్ర్యం తెలుసు. అందుకే ఆకాట్లనుంచీ బాహ్యంగా కాకపోయినా ఆంతరికంగా ఏర్పడే మచ్చల్ని పోగొట్టుకోవాలనే తపన వస్తువుగా మారుతుంది. 'భావం' గీతాన్ని చదువుతున్నప్పుడు ఆంద్రే బ్రేతో సర్రియలిజాన్ని కవిత్వంలోకి ఆవిష్కరించబోయే ముందు సన్నివేశం తళుక్కున మెరుస్తుంది.

దరిద్రంతో
తాపత్రయాలతో
వెంటాడిన వెర్రికుక్క
దినానికి
తిలోదకాలు.

హాయిగా అర్ధరాత్రి
తడిమినా
తెలియని
తాండ్రపాపారాయుని
తమస్సు !

దారిద్ర్యం, తాపత్రయాలలాగే చీకటి బలంగా, దట్టంగా వింటూ కదలనీకుండా, అర్థంకాకుండా జీవితాన్ని అంధకార బంధురంచేసింది. బుద్ధిపదును, హృదయం ఈ రెంటి సమ్మేళనంలో వ్యక్తా వ్యక్త పరిశీలనలో ధ్యాన పరిపక్వంతో intutiveness లేదా 'ప్రజ్ఞ' ఏర్పడుతుంది. అదే దారిద్ర్యానికీ, కవిత్వానికీ, జీవితానికి

* ప్రవర : 'సంఘర్షణ' – కావ్యపీఠిక, 'రూధిరజ్యోతి', చూడండి.

అన్ని తాపత్రయాలలో వెలుగుచూపే మార్గాన్ని నిర్దేశిస్తుందని నారాయణబాబు ఉద్దేశ్యం.

బుద్ధీ హృదయం
ధ్యాన బద్ధులై
నిమీలిత నేత్రాలతో
నిద్రిస్తే
వ్యక్తా వ్యక్తం లోంచి
వెలుగుబాట
చూపించే
నీవెవరే !

ఇదీ నారాయణబాబు కవిత్వంలోని ప్రశ్న. నారాయణబాబు కవితా సాధనకూ, జీవిత పరిష్కారానికీ, అనేక అడ్డంకులకు ఆనాడు వేసుకున్న ప్రశ్న.

ఈ నాటికీ ప్రపంచం ఇంకా మార్పు చెందలేదు. మనిషికి అనుక్షణం తాపత్రయాలు, దారిద్ర్యం వెంటాడటం మానలేదు. ప్రపంచవ్యాప్తంగా (భారతదేశంలో, ఆంధ్రదేశంలో అంత బలంగా కాకపోవచ్చు) పారిశ్రామికీకరణ మహోన్నత స్థితికి చేరుకొంది. మనిషి ఊహించలేనంత సంక్లిష్టతలకు, సందేహాలకు మానవ నాగరికత, సంస్కృతీ ప్రక్కదారి పడుతోంది. మనిషి ఏకాకితనంలోకి జారిపోతున్నాడు. స్వర్గపు ఆశలు చూపిన దేశాలు, దేశాల్లోకే ఇంకి పోతున్నాయి. ఈ స్థితిలో మనిషి ఒక పిడికెడు మానవత్వాన్ని అందుకోలేనంత ఒంటరితనంలోకి జారిపోతున్నప్పుడు, ఎంతబలమైన సిద్ధాంతమైనా మొద్దుబారి గాల్లోనే తేలిపోతున్నప్పుడు ఏ సాహిత్యంలో నయినా తిరిగివేసుకోవాల్సిన ప్రశ్న ఇదే.

# చల్లని గీతి

హేతుబద్ధమైన చదువులవలన మానవుడు బాల్యదశలో అనుభవించిన అనుభూతులు బండబారి పోతాయి. ఆ అనుభూతులు వ్యక్తావ్యక్తాన్ని ఆశ్రయించినప్పుడు తిరిగి రూపుదిద్దుకుంటాయని సర్రియలిస్టు ఉద్యమం భావించింది. అందుకు వ్యక్తా వ్యక్తాన్ని విశృంఖల పరచటమే సర్రియలస్టుల ధ్యేయం. అయితే నారాయణ బాబులో ఇది ప్రత్యేక ధోరణిని సంతరించుకున్నదని చెప్పాల్సి ఉంటుంది.

బహుశా నారాయణబాబులో ఎంత ప్రతిభావిశేష మున్నా సర్రియలిజాన్ని యథాతథంగా అన్వయించుకొని కవిత్వానికి ధ్యేయంగా మార్చుకోలేక పోయాడనిపిస్తుంది. నారాయణబాబు యథాతథంగా ఆ తత్వాన్ని అనుసరించని కారణంగా ఇది ఇతరులకు వ్యక్తిత్వ ప్రతిభా విశేషలోపంగా తోచింది. నారాయణ బాబుకు సర్రియలిజం యొక్క గుణం, లక్షణం సరిగా పట్టనట్టు భావించేంతవరకూ వెళ్ళింది.

పాశ్చాత్య సర్రియలిజం, స్వదేశీయ ఆధ్యాత్మికత రెండూ కలిసిన నూతన విధానం నారాయణబాబు గీతాల్లో కన్పిస్తుంది. తత్వమసి, మానశంఖం, అగ్నివీణ, నీవెవరే, కావాలి ఖండికలలో ఆయన కవిత్వాన్ని ఆధారంగా భావించిన వ్యక్తావ్యక్తం, పాశ్చాత్యులు భావించిన మేరకు ఒదిగినా ఆయన అక్కడనుంచీ వాస్తవ శక్తిని భావించిన తీరులోమాత్రం పెద్ద తేడా ఉంది. అది పాశ్చాత్య సర్రియలిస్టులు భావించిన సమస్యలయొక్క ఒత్తిడి స్వరూపం సడలించే సరికొత్త కాలపరిధి కాదు, విస్తృత కాలపరిధి కాదు. అది అంతకంటే లోతైనది. అంతకంటే విస్తృతమైన ఆద్యంతాలు లేని

అనంతంలోకి, కాలాతీతంలోకి ఎదురుచూసే లేదా కాలాతీత శక్తిని ఆహ్వానించే ప్రయత్నంలా తోస్తుంది. అక్కడనుంచే ఆయన అభ్యుదయ శక్తినికూడా దర్శించాడా అనికూడా అనిపిస్తుంది.

స్వదేశీయ ఆధ్యాత్మిక సంస్కృతి తెలిసిన వారికే సంప్రదాయాల మూలార్థాలు తెలుస్తాయి. నారాయణబాబు సంప్రదాయాలను ఆధునికార్థంలో ఆధునిక భావానికి అంత సులువుగా, అమోఘంగా ఉపయోగించుకొన్నాడంటే ఇదే కారణం. "అతినవ్యులలో నారాయణబాబు సంప్రదాయాలను, ప్రాచీన కవితాసంప్రదాయాలను క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొని తిరుగుబాటు చేసిన కవి".*

నారాయణబాబులో ఆధ్యాత్మిక సక్రియలిజాన్ని అర్థంచేసుకోడానికి 'అగ్నివీణ'ను పరిశీలించవచ్చు. 'జ్ఞానం' లేదా 'ప్రజ్ఞ' అనే అగ్నితో కూడుకున్న సంప్రదాయార్థంలోని 'వీణే' ఈ 'అగ్నివీణ'గా తోస్తుంది. (మామూలు వీణగా కూడా చెప్పుకోవచ్చు).

శబ్దార్థం
వాంఛించే
ఛాందసులం
అర్థమనర్థమని
అనుభవమే
నగ్నంగా
ఆలాపన చేస్తానంటే
మూగవాని నాల్కంటాం

---

* నారాయణరెడ్డి, సి ; ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు. పుట 630.

ఏం

ఏమంటావు

గాలికి గలగల

మోగే పండుటాకు !

ఇందులో పండుటాకును సంబోధించటంలో కృష్ణశాస్త్రి కవి ఉద్దేశ్యంలో ఉన్నాడని 'రుధిరజ్యోతిర్దర్శనం' లోని అవంత్స సోమసుందర్ గారి అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకోక పోయినా భావార్థం చెడకుండా అర్థాన్వయం కుదురుతుంది.

శబ్దార్థాలు ఆధ్యాత్మిక దృష్టినుంచి చాల అల్పమైన శక్తి గలిగినవి. నీతి అవినీతి, న్యాయం అన్యాయం, మంచీ చెడ్డా, ఔచిత్యం అనౌచిత్యం మొదలైన వాటి విచారిణతో, తర్కంతో కార్యకారణ సంబంధంతో, విశ్లేషణతో హృదయం గడుసుబారి పోతుంది. బాల్యదశలో ప్రయత్నం అర్థం కలిసిన అనుభవస్థాయి క్రమక్రమంగా నశించి శబ్దానికి అనుభవానికి మధ్య అగాధంఏర్పడి అర్థమనే కృతకమైన మరోకొత్తస్థాయి సృష్టి కాబడుతుంది. అంతే కాకుండా మనిషి పెరిగేకొద్దీ వాటిమధ్య భేదంకూడా పెరుగుతుంది. ఈ క్రింది వాక్యాలు చూడండి.

"First no Language, or more strictly speaking, only simple rudimentary Sounds - Artha and Pratyaya merge in to one, there being no discrimination ... ...

* Sir John Wood Roffe : 'Sabda As Language' The Garland of Letters, Page – 67.

సర్ జాన్ ఉడ్‌రూఫ్‌గారి పై వివరణ ఇదే విషయాన్ని స్పష్టం చేస్తోంది. ఇంకావారు కిందివిధంగా విపులీకరించారు. గమనించండి.

Thus Judging, inferring
Classifying etc.







Some intuituve Proceses.

The conclusion there fore is :

1. The Turiya state is undifferentiated. Hence in it there is no Artha, Sabda, Pratyaya A, S and P Severally Vanish.

2. The Susupti State (Samasti or Vyasti) is temporarily equiblirated Consciosness in which there are A, S and P, but there resultant is ineffetuael".*

— Sir John Wood Roffe.

* The Garland of Letters, Paga – 69.

నారాయణబాబు ఈ శబ్దార్థాలలోని అంతరాల్ని తుడిచే స్థితికై ప్రయత్నిస్తాడు. శబ్దార్థాలమీద వున్న మూర్ఖత్వాన్ని వదిలించుకొని కాలాతీత స్థితిని ఏవిధమైన ఆచ్ఛాదనలు లేకుండా ఆలాపన చేస్తాడు. అది ఎవరికీ వినిపించదు. అందువల్ల మూగవాని నాల్క అనిపిస్తుంది.

పండుటాకు జీవితంలో చరమావస్థకు చేరుకొంది. అది జీవితాల్లోని ఆనందాన్ని ఒకనాడు ఆలాపన చేసింది. ఈనాడు మృత్యు ఊయలమీద ఊగుతూ తిరిగి గలగలమని యధావిధిగా ఆలాపన చేస్తోంది. దేహంగింజుకుంటున్నా రాలిపోయే క్షణాన్ని కళ్ళకద్దుకొంటూంది. ఈ భావానికి చాలాదగ్గరగా ఉన్నజిడ్డు క్రిష్టమూర్తి గారి వాక్యాలు చూడండి.

"Take a leaf in the spring - how delicate it is and yet it has extra - ordinary strength to stand the wind. In summer it matures and in autumn it turns yellow and then it dies, there is never any sense of ugliness, never a withering away in mid summer, It is a perpetual movement from beauty to beauty. There is fullness in the spring leaf as well as in the dying leaf. Why can not man live and die that way".*

అందుకే ఎంతో ఆత్మీయంగా బుజ్జగింపుగా 'ఏం? ఏమంటావు?' అని పండుటాకును దబాయించాడు.

జీవితమంతా మంచీ చెడ్డా, నీతీ అవినీతీ, బ్రతుకూ చావూ, కార్యం కారణం, క్రమమూ అక్రమమూ, భయమూ నిర్భయమూ, సుఖమూ దుఖమూ ఈ ద్వంద్వాలవలన నిరంతరం మనసు చావుదెబ్బతో గడుపుతూ వుంటుంది. పలాయనత్వం పనికి

Tradition and Revolution, Page – 40, 41.

రాదు. దీనికి తట్టుకొని నిలబడగలిగినప్పుడే అర్థం దొరుకుతుంది. వీటికి అతీతంగా సాగినప్పుడే మృత్యువులోని వెలుగు ద్యోతకమవుతుంది.

ఇక ముసలితనానికీ, చావుకూ ఎందుకు భయపడాలి ? దీనల్లా దిక్కుల్ని ఎందుకు చూడాలి. అందుకే

"బ్రతుకంటే
చీకటిలో
దీర్ఘమయిన చావు !
చచ్చి బ్రతుకు
మృత్యువులో
వెలుగున్నది
మూర్ఛన చేయర వీణ!" అని 'ప్రజ్ఞ'ను లేదా 'జ్ఞానాన్ని' ప్రయోగించమని సూచిస్తాడు.

ఈ గీతంలో నారాయణబాబు మృత్యు భయాన్ని జయించే మార్గాన్ని చూచాయిగా సూచిస్తాడు. దీనికి అవసరమైన సజ్ఞానుభవాన్ని గుర్తింప జేశాడు.

"మూగనై నిలుచున్నా
దగ్గరగా ఒక మౌనశంఖంతోచింది
మౌనశంఖం స్పృశించా
నాగుండె అంతా హంసమై
'సోహం' అని అరచింది

రవం నీరవానికి 'Diminutive'

— మౌనశంఖం.

"నా వెనుకనే
శివధనస్సులా విరిస్తే
కూడలిలో అవ్యక్తం
జగమంతా నిండితే
సముద్రమే సంజీవ పర్వతమయింది !

అయితే ఎప్పుడు
తెల్లబడతావన్నా
ఎప్పుడూ ఈ విశ్వమానవ
సహస్రారం అర్పిస్తే
అప్పుడు అంది — 'తత్త్వమసి'

పై గీతాల్లోని వాక్యాలు ఆయనలోని స్వదేశీయ ఆధ్యాత్మిక కాలాన్ని సూచిస్తాయి. కానీ పాశ్చాత్యులు సూచించిన కాల పరిమితమయిన వ్యక్తావ్యక్తం మాత్రమే కాదని తోస్తుంది. ఇది ఇంకా ఎంతో వివరంగా లోతుగా పరిశీలించాల్సిన విషయం.

దీన్నిబట్టి నారాయణబాబు తెలుగు కవిత్వంలో మామూలు అధివాస్తవిక కవి మాత్రమే కాదు. ఆయన నిజంగా అధివాస్తవిక విప్లవ ఋషి.

## మౌనశంఖం

అధివాస్తవికతను లక్ష్యరూపంగా శ్రీశ్రీ ప్రచారం చేస్తే లక్షణరూపంగా ఎంతో గట్టి పునాదికి తోడ్పడిన ప్రముఖుల్లో మెచ్చుకోదగినవాడు నారాయణబాబు.*

---

* నారాయణరెడ్డి, సి : ఆధునికాంధ్ర కవిత్వము ; సంప్రదాయములు, ప్రయోగములు. పుట 385.

అధివాస్తవిక గీతాల్లో చాల ప్రసిద్ధిచెందిన గీతం 'మౌన శంఖం'. అధివాస్తవిక లక్షణాల్ని పుణికి పుచ్చుకొన్న అచ్చమైన అధివాస్తవిక గీతం. స్వదేశీయ తాత్త్వికతతో అధివాస్తవికతను ఇంకా లోతుకు తీసుకెళ్లిన గీతం.

బాహ్యాంతరాల చేతనావస్థల్ని పునఃసంధానపరిచే విధానమే స్రియలిజం. బాహ్య ప్రపంచంలోని సంఘటనలు, సామాజిక విలువలతో వాటిపట్ల ఏర్పడిన అనుభూతులు – వ్యక్తి అంతరాంత రాలలో బాహ్య సంఘటనలపట్ల, లోకవిధానంపట్ల వున్న అసలైన అనుభూతులు, తీవ్రతలు కలగలిపి సరికొత్తరూపంలో సరికొత్త క్రమంలో అందుకొనే (వ్యక్తీకరణ) ప్రయత్నమే అధివాస్తవికత. నారాయణబాబు అధివాస్తవిక రచనా సాఫల్యానికి నిదర్శనంగా 'మౌనశంఖా'న్ని పరిశీలించవచ్చు.

కాడ్ లివరాయిల్లో 'డీ' విటమినుంటుంది
కోడిగుడ్లు ధాతుపుష్టి
కాకాతువ్వ తెలుపు; కోయిల నలుపు
ఆకాశం పొడవు; భూమి వెడల్పు
ఆకాశం ప్రవాళాధరం
అందుకొనే కదా !

కాడ్ లివరాయిల్లో 'డీ' విటమినుంటుంది. కోడిగుడ్లు ధాతుపుష్టి. ఇవి ఆయా వస్తువుల సహజ గుణాలు. కాకాతువ్వ ఒక విధమయిన ఎగిరే తెల్లటి పక్షి. కోయిల నల్లటి పక్షి. ఈ రంగులు విరుద్ధమైనవి. అయినా సహజమైనవి. ఆకాశాన్ని విశాలంగా, ఎత్తుగా భావిస్తాం. కనుక పొడవుగా తోస్తుంది. ఆకాశం కిందనుంచి పొట్టిగా అతుక్కుపోయినట్టు అగుపిస్తుంది. కనుక వెడ

ల్పుగా అనిపిస్తుంది. పోతే సంధ్యాకాశానికి, స్త్రీ స్ఫురణవలన, అధరం గుర్తుకొస్తే ప్రవాళాధరంగా మారుతుంది. దాన్ని అందు కోవాలనిపించినా సాధ్యం కాదని తెలియుటంతో 'అందుకొస్తే కదా !' అనే ఆలోచనా సరళితో భావం తెగిపోతుంది.

ఇలా సాగిన స్పందనల వెనుక కవియొక్క తపన, ఉద్దేశ్యం, తీవ్రత, నూతన భావాల దృష్టి కనిపిస్తుంది. అయితే అది అర్థం లేనిది కాదు. ఆ అర్థం మనమనుకునే భావనను అనుసరించికాకుండా ఉద్దేశ్య తీవ్రతను, ఉద్దేశ్యంయొక్క అనుకంపనాల్ని బట్టి ఉంటుంది. అనుకంపనాలకు అనుబంధంగా గాఢమైన, పురాణగతమయిన, సమాజగతమైన చారిత్రాత్మకమైన అనేక విషయ సంబంధంగా పదంయొక్క అర్థం వుంటుంది.

"(...Surrealists) They also tried to rediscover the multi-dimensional qualities of words".*

మానశంఖంలోని తొలి చరణాలు అర్థంలేనివిగా కనిపించినా, క్రమంలేనివిగా అన్పించినా వాటికీ అర్థమూ, క్రమమూ వుంది. గీతంయొక్క మొత్తం స్వభావంనుంచి మాత్రమే అర్థాన్ని స్వీకరించాలి.

కవిలో 'నేను ఎవరు ?' అనే తాత్త్విక అన్వేషణ వుంది. ఏఏ భౌతిక సంబంధాలు, ఏఏ సంక్లిష్ట సమస్యలు 'నేను' అనే సహజ స్థితినుంచి వేరుచేస్తున్నాయో సింహావలోకనం చేయుటం ఇందులో గమనించ దగినది. 'నేను' కు సంబంధించి కవికి ఎంతో ప్రత్యేకమయిన ఆసక్తి, దాంతో తాదాత్మ్యం చెంది పోవాలన్న గాఢమైన శ్రద్ధవుంది. 'నేను' యొక్క తత్త్వాన్ని పిచ్చిపిచ్చిగా, అసంబద్ధంగా కనిపించే ఆ పాదాల వెనక పసిగట్టవచ్చు.

* Encyclopaedia of Americana. Volume 26, Page - 69.

సర్రియలిస్టు కవిత్వంలోని మొత్తం భాగం నుంచి ఒక భాగాన్ని విడదీసి చూడటం సర్రియలిస్టు కవిత్వ సంప్రదాయానికి విరుద్ధమైనది. అట్లే వ్యవహార భాషతో సర్రియలిస్టు భాషను, సర్రియలిస్టు భాషతో వ్యవహార భాషను కొలవటానికి సమానమైన కొలబద్ద లేదు.

కాడ్ లివరాయిల్లో 'డి' విటమిన్ సారవంతమైన గుణం గల వస్తువుకు సూచన. 'కోడిగ్రుడ్లు ధాతుపుష్టి,' బలవర్ధకమైన వస్తుగుణానికి సంకేతం. 'కాకాతువ్వ తెలుపు, కోయిల నలుపు'- వెలుగునీడల ప్ర [illegible] మధ్య అతీతమైన స్వేచ్ఛా [illegible]వాన్ని సూచించటమే.' ఆకాశం పొడవు, భూమి వెడల్పు, అనటం ద్వారా కొలతల మధ్యవున్న కళ్ళకు (ఇంద్రియాలకు) పొదగని విస్తృతిని తెలియజేయటమే. 'ఆకాశం ప్రవాళాధరం' అనంత నిశ్శబ్దాన్ని, అనాది నిశ్శబ్దాన్ని గుర్తుచేస్తుంది.

ఇంతటి అద్వితీయమైన స్థితి ప్రపంచంలో ఉందని తెలిసిన తరువాత దాన్ని తన నిత్య జీవితంలో స్ఫురణకు తేకుండా ఉండ లేక పోయాడు నారాయణబాబు. ఎటుచూసినా అదే ధ్యాస వెంటాడుతూ మనసును బాధ పెడుతోంది.

నేను పడుకుంటే
శరీరమంతా మెలికలు మెలికలై
'ఎవరు నీవు' అని అడుగుతుంది.
భూమంతా
మరకత పసిరకయై కాలుగీకి
నీ వెవరు ? అని అడుగుతుంది

గాలి భుజం తట్టి నీవెవరంటుంది
పొద్దున, సాయంత్రం
ఆకాశం పలక మీద
ప్రకృతే వేస్తుంది
బ్రహ్మాండమైన
రెండు ప్రశ్నార్థకపు గుర్తులు
నీ వెవరు ? నీ వెవరని
? ?

నారాయణబాబు ఒత్తిడినుంచి మనసును తేలిక పరిచేందుకు నిద్రపోవాలనుకున్నాడు. అయినా ఒత్తిడి చల్లారక దేహాన్ని మెలికలు తిప్పింది. ఇంతవరకూ మహోన్నతమైన స్థితిని ఆశిస్తూ ఎంత తపన చెందినా అది కలగకపోనూ దిగులు మిగిలి పోయింది. ఇక దిగులును, ఒత్తిడిని సడలించుకొనే సాధనలో అతడు కొత్తదారిని తొక్కాడు. ప్రపంచంలో తను ఎక్కడో బందీమై సహజత్వానికి, స్వేచ్ఛకు మూలమయిన 'నేను'కు దూర మయ్యాననే విచారణలో పడ్డాడు. ప్రకృతిలోని గాలి, భూమి సైతం ప్రోత్సాహకరంగా, అనుభూతితో విచారణలోకి లాగు తోంది.

నారాయణబాబులో రెండు ప్రశ్నలు మిగిలిపోయాయి. అతడి చుట్టూ సమాజం ఉంది. అజ్ఞానపు సంబంధాల్లోంచి ఏర్పడింది. అతడిలో 'నేను' (అహం) ఉంది. అన్ని అసంతృప్తు లకూ, బంధాలకూ, విషవలయాలకు ఇదే కారణం. ఈ 'నేను'ను (అహంను) అర్థం చేసుకొని 'నేను' తెలుసుకోవటమూ లేక అన్ని బంధాలతో కూరుకుపోయిన బందీగా మిగిలిపోవటమూ అన్నది ఆలోచించాడు. అయితే నారాయణబాబు ఒక సత్యాన్ని

స్పష్టంగా గుర్తించాడు. సామాజిక సంబంధాల మధ్య వ్యక్తి సమాజంయొక్క ప్రతిస్పందనల్ని స్వేచ్ఛను, పొందలేమని తెలుసుకొన్నాడు. అందుకే తన గతంలోని సామాజిక సంబంధాల్నీ, వాటి ప్రతిస్పందనల్ని పరిశీలనలోకి తెచ్చుకున్నాడు.

నీలగిరిలో పురుడు పోసుకొని
దాహం దాహం అంటూ మరణించిన
చూలాలి వక్షంలో గడ్డ కట్టిన
చనుబాల జిడ్డును
తాగి చనిపోయిన ఒక పుండా కోరుని
డాక్టరు శవ పరీక్ష చేసినప్పుడు
అతని కడుపులో అరగకుండా
పైకి ఒలికిన సారా చుక్కను !
చూలాలై మృత శిశువుని కని
గుండెలో పాలే
పాము కాటులా బాధ పెడి
ఒక ఇల్లాలు
ఒక చీకటి రాత్రిలో వీధి కాలువలో
కురిపించిన పాల వానను

కవి భావానికి పాఠకుని మనస్సులో రూపాన్ని ఇవ్వగలిగిన శక్తిపై అధివాస్తవిక కవిత్వపు విలువ ఆధారపడి వుంటుంది. అది కార్య కారణ సంబంధం, బుద్ధిగతమైన క్రమబద్ధతా ప్రాతినిధ్యం పై ఆధారపడి వుండదు. అధివాస్తవిక కవిత్వానికి అర్థాన్ని ఇవ్వటంకాదు, రసాన్ని ఇవ్వటం ముఖ్యం – అన్న సర్రియలిస్టుల వాక్యాల్ని విచక్షణతో అర్థం చేసుకోవాలి. పై పాదాల్లో భావ పరిణామం రూపంలో గమనించవచ్చు.

బాధలకు బంధాలకు కారణాలు వెతక్కుండాయ, వాటి యథార్థాల్ని పరిశీలించకుండా, వాటి నుంచి దూరంగా సత్యాన్ని వూహిస్తూ, తపిస్తూ గడిపిన క్షణాల నుంచీ మేలుకొని తను ఏర్పర్చుకొన్న జీవిత విధానాన్ని గమనించాడు.

నీలగిరిలో పురుడు పోసుకొని దాహం దాహం అంటూ మరణించిన చూలాలి వక్షంలా తను అగర్భ శ్రీమంతుడిగా జన్మించినా కనీసమైన అవసరాలకు సహితం దూరమై దారిద్ర్యాన్ని భరించాల్సి వచ్చింది. కన్న కలలు గడ్డకట్టి నిరుపయోగంగా మారాయి. తాగి చనిపోయినవాడి శవపరీక్ష జరిగినప్పుడు అరక్కుండా బయటికి వచ్చిన సారా చుక్కలా సుఖాన్వేషణలో లాలసత్వానికి లోనయి జీవితం పాడయినా ఇంకా తీరని ఆకాంక్ష మినుకు మినుకు మంటోంది. చూలాలయి మృత శిశువును కని గుండెల్లో పొంగేపాలు బాధతో కాలువలోకి కురిపించినట్టు – భవిష్యత్తు తన పురిటిలోనే దెబ్బతినిపోగా బాధపెడుతున్న ఆశల్ని భరించలేక వాటిని నెట్టివేశాడు.

"సభ్యలోకం దేనిని చెప్పుటకు వెనుదీయునో ఆ విషయమును దారుణంగా చెప్పుటకు ఈ చరణములలో కవి ప్రయత్నించాడు"* అన్నారు నారాయణరెడ్డిగారు. కానీ అది నిజంకాదు. అందులో కవి తన వాస్తవ జీవితాన్ని సూచించాడు తప్ప దారుణంగా చెప్పటమే అతడి ఉద్దేశ్యం కాదు. దారుణం వుంటే వుండవచ్చు.

సర్రియలిస్టుల ప్రకారం జీవితంలోని ద్వంద్వాలను ఒకచోట చేర్చి జీవితంపట్ల సమదృష్టి కల్గించటమే వారు కోరుకున్నది. ఆ దృక్పథాన్ని భిన్న రూపాల్లో ఈ గీతంలో గమనించవచ్చు.

---

* ఆధునికాంధ్ర కవిత్వము; సంప్రదాయములు, ప్రయోగములు పుట 581

ఇంతకూ ఎవరం తెసం
రుక్మిణీ కళ్యాణ తపస్సులో
కుటుంబ చింతలో కలిశాం
నీవూ నేనూ
కత్తిపీట మీద కలిసిన
అరటి పండు! అరిసెలాగ!
ఎన్నిమార్లు నీవు లెక్క పెట్టినా
నన్ను మరచినా నీవు
ఉన్నవాళ్ళం ఇద్దరం
నీటి కన్నా రక్తం చిక్కన
కవులమైనా అన్నదమ్ములమైనా
శ్రీశ్రీ నేనూ

నారాయణబాబు తనకు ఏర్పడిన దుస్థితినుంచీ బయటపడి, సామాజిక చైతన్యంతో ఏకమవ్వాలని ప్రయత్నించాడు. వ్యక్తిగతమైన పరిధి నుంచి సామాజిక పరిధికి విస్తరించాక తనేమిటి అన్న ప్రశ్నే చప్పగా తోచింది. రుక్మిణీనాథశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావు, శ్రీశ్రీ, తనూ ఓ నూతన వ్యవస్థ నిర్మాణానికై ఓ వేదికగా కలిశారు. శ్రీశ్రీ అభ్యుదయ కవులలో అతి ముఖ్యమైన వ్యక్తిగా తనను లెక్కించటం మరిచినా (తెలిసి కానీ, తెలియక కానీ) పదునైన వాస్తవాలతో కలిసి నిలవగలిగిన వాళ్ళు ఎన్ని విధాలుగా ఆలోచించినా తనూ శ్రీశ్రీయే మిగులుతారు. కవులుగానైనా, అన్నదమ్ములుగానైనా, శత్రువులుగానైనా ఆ రోజుల్లోనే నారాయణబాబు ఆ వాస్తవాన్ని అంగీకరించాడు.

అప్పట్లోనే శ్రీశ్రీకి నారాయణబాబు మీద వున్న చిన్న చూపుకి, నారాయణబాబు నిశిత దృష్టికి ఈ పాదాలే తార్కాణం

సిరాబుడ్డిలో కలం ముంచితే
సిరాకు బదులు పాళికి తగిలింది
ఒక సాలె పట్టు
దాని మధ్యన చచ్చిన సాలెపురుగు
పట్టులో సజీవంగా
రెండు మక్షికాలు సాక్షాత్కరిస్తే
ప్రక్కనున్న శ్రీశ్రీని పిలిచి
'ఏమిట్రా తంబీ' అన్నా
సాలె పట్టు లేదు
అదంతా కవితా వ్యూహం
మక్షికాలు నీవూ నేను
పట్టులో చిక్కి చచ్చాంకామని
ఆకాశం చూరునించీ సిరాబుడ్డిలో పడి
ఆత్మహత్య చేసుకొన్న కృశాస్త్రి
రెక్కలు తెగాయి కాబట్టి
డేకురుకుంటూ పోదాం పద వీధిలోకి

శ్రీశ్రీ నారాయణబాబు కలిసి సాగించిన కవితా వ్యవసాయం ఇందులో చక్కగా తెలుస్తుంది. కలానికి బదులుగా పాళికి సిరా తగలటం అభ్యుదయ దృష్టిని స్పష్టం చేస్తుంది. సాహిత్యం జీవిత వాస్తవాల నుంచీ రూపు దిద్దుకోవాలి కానీ కాల్పనికతలో ఇంకి పోరాదు. ఈ చరణాలు అద్భుతమైన అధివాస్తవిక వ్యక్తీకరణకు మచ్చు తునకలు.

తమ అభ్యుదయ దృష్టితో, కృషితో భావకవుల వ్యూహం దెబ్బతినింది. కృష్ణశాస్త్రి ఖంగుతిన్నాడు. తననీడలో ఉంటారనుకొని ఆకాశవిహారం చేస్తున్న కృష్ణశాస్త్రి అసలు సంగతి తెలిసి వారిని

బంధించే మార్గంలేక ఏకాకిగా మిగిలిపోయాడు. దాంతో భావ కవిత్వ ఉద్యమం ముగుస్తుంది. ఇన్నాళ్ళు భావకవిత్వం నేర్పిన కల్పనలతో ఆకాశవిహారం చేశారు. కానీ నేడు యదార్థాలు వాటిని కత్తిరించివేశాయి. నడవటం కష్టమయ్యింది. అయినా డేకురుకుంటూ ప్రపంచంలోకి వచ్చారు.

ప్రాత అయిపోయింది
సిరామిగిలి పోయింది
ఏం సాధన మన్నా
'ఉంచు; నా మహా ప్రస్థానంలోకి
వచ్చే' మహారాజులకి
నీలి శాలువలల్లి కానుకలిస్తా
కాకపోతే
నీ నెత్తురు నల్లబడే దాకా నీవే ప్రాగు ?
అప్పుడు వెలిగించు దీపం
ఈ మానవ జాతికి నీవు ఎర్రదీపానివి
ప్లేగు వ్యాధికి కనిష్టీపువి.

ఇంతవరకూ భావకవిత్వం మీద, మనిషికి మనిషికి మధ్య మంచుతెరలు అల్లి జీవితానికి దూరం చేసే వాళ్ళ వ్యూహం మీద దాడి చేశారు. జీవిత లక్ష్యమంతా అదే కావటంతో జీవితంలో ఎదురు దాడిలేని పోరాటాన్ని వూహించలేక పోయారు. అందువలవ ఏం చేయాలో దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది. ఈ విషయాన్నే నారాయణబాబు శ్రీశ్రీతో అన్నాడు. అందుకు శ్రీశ్రీ అభ్యుదయ మార్గాన్ని అనుసరించే వారసుల్ని తయారు చేసేందుకు సాహిత్యాన్ని ప్రచారం చేస్తానని, వారిని ఆహ్వానిస్తానని తెలియజేస్తాడు. అంతేకాకుండా బలమైన సొంత గొంతు

ఏర్పడే దాకా శ్రమించి సాహిత్య సృష్టి చేయమని నారాయణ బాబుకు సూచిస్తాడు. అభ్యుదయ మార్గానికి దిక్కు-వనీ, రక్షవనీ అభినందిస్తాడు.

అంతరోద్ధు ఆవలిస్తే
ముగ్గురు ఆడపిల్లలు పుట్టారు
తుమ్మితే
మూడు ఎలక్ట్రిక్ దీపాలు వెలిగాయి
లోపలికి ఒక దీర్ఘనిశ్వాసం తీసే
అన్నీ మాయమయ్యాయి
కాశ్మీరసరస్సులో పడవల్లాగు
కాల ప్రవాహంలో కలరా శవాలు కొన్ని

కామ అసంతృప్తిని, వ్యక్తంలోని పరిమితిని మొదటి నాలుగు పాదాలు తెలియజేస్తాయి.

శ్రీశ్రీతో పాటూ నారాయణబాబూ అధివాస్తవిక ప్రపంచానికి నడిచాడు. ఒక్క దీర్ఘనిశ్వాసం ద్వారా లోకాన్నంతా చేతనా చేతనావస్థలోకి వదిలారు. అప్పుడు అందమైన ప్రపంచం వెనక అసలు తత్త్వం బోధపడింది. అందమయిన జీవితపు మరో అంచున వున్న కురూపితనం, దయనీయత, భయంకరత్వం స్పష్టంగా కనిపించింది.

'కాల ప్రవాహంలోని కలరా శవాలను కాశ్మీర సరస్సులలోని పడవలను పోల్చి కవి లోకుల దృష్టిలో అందమయిన వస్తువులను హేళన చేయుచున్నాడు'* అని సి. నారాయణరెడ్డిగారు చెప్పటం సరికాదు.

---

* ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు పుట 592

స్రియలిస్టు కవిత అది చెప్పాల్సినదాన్ని సంపూర్ణంగా అక్షరాల్లో చెప్పేయదు. అక్షరాలను దాటి ఎంతో వుంటుంది. స్రియలిస్టు కవిత్వానికి వ్యవహారిక అర్థం కాకుండా లోతుగా దాని సంపూర్ణమైన అర్థాన్నే పరిగణనలోకి తీసుకోవాలి.

'వీధులు ప్రమాదం, పరిగెడదాం పద
ఆరుబయలులోకి' అన్నాడు
పరిగెట్టాం ఇద్దరం
అక్కడ గాలిలేదు, వెలుతురు లేదు
శూన్యం లేదు
సప్త సముద్రాలు జమకట్టుకొని
జల తరంగిణి వాయిస్తున్నాయి.

ఎప్పుడయితే అధివాస్తవిక ప్రపంచలోకి అడుగు పెట్టారో, ఇరుకయిన ఆదర్శవాదం ప్రమాదంగా అనిపించింది. అది ప్రపంచాన్ని లోతుగా అర్థం చేసుకోనివ్వని విధానంగా తోచింది. ఇక తక్షణమే అక్కడ నుంచీ పారిపోయి విశాలమైన అంతశ్చేతనా మైదానాన్ని ఆశ్రయించారు శ్రీశ్రీ, నారాయణబాబు. ఇక్కడ లోకం ఏర్పరిచిన మంచి మర్యాదలు లేవు. ఏకాకితనం లేదు. నిజంగా ఇది మరో ప్రపంచం, మహాప్రపంచం. కళ్ళముందు కదిలే ప్రపంచ సంబంధమైనా దానికి భిన్నమైనది. ఇక్కడ చలనం సంచలనం.

ఆకాశం చిరిగిపోయిన అరటి దొప్పలా
ఒకమూల పడివుంది
భూగోళం పళం మీద

ఉల్లి పొర కాగితం లాగ
మృతించిన శేషుడు
భూమిని చుట్టుకొని వున్నాడు
వెలిసిన రంగు గుడ్డలు మంచీ చెడ్డా
జండాలై ఎగురుతున్నాయి !

బాహ్యప్రపంచం జీవం లేనిదిగా బలహీనమైనదిగా మారింది. ఎంతో విశాలమయిన ప్రపంచం తేలికయి తమ దృష్టినుంచి జారి పోయింది. లోకమే ఇలా కుంచించుకొని తేలికయిపోతుంటే మంచి చెడ్డను గురించిన అభిప్రాయాలు అర్థాన్ని కోల్పోయి జండా పీలి కలుగా తయారయ్యాయి, మంచి చెడ్డల్ని వెలసిన రంగు గుడ్డల జండాలుగా చెప్పటం గొప్ప పోలిక.

కుల పర్వతాలు
గాలిలో విమానాల్లా
ఎగురుతున్నాయి
కుష్టు రోగంతో కాళ్ళు చేతులు పడిపోతే
కింద పడి దొర్లుతూ ఏడుస్తున్న దేవేంద్రుడు
ఇంకిపోయిన అమృతభాండంలో
తడైనా తగులుతుందేమోనని
వేళ్ళతో స్పృశిస్తున్న శచీదేవి
దేవేంద్రుని సింహాసనం మీద
కూర్చొని వజ్రాయుధంతో
తానొకప్పుడు కొండలను ఖండించిన
రెక్కలన్నింటిని పోగుచేసి
మరలా పర్వత భుజాలకు
అంటిస్తున్నాది పేస్టుతో

వ్యక్తా వ్యక్తంలోకి వచ్చేశాక ఆలోచనా విధానంలో చాల మార్పు వచ్చింది. ఆదర్శవాదానికి కష్టపట్టి దిక్కు లేనిదిగా తయారయ్యింది. ఈ దుస్థితి నుంచీ విముక్తి కల్గించేందుకు 'సూపర్ ఇగో', 'ఇగో' లోంచి దివ్యౌషధాన్ని అందించేందుకు ప్రయత్నిస్తోంది. అయితే దాని ప్రయత్నం సఫలంకాలేదు. ఇన్నాళ్ళూ సహజానుభూతుల్ని స్వేచ్ఛగా తిరగనీయకుండా నిలిచిన జీవన రక్షణ సహజాతం ఆదర్శవాదం చేతిలో ఉండిపోయింది. కానీ ఆదర్శవాదం దెబ్బతినటంతో అది తిరిగి విశృంఖలమైన సహజానుభూతులకు కృత్రిమంగా (తానై తాను ఉద్దేశ్యపూర్వకంగా) స్వేచ్ఛను కల్పిస్తోంది. దాంతో అవి ఎప్పటిలాగే విజృంభించాయి.

గండభేరుండ పక్షులు కలరవాలు చేస్తుంటే
శ్రీశ్రీ పాడదామన్నాడు
అటు ప్రక్కనుంచీ
మాసిన బట్టల మాటల మూటలు
రేవులో తగల బెట్టుకొని ఏడుస్తూ
ఎదురుగుండా తోచిన
చాకలి సరస్వతిని చూసి
శ్రీశ్రీ తన్నేందుకు కాలు ఎత్తి
మూగయై నిలుచున్నాడు.

గండభేరుండ పక్షులు బలమైన సెక్స్ విశృంఖలతకు ప్రతీకలు. విశృంఖలమైన సెక్స్‌ని కవితాగానంగా మార్చాలని శ్రీశ్రీ ప్రయత్నం. అధివాస్తవిక ప్రపంచంలోకి అడుగు పెట్టాక పాత ఛందస్సు, పాత అలంకారాలు, పాత డిక్షన్ ఉపయోగ పడక పోయాయి. వాటినే కొత్త అర్థాలతో, విధానాలతో ఉపయోగించినా సరిగా అనిపించకపోవటంతో తగలబెట్టాడు. అయితే

శ్రీశ్రీ 'సూపర్ ఇగో'లో ఎక్కడో వాటిమీద ఇంకా మమకారం చావక బాధగావుంది. వాటిమీద మమకారం చావలేదన్న వాస్తవాన్ని భరించలేక శ్రీశ్రీ కవిత్వం మీదనే తన తీవ్రమైన కోపాన్ని ప్రదర్శించాడు.

'అయితేసేం, పోతేసేం' అన్నా
ఎంతో సరదాపడి
పరీ బజారులోకొన్న పాత
సాహిత్య కోమటిని
ప్రాధేయపడి తెచ్చిన వాల్ఖలేడ్
గురజాడ ప్రసాదించిన ముత్యాలసరం
హాప్కిన్సును అర్థించి తెచ్చిన స్ప్రింగ్ రిదమ్
అన్నీ పోయాయన్నాడు నత్తిగ

నారాయణబాబుకు రూపం విషయంలో తీవ్రవాదం లేదు. కవిత్వాన్వేషణలో ప్రయాణం సాగించే వాడికి భాష మీద దుడుకుతనం అవసరంలేదు. అది ఒక్కొసారి రూపం మీది ధ్యాసతో అన్వేషణాలోతుల్ని అడ్డుకొంటుంది. అందుకే శ్రీశ్రీని ఉపశమింపజేసే ప్రయత్నం జేశాడు. చివరికి వాల్ఖలేడ్ ఛందస్సు, ముత్యాలసరం ఛందస్సు, హాప్కిన్స్ స్ప్రింగ్ రిదమ్ కూడా పట్టుతప్పి నిస్సహాయంగా మారాడు. ఛందస్సు, రిదం. లేకుండావుంటే కవిత్వం సరిగా పలకదు శ్రీశ్రీకి

పక్కన పడివున్న శేషుని కోర పెరికి
ఆడ గండభేరండ పక్షి రెక్కమీద
దాలి శ్రీశ్రీ రచించిన చిత్రపటానికి
మా శ్రీ నారాయణబాబు తీసిన ఛాయా చిత్రం !

కవిత్వాన్ని, అభ్యుదయవాదం నుంచి ఫ్రాయిడ్ సిద్ధాంతాల లోతులకు తీసుకువెళ్తే, నారాయణబాబు ఆ లోతుల్ని తనదైన శైలిలో ఎంతో కళాత్మకంగా బంధించి గానం చేశాడు.

పరం !
రెండు అస్థిపంజరాలు
అస్థి పంజరాలకు
అందం, లింగభేదం అనవసరం
అయినా ఒకటి స్త్రీ అస్థిపంజరం
రెండవది మగవానిది
స్త్రీ అస్థిపంజరం చేతిలో ఒక గులాబి అత్తరుబుడ్డి
మెడలో మెరిసిపోతున్న కోహినూరు వజ్రం !
పక్కన నిలబడిన మొగ అస్థిపంజరం ఏడుస్తూ
నల్లబడిన ఎముకలతో వేడెక్కిన ఎముకలతో
చేతిలో
వజ్ర వైఢూర్యాలు పొదివిన
బంగారు గునపంతో
తాజ్‌మహల్ తవ్వేస్తూ

భావకవుల్లోని స్త్రీ పురుష సంబంధాలు దేహచింతలు పట్టని అస్థి పంజరాల దశకు మారాయి. స్త్రీని పూవుగా భావించి అమలిన శృంగారంతో ఆనందించే స్థితికి చేరాక స్త్రీ చేతిలోని అత్తరుబుడ్డి కనిపించటం మానేసింది. భావకవులు స్త్రీ దేహంమీద బాహ్యంగా మెరిసే అన్ని అందాల్ని గుర్తించారు కానీ దేహాన్ని పట్టించుకోక పోయారు. స్త్రీ మీద సబ్‌లైమ్ (Sublime)గా మారిన కోరిక సామాజిక స్పృహతో ఇంకా అణచబడిపోయింది. సబ్‌లైమ్ వల్లను, సప్రెషన్ (Suppression) వల్లను, రిప్రెషన్ (repression) వల్లను అచేతనలో అసలు స్త్రీ మీద సహజమయిన ఆరాధన,

ప్రేమ తగ్గి కామం ఒక్కటే జీవన మార్గంగా తోచే దశకు బీజం ఏర్పడింది.

తాజ్ మహల్‌ను గునపంతో తవ్వివేయటం అమలిన శృంగారానికి, పవిత్ర ప్రేమకు విముఖత్వం తెలియజేయటమే. 'తాజ్ మహల్' అమలిన శృంగారానికి ప్రతీకయితే, 'వజ్ర వైఢూర్యాలు పొదిగిన గునపం' కామానికి ప్రతీకగా చెప్పుకోవచ్చు.

ఇంతలో ఆడ గండభేరుండ పక్షి
దగ్గరకు వచ్చి
శ్రీశ్రీని ముక్కుతో అతికించుకొని
విమానంలా లేచి పోతూవుంటే
నేను ఎక్కడికన్నా
మాటలు రాని మూగ (శ్రీ)(శ్రీ)
ఒక హస్త విన్యాసం పట్టి
గరుడలోకానికని చూపించాడు
నాలో మాటల మరుపు ప్రారంభించింది
మరిచి పోకుండా
మననం చేసుకుంటున్నా

శ్రీశ్రీ సెక్స్ తీవ్రతలో కొట్టుకు పోవటంతో సాహిత్యంలో స్తబ్ధత ఏర్పడింది. నారాయణబాబులో ఒంటరితనం అలుముకొంది. శ్రీశ్రీ ప్రేరణతో తను ఇంతవరకూ కవిత్వం రాస్తూ వచ్చాడు. శ్రీశ్రీ వెళ్ళిపోవటంతో తనలో పదాలే దొర్లటం లేదు. అయినా ప్రయత్నిస్తున్నాడు.

'ఆడగండభేరుండపక్షి' తీవ్రమైన సెక్స్‌కు ప్రతీక. 'గరుడ లోకానికి' అంటే సెక్స్ తీవ్రతలో కొట్టుకుపోయాడు. 'గరుడలోకం' అంటే పెద్దలు నడిచిన మార్గం అనికూడా అర్థం చెప్పుకోవచ్చు.

ఇంతలో
తొలి నిశనుండీ నేటి వరకు
మానవజాతి కన్నకలల సిమెంటుతో
కట్టిన గోడల తాకి
కాల ప్రవాహం ఘూర్ణిస్తున్నాది
కొంతసేపు కాలాంతంలోకి
కాళ్ళు చాపుకొని కూచున్నా
ఎల్లలు కలిసిపోతున్నాయి
ధిక్ భిత్తికల పెల్లలు రాలిపోతున్నాయి
లేచా !
రజతా చలం కనబడితే
ఎక్కా !

నారాయణబాబు 'తన్నుతాను' తెలుసుకోవటంలో తన (భౌతికమయిన) పరిణామాన్ని గుర్తించాడు. అప్పుడే మానవ జాతి తొలినిశ నుంచీ, నేటి వరకు కన్నకలల అంతరార్థం బోధ పడింది. కాలం హద్దుల్లో నలిగిన ఘూర్ణింపు వినిపించింది.

నారాయణబాబుకు కాల పరిధిలో జీవనం అలుపుగా తోచింది. కాలాంతంలోకి కాళ్ళు చాపుకొని కూచున్నాడు. దాంతో మానసిక హద్దులు, దిక్కులు, పరిధులు తేలికగా నశించి ప్రశాంతమయిన ఉదాత్తత ఏర్పడింది.

కొండలోయలలో పూలతోట
చెట్లులేవు అన్నీ పూవులే
ఉపనిషత్తులు తుమ్మెదలై
ఝుంకారం చేస్తున్నాయి
పార్వతి నగ్నంగా నిలబడి

పూలు కోస్తున్నాది
ఈశ్వరుడు నిద్రపోతున్నాడు
పార్వతి దర్శనమయ్యే సరికి
నా బట్ట అంటుకున్నాది
నే కాలి పోతున్నాను
మూగనై నిలుచున్నా
దగ్గరగా ఒక మౌనశంఖం తోచింది
మౌనశంఖం స్పృశించా !
నా గుండె అంతా హంసయై
'సోహం' అని అరిచింది !

ఈ ప్రశాంత వాతావరణంలో సృష్టి శోభాయమానంగా వెలిగిపోతోంది. ఇక్కడ అజ్ఞానం లేదు. అందరిలో జ్ఞానమే పరిమళిస్తోంది. ఉపనిషత్తులు అందరి హృదయాల్లో ఝుంకారం చేస్తున్నాయి. అంతేకాకుండా అతనిలో ఇన్‌ట్యూషన్ ( Intuition) మొదలయి సమాధి స్థితి ఏర్పడుతోంది. దాంతో నారాయణబాబులోని నేను (అహం) ఎంతటి సున్నితమైన రూపంలో ఉన్నా కాలి పోతుంది.

'వాశిష్ఠరామాయణం' లో ఓ రాజు మోక్ష ప్రాప్తికై 'నేను', 'నాది' అనే అన్నింటిని వదిలేసే క్రమంలో తనుకట్టుకున్న కౌపీనాన్ని కూడా మంటలో వేస్తాడు. చివరికి అగ్నిలో తనే ఆహుతి కావటానికి ప్రయత్నిస్తాడు. జ్ఞానవంతురాలయిన అతని భార్య, రాజుకు నిజంగా వదిలివేయాల్సినదేదో చెప్పటంతో, మోక్షాన్ని పొందుతాడు. నారాయణబాబు ఆ మర్మాన్ని గుర్తించాడు. బాహ్యంగా సాగిస్తున్న అతని సింహావలోకనానికి అర్థం దొరికి మౌనం దాల్చాడు.

అహం నశించే క్షణాన అతనికి విరుద్ధశక్తుల ఏకీకరణలోని తాత్త్వికత స్ఫురించింది. శంఖం శబ్దాన్ని సూచిస్తే, మౌనం నిశ్శబ్దాన్ని సూచిస్తుంది. శబ్దం, నిశ్శబ్దం రెండూ ఒకదానికొకటి పూర్తి విరుద్ధమైనవి. ఈ విరుద్ధశక్తుల సమీకరణ నుంచే సకల చరాచరజగత్తు మూలచైతన్యం నిండిపోయింది. అహం సంపూర్ణంగా నశించి మూల చైతన్యానికీ తనకు అభేదం ఏర్పడింది.

నా చైతన్యమంతా
సప్తసముద్రాల సహస్రకోటి బాహువుల
మెరిసే నురుగై ఘుయ్యిమంది
నా ఎముకుల మూలుగులో
చంద్రోదయమైంది.

నా శరీరం
కాశ్యప భస్మరాశియై తరళించింది
నా ప్రాణం భగీరథుడైంది
నా వెన్నెముక మీద
ఆకాశ గంగా జలపాతం వర్షించింది
నా పొత్తి కడుపు
హిమాచల తనయ
తన చల్లని మంచు హస్తాలతో నిమిరింది
రవం నీరవానికి Diminutive

నారాయణబాబు భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, అధివాస్తవిక కవిత్వం అంచుల్లోని కాలపు హద్దుల్ని దాటి కాలాతీత స్థితిని పొందటంతో చైతన్యం బహుముఖాలుగా విజృంభించింది. ప్రశాంతత దేహంలోనే కాదు అణువణువులో వ్యాపించింది. సడ

లని పట్టుదల ప్రాణవంతంగా మారి వెన్నెముకలో జలపాతాన్ని దూకిస్తూ సృజనాత్మకతను వెలిగిస్తోంది. హిమాచల తనయ (శక్తి) కూడా తన చల్లని హస్తాలతో సృష్టికార్యానికి ప్రేరేపిస్తోంది. ఈ స్థితిలో శబ్దానికి, నిశ్శబ్దానికి మధ్యవున్న వైరుధ్య సంబంధాలు పరిధులు చెదిరిపోయి నిశ్శబ్దానికి శబ్దం డిమున్యూటివ్‌గా (Dimunitive) మారింది.

నారాయణబాబు తెలుగు అధివాస్తవిక, తెలుగు కవిత్వానికి (పునాదికి) పరిచయం చేసింది, ఈ మౌన శంఖాన్నే. తెలుగు కవిత్వానికి ఇచ్చిన కానుక కూడా ఇదే.

ఈ గీతంలో శివుడికి ప్రాధాన్యత లేనట్టుగ చూపడం శాక్తేయ దృక్పథాన్ని సూచిస్తుంది. శాక్తేయుల ప్రకారం 'సాహం' అని తప్ప 'సోహం' అని సాధకుడు తన్ను పోల్చుకోడు.

మౌనశంఖంలో అద్భుతమైన క్రమం, అద్భుతమైన శైలి ఉంది. మనిషి అంతరాంతరాల్నీ, చైతన్యపు లోతుల్నీ ఆవిష్కరించే ఉత్కృష్ట వాహికగా సర్రియలిజం, సింబాలిజం, ఇమేజిజం హద్దులు తెగిపోయాయి. భావానుభూతి, భావతీవ్రత వ్యక్తావ్యక్తంలో సాగిన సరికొత్త పోకడలు చక్కటి వచనం ('రుధిర జ్యోతి'లో ఇలాంటి వచనం ఉన్న గీతాలు ఎక్కడో అరుదుగా కన్పిస్తాయి) కన్పిస్తుంది. ఆద్యంతం అద్భుతమైన నైపుణ్యంతో పండిన శిల్పంకూడా ఇదే. మహోన్నతమైన వస్తువు, ఉత్కృష్టమైన శిల్పం కలిగిన అధివాస్తవిక కవితల్లో ఈనాటికీ, ఆనాటికీ ఉత్తమమైనదిగా దీన్ని చెప్పాకనే మిగిలిన వాటిని చెప్పాలి. ప్రసిద్ధమైన సర్రియలిస్టు కవిత్వాల స్థాయికి ఏమాత్రం తీసిపోని ప్రతిభావంతమైన గీతం మౌనశంఖం.

ఈ గీతం మీద సి. నారాయణరెడ్డిగారి పరిశీలన, అభినందనో లేక స్క్రియలిస్టు కవిత్వంమీద నిరసనో అర్థంకాదు. 'మౌన శంఖాన్ని' వివరిస్తూ ఆయన ఇలా అన్నారు. "కవి సంప్రదాయ సిద్ధమైన నిర్వాణ స్థితిని అందుకొన్నట్లు చెప్పబడింది. ఈ గేయములో చివరికి గంభీర విషయ నిర్దేశమున్నను అంతకుముందు కామ వాంఛ ప్రకటనము, వికృత విషయ కథనము, విచిత్ర భావ చిత్రణము ప్రధానముగ నున్నందున ఇది అచ్ఛమైన అధివాస్తవిక గేయ మనవచ్చును ..." "తాజ్ మహల్ త్రవ్వి వేయుటలో సుందర వస్తువులని లోకం భావించిన వానిపట్ల అసహ్యత ప్రకటించుట కలదు."*

ఆయన ఇలా ప్రకటించటానికి కారణం గీతం అనుభూతి సారాన్ని పట్టుకోక ఏవో కొన్ని వాక్యాల్ని అసందర్భంగా బయటికి లాగి అర్థం స్క్రియలిస్టు కవితా వాస్తవికత నుంచీ కాక వ్యక్తిగత మైన వాస్తవికత నుంచీ కవితను పరిశీలించే విమర్శ సరైనది కాదు. అధివాస్తవిక కవిత్వం సాహిత్య లోకంలో తెరవబడిన మంత్రకవాటం కాకపోవటానికి భావ చిత్రాలు తప్ప సాధించినది ఇంకేమీ లేక పోవటం వల్లనే అని అనిపిస్తుంది.

అందరి మధ్యనే 'సమాధిలో జలదాంతర శశి'లా మారి పోయే దశ ఏర్పడుతుంది. ఏకాకితనం నుంచీ, మానసిక క్లిష్టతల నుంచీ తప్పించలేని వాతావరణం ప్రపంచవ్యాప్తంగా మానవ శక్తుల్ని నిర్వీర్య పరుస్తూ వ్యాపిస్తోంది. ప్రపంచ పరిణామాన్ని అంతకంటే సంక్లిష్టమైన మనో ప్రపంచపు లోతుల్ని వెలికి తీసే అన్వేషణను ఇవాళ శ్రోతకోసం బలిచేయటం ఆత్మహత్యా సదృశం.

* ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు; ప్రయోగములు పుట. 592

కవి తన్నుతాను రక్షించుకోవటానికి సాత్యకు (ప్రభావాలతో) ఆత్మహత్యకు గురికాకుండా బతకటానికి బాహ్యాంతరాల మధ్య చేతనా చేతనల మధ్య ఉన్న అగాధం పూడ్చుకొని, మనస్సుకు, మాటకు నిర్మాణానికీ మధ్య సమతౌల్యం సాధించే ప్రయత్నంలో సర్రియలిస్టు చైతన్యమైన ఆంతరిక పరిశీలన, లేదా వ్యక్తావ్యక్తం మధ్యవున్న యథార్థ పరిశీలన ప్రతి కవికీ జీవితంలో ముఖ్యమైనది కాక తప్పదు. అప్పుడు కానీ కవితా నిర్మాణంలో మరొక నూతన అధ్యాయం మొదలవదు. ఈ యథార్థాన్ని గుర్తించనంత వరకు మనం బాహ్యంగా ప్రయత్నించే కవితా ఉద్యమాలు పై పై ఆంతరిక పరిశీలనలు సర్రియలిస్టు కవిత్వంలోని రంగును, కోణాన్ని, మెరుపును గొప్ప అర్థవంతంగా కాకుండా ఓ అలంకారంగా మాత్రమే వాడుకొంటాం. ఇక ఉద్యమాలు ఒక దానికొకటి కూల్చుకొని అసమగ్ర పాక్షిక వాస్తవాలుగా మిగిలిపోతుంటాయి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సీరియస్ గేమ్ (Serious game)గా ఉంటుంది. ఈ వాస్తవాన్ని స్పష్టంగా గుర్తించే దాకా సర్రియలిస్టు చైతన్యంలోని బలం తీవ్రత అర్థం కాదు.

సర్రియలిస్టు చైతన్యాన్ని ఏదో సెక్స్‌గాను, భయంకరంగాను, జుగుప్సగాను భావించే దశనుంచి అత్యున్నత అంచులకు వెళ్ళగలిగినప్పుడు అది ఒక రూపంకాదు. మానవుడి జీవనానికీ కవితానికి అదొక ఆయుధంగా మారుతుంది.

# 6. నారాయణబాబు కవితాతత్త్వం ఇతర కవులపై ప్రభావాలు : ఛాయలు

To reach the unconcious. You have to have an action which does not directly appeal to the concious —*Bohm*[1]

Yes that is affection, that is love. When you talk to my waking consciousness, it is hard, clever, subtle, brittle. And you penetrate that, penetrate it with your look, with your affection, with all the feeling you have. That oparates, not enything else —*Krishna Murthy, J*[2]

పై సంభాషణ రెంటాల సంఘర్షణ కావ్యంలోని నారాయణ బాబు మాటలకు చాల దగ్గరగా కన్పిస్తుంది, "కాలం కన్ను విప్పిన నాటి నుండి కవులు పతితలతో రకరకాల సంబంధాలు పెట్టుకున్నారు. అతి నవ్య కవి నీతో కల్పించుకున్న సాన్నిహిత్యం ఎవరూ నీతో కల్పించుకోలేరు. అతి నవ్య కవి మాట అభిమానపు మాట, నీ రక్తం నుంచీ ఉద్భవించాడు, నువ్వే: "

ఆయనకు ప్రాకారాల మధ్య పెను గోడలలో కట్టిన పట్టణం సాహిత్యంగా కన్పించింది. "ఈ పట్టణంలో ప్రవేశిస్తే మరేం

1. David Bohm : Proffessor of theoretical Physics at Birk beck college, London University, author of causality & chance in Modery Physics, Quantien theory, the special theory of Relativity

2. Krishna Murthy, J. : on intellijence—The awakening of intelligence P. 538.

2. నారాయణబాబు, శ్రీరంగం : 'రుధిరజ్యోతి' – ప్రవర. పుట 3

కనిపించదు. కులాసాగానే ఉంటుంది. ప్రాకారాలు బద్దలుకొడితే భిత్తిక కవతల నున్న పచ్చిక బయళ్లు, రమణీయ శ్యామల ప్రదేశాలు కనబడతాయి. అంటే వ్యక్తంలో అనుభవించిన అనుభూతుల్ని వ్యక్తా వ్యక్తంగా మారే అవకాశాన్ని కల్పించాలి. పట్టణం ఎలాగూ కనిపిస్తుంది. ఈ వ్యక్తా వ్యక్తం అవగతం చేసుకొనేందుకు అనాది నుంచీ వస్తున్న సంప్రదాయాలు, నీతి, తర్కం, హేతువాదం అన్నిటిన్నీ విసర్జించాలి. ఈ గోడలు పగల గొట్టేందుకే, ప్రాకారాలు కూలదోసేందుకే ప్రతి గీతం చేసే ప్రయత్నం"[1] అన్నదే నారాయణబాబు భావించిన విధ్వంసం. కె. వి. ఆర్ అన్నట్టు నారాయణబాబుతో పోలిస్తే శ్రీశ్రీది శైశవ క్రీడ.[2] నారాయణబాబు వూపెత్తిన వెర్రిపీరులాంటి కవి. అతి వాస్తవికంలోనూ శ్రీశ్రీకి మిన్నే. అక్షర విన్యాసంలో, భావనారీతిలో, భాషా ప్రయోగంలో ఇతరులు వేసినపిల్లి మొగ్గలు నారాయణ బాబు కవిత్వంలో కన్పించవు. సి.నా.రె.గారు అన్నవాక్యాలు ఆయన మొత్తం ప్రవరను అర్థం చేసుకొని అన్నవి కావు.[3] ఇతర విమర్శకులు వెలిబుచ్చిన అభిప్రాయాలు కూడా నారాయణబాబును లోతుగా సన్నిహితంగా కవితాలోకనం చేసి నిర్ధారించినవి కావు.

---

1 నారాయణబాబు, శ్రీరంగం : 'రుధిరజ్యోతి'-ప్రవర- పుట. 3

2 కె. వి. ఆర్ :మౌనశంఖం-వ్యాసం, 'అక్షరజగత్తు', 'ఆంధ్రప్రభ' దిన పత్రిక 29-3-1981.

3. నారాయణబాబు స్వయంగా అధివాస్తవిక కవితా రీతిని గూర్చి చెప్పిన వాక్యములను ఆయనయే తూచతప్పకుండా అనుసరించినచో అతని రచన లింతవరకు నిలిచెడివికావు. ఈ జగత్తుతో మాకు పని లేదు అన్నవాదం గాలిలో ఈతవంటిది

నారాయణరెడ్డి, సి : ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు ప్రయోగములు పుట 385

నారాయణబాబు కవిత్వంలో విధ్వంసమే కాదు పునఃసృష్టిని గురించిన దృష్టికూడా కనిపిస్తుంది. "ఈ కాలంలో వాత్స్యాయనుడు, మనువూ కాదు మా ఋషులు, మార్క్సు, ఫ్రాయిడ్. యదార్థ జగత్తు, స్వాప్నిక జగత్తు తారుమారయ్యాయి. యదార్థాన్ని గుర్తించం. కలలు మాకు యదార్థాలు. ఈ జగత్తుతో మాకు పనిలేదు. మాది స్వప్న జగత్తు (ఇక్కడ అపార్థం చేసుకోరాదు, ఆయన మాటల్లోనే వ్యక్తంలో అనుభవించిన అనుభూతుల్ని వ్యక్తావ్యక్తంగా మారే అవకాశాన్ని ఇవ్వాలి). సంపన్నులు, భాషాసంపన్నులు మాకు విరోధులు. కావ్యలక్షణాలే అవలక్షణాలు. అందరం కవులమే. వ్యక్తాన్ని వదిలి పెడతాం. వ్యక్తావ్యక్తంలో ఈత కొడతాం. ఏదో విధమైన శక్తి మమ్మల్ని పూనుతుంది. అదేదో రాయిస్తుంది. అర్థమనర్థం, అదేది రాయిస్తే అదే కవిత్వం. కేవలం ప్రయోజనాన్నే వినియోగించుకొని అనర్థాన్ని విసర్జించడం కొమ్ములు తిరిగిన కవి చేయగల పని.[1]

అధివాస్తవికులు Hegelian dialectic (logic)ని వైరుధ్యంగా కాక నూతన అవగాహన క్రమంగా మలచుకున్నారు. పరస్పర వైరుధ్యాలనిపించే వాటి మధ్య వాస్తవంగా ఎట్టి వైరుధ్యమూ లేదని భావించారు. Hegel కైనా వైవిధ్యం ప్రధానం కాదు. సమన్వయం (Reconirlation) కోసమే ఆయన Dialecticను సృష్టించాడు. వైవిధ్యానికి గల ఉనికిని ధ్వంసం చేసి Hegel 'Reality' కి ద్రోహం చేశాడు. అది వేరే సంగతి.[2]

వ్యక్తావ్యక్తానికీ, వాస్తవికతకీ (Reality : Phenomenological Reality)సఖ్యత సాధించటంలో సహజ జ్ఞానం ఉద్భవిస్తుందన్నది

---

1 నారాయణబాబు, శ్రీరంగం ; ప్రవర 'రుధిరజ్యోతి' పుట 3

2 'అసురా : ఉత్తరం నుంచి

స్రియలిస్టులకు ముఖ్య సూత్రమయ్యింది.[1] అట్లే పాశ్చాత్య స్రియలిస్టుల్లో కనిపించని ఒక ప్రత్యేక తత్త్వం కూడా నారాయణబాబులో కనిపిస్తుంది. బుద్ధి హృదయం ధ్యాన బద్ధులై నిమీలిత నేత్రాలతో నిద్రిస్తే (వ్యక్తాన్ని జోకొడితే) వ్యక్తావ్యక్తంలోంచీ వెలుగు బాటలు చూసే స్థితి పాశ్చాత్యులది. పాశ్చాత్యులకు, ప్రాచ్యులకు మధ్య వ్యత్యాసముంది. ఆ సత్యాన్ని క్రింది వాక్యాలు ఋజువు చేస్తాయి.

"The roat meaning of that word meditation is to measure. The whole western world is based on the Idea of mea' surement, but in the East they have said" Mesurement is maya illusion, there fore one must find immesurable". So the two drifted apart culturally, socially, intellectually and religiously.'[1]

నారాయణబాబు విధ్వంస నా ప్రయత్నమంతా పరిధులకు కాలమానాలకూ అతీతమైన స్థితి కోసమే. ఇక్కడ నుంచీ అర్థం చేసుకుంటే తప్ప నారాయణబాబు సరిగా బోధపడడు. నారాయణబాబు రాసిన స్రియలిస్టు కవిత్వానికిసంబంధించి సరైన దృష్టి ఏర్పడదు.

సాంప్రదాయక సౌందర్యాన్నికాదని అంతవరకు సాహిత్య కళారంగాలు తడవని చీకటి కోణాల్లోకి -చొచ్చి ఒకఅపూర్వ అనూభూతిని, అనుభవాన్ని వెలికి తీయగలిగింది స్రియలిస్టు కవిత్వం. అంతేకాకుండా కవికి శ్రోతకూమధ్య వున్న కృతకమైన గౌరవనీయ సంబంధాల్ని,ఆచ్ఛాదనల్ని తుడిచేసి వ్యక్తావక్తంతో నేరుగా సూటిగా సంబంధాల్ని అర్థం చేసుకొనేందుకు ప్రయత్నించింది. నిజమైన స్రియలిస్టు కవిత్వానికి (భావంలో కానీ, రూపంలోకాని)

1 శ్రీరాములు, గోడ : యుగకవి శ్రీశ్రీ సంస్మరణ సంచిక, చేతన. పుట. 3

2. Krishna Murthy. J. : The awaking of intelligence P - 471, 472

స్వేచ్ఛకూ అభేదం ఉంటుంది. అందువల్ల భావవిప్లవం, రూప విప్లవం ప్రత్యేక పరిణామాన్ని రిస్థితులనుంచి, పరిస్థితుల ప్రాధాన్యం నుంచీ లెక్కించటం మానివేసి స్వతః సిద్ధమైన ప్రేరణతోనే భావాన్నీ, రూపాన్నీ అన్వేషించుకుంటూ ముందుకు సాగుతూవుంటుంది. అప్పుడు "సాహిత్య పరిణామంలో అంతర్గతమైన సూత్రాలు తెలిసినంత మాత్రాన సాహిత్యం నడిచే వేగం గానీ, మార్గం కానీ నిర్ణయించలేము. వస్తుతః సమానంగా సాధ్యమైన రెండు మూడు భిన్నమార్గాలు వుండగా అందులో ఒక ప్రత్యేక మార్గంలోనే సాహిత్యం పురోగమించడం (కనీసం అది అతి ప్రధాన సాహిత్యమార్గం అవడం) ఎందుకు జరిగిందన్న ప్రశ్న"* ద్వితీయ ప్రాధాన్యతను పొందుతుంది. అయితే సాహిత్య పరిణామంలో అంతర్గతమైన సూత్రాలతో నడిచే సాహిత్యానికి వేగం, మార్గంయొక్క స్వభావం ఎలా ఉందనే ప్రశ్నే ముఖ్యమవుతుంది. దాని పరిశీలనే ప్రధానమవుతుంది.

తెలుగు సాహిత్యానికి ఇంతవరకు తాత్త్వికగాఢత లేదనిపిస్తుంది. నగ్నముని గారన్నట్టు తెలుగు సాహిత్య తీరానికి అటునుంచి దిగుమతి చేసుకున్న ఓడలే (సంస్కృతం నుంచి పాశ్చాత్య సాహిత్యం నుంచి). ఈ దిగుమతుల వల్లే ప్రభావాల పుట్టు పూర్వోత్తరాలు, లోతులు అవగాహనలోకి రాక కేవలం ప్రభావాలు మాత్రమే వెంటాడాయి. ఇందువల్ల తెలుగు సాహిత్యానికి స్పష్టమైన గాఢత, క్రమబద్ధత (గురజాడ సాహిత్యం వచ్చాక కూడా భావకవిత్వం మొదలు కావడం) లోపించింది. పోతే సక్రియలిస్టు కవితకు శ్రోత సక్రియలిస్టే. శ్రోతకు కవికి మధ్య సంబంధం స్వః

* నారాయణరావు, వెల్చేరు : తెలుగులో కవితా విప్లవాల స్వరూపం–పీఠిక

నాత్మకమయింది తప్ప వేరుగా వుండదు. ఏదో ఒక గాఢమైన, సత్యాన్వేషణ లేనివాళ్లు సర్రియలిస్టు కవితకు శ్రోతలుగా వుండలేరు. ఒట్టి సిద్ధాంతాలపట్ల మాత్రమే ఆసక్తి గలిగినవాళ్లు, అనుకరణీయులు సర్రియలిస్టు కవితకు శ్రోతలు కాలేరు. అందుకే కవిత్వాన్ని ఉద్యమ రూపంగానే కాకుండా ప్రధానంగా పరిణామగతంగా చూడాల్సి వుంటుంది. సాహిత్యం నడిచే వేగం, మార్గం స్వభావం పరిశీలించాల్సి వుంటుంది. వెల్చేరు నారాయణరావు గారు చెప్పినట్టు అధివాస్తవికతకు తెలుగుదేశంలో పునాదులూ అనుభవాలు లేక పోయినా కొంచెం తేడాతో మరో రూపంలో దాని ఉనికి లేక పోలేదు.

ప్రపంచ వాస్తవాలనూ, పరిణామాలనూ బుద్ధితో, హృదయంతో, విచక్షణతో అర్థం చేసుకొన్న తెలుగువారికి ఆ అనుభూతులు, అనుభవాలు ప్రత్యక్షంగా అంతరీక్షణమైనవి కాక పోయినా దూరమయినవి కావు. అంతే కాకుండా రోజు రోజుకూ ప్రపంచం దగ్గరవుతున్నది. ప్రపంచ మానవుడు సరిహద్దులు చెరిపి సమస్యల నుంచీ దూరంగా మానవాత్మను వెతుక్కొనే ప్రయత్నంలో సిద్ధాంతాలన్నీ ఒట్టి భ్రమలుగానే కన్పించాయి. ప్రపంచంతో అనేక సంబంధాలను ఏర్పరచుకున్న తెలుగు జీవితం ఆంతరంగిక అనుభవాలకు పరోక్షంగానైనా లోనుకాక తప్పలేదు. అట్లే మెలకువ, సుషుప్తి, కల, నిద్ర మొదలగు వాటి మధ్యవున్న సంబంధాల్ని గుర్తించడమే కాక ప్రపంచ వాస్తవికతలోని భ్రమల్ని విచారించే పరిస్థితి తెలుగుదేశంలో లేకపోలేదు. అందువల్లనే సర్రియలిజాన్ని అందుకో గలిగింది. స్వదేశీయతకు మార్చుకొనే దశకు ఎదగ గలిగింది. ఎంతవరకూ అన్నది వేరే విషయం. అధివాస్తవిక ధోరణికి ప్రేరణ తెలుగు జీవితం నుంచి వొచ్చినది కాదు, తెలుగు కవిత్వం నుంచి వొచ్చినది కాదు. అనే వాదన నిజ

మయినదే, అయితే భావకవిత్వానికీ అభ్యుదయ కవిత్వానికీ విప్లవ కవిత్వానికి ప్రేరణ తెలుగు జీవితమూ కాదు, తెలుగు కవిత్వమూ కాదు.

ఇక వ్య  అంతర్గతంగా బందీ అయిపోయి తానేమో గుర్తించలేని పరిస్థితిలో భ్రమలనుంచీ, తర్కంనుంచీ విముక్తికై తనను తాను విచారించుకొనే తాత్త్వికతకు తెలుగు దేశం ఏనాడూ దూరంగా లేదు.

పాశ్చాత్య నాగరికతా ప్రభావంతో ఏర్పడిన సంక్లిష్టతను యథాతథంగా అంతే గాఢంగా స్పందించి ఎదురు తిరిగే పరిస్థితి లేకపోయినా అంతరాలు దాటాలన్న ప్రేరణా, జీవన అశాంతి నుంచీ విముక్తి పొందాలన్న తపన వల్ల తెలుగు కవిత్వం గడప దాటి రాగలిగింది.

అధివాస్తవిక తాత్త్వికతను అవగాహన చేసుకునే ధోరణి తెలుగు దేశంలో వున్నా అది తెలుగు కవిత్వంలో ఎందుకు విఫలమైందని విచారిస్తే ఈ కారణాలు తోస్తాయి.

కవులుగానీ పాఠకులుగానీ విమర్శకులుగానీ దానిపట్ల తగినంత శ్రద్ధ చూపకపోవడం.

అధివాస్తవికతను ప్రభావంగా తప్ప తాత్త్వికంగా అన్వేషించే ప్రయత్నం చేయకపోవటం.

అంతవరకూ భావకవితా ఊహల్లోనూ అభ్యుదయ భావాల్లోనూ ఆగిపోయిన వారు శ్రోతలు కావటం.

కవికీ శ్రోతకు మధ్య ఏక ప్రాతిపదికమీద నడప గలిగిన సృజనాత్మక శ్రోత (ఊహాత్మక దృష్టిలేని) వృద్ధి కాకపోవటం,

అలాంటి ప్రయత్నం తెలుగు కవిత్వంలో అంతవరకూ తీవ్రంగా ప్రారంభం కాకపోవటం.

స్వాతంత్ర్యానంతరం మెల్ల మెల్లగా విదేశాల సహాయంతో పెట్టుబడిదారీ విధానం వృద్ధి చెందడం, క్షుద్ర లౌకికమైన పాశవికపు లాభాపేక్షతో బుద్ధి హృదయం కుంచించుకు పోయే ధోరణీ, జీవిత విధానం మొదలుకావడం తెలుగు నేలపై అధివాస్తవిక కవిత్వం ఎంతో కాలం నిలవ లేకపోవటానికి కారణాలుగా కన్పిస్తాయి.

అంతే కాకుండా అధివాస్తవికతలోని యదార్థాన్నీ, లోతునూ భారతీయ శాస్త్రాల్లో దానికుండే సాదృశ్యాన్నీ, ప్రత్యేకతల్నీ, విభిన్నత్వాన్నీ విశదీకరించీ విమర్శించీ ప్రోత్సహించే విమర్శకులు నాడు లేక పోయారు. ఉన్నవారు శ్రోతల్లా సాధారణ పరిశీలన కలిగిన మేధో జీవులుగా మిగిలిపోయారు. లేదా నచ్చిన ఏదో ఒక సిద్ధాంతాన్ని కొలబద్ధగా మార్చుకొన్నారు. జీవితంలోని అన్ని మార్పులకూ ఆ కొలబద్ధనుంచే పరిష్కారాన్ని వేళ్ళ మీద లెక్కిస్తూ కూర్చున్నారు. అప్పుడే యాదృచ్ఛికంగా వెలుగులోకి వచ్చిన అధివాస్తవికతనూ, అధివాస్తవిక వ్యక్తీకరణలోని విభిన్న రీతుల్నీ ఎలా సమన్వయించుకోవాలో ఎలా గాఢంగా అనుభవంలోకి తెచ్చుకోవాలో, ఎలా జీర్ణించు కోవాలో తెలుగు కవులకుగానీ విమర్శకులకుగానీ అంతుపట్టలేదు. తెలుసుకొనేంతలోనే తెలుగు కవిత్వంలో తలుపులు మూత పడ్డాయి.

ఇంకా లోతుగా పరిశీలిస్తే భావకవిత్వానికి అలవాటు పడిన శ్రోతలు అభ్యుదయ కవిత్వాన్ని పూర్తిగా అవగాహనలోకి తెచ్చుకోక ముందే అధివాస్తవికం ప్రవేశించింది. ఇందువల్లకూడా అధివాస్తవికానికి ఆధునిక సాహిత్యంలో తగినంత స్థానం ప్రాధాన్యం లభించ లేదని చెప్పవచ్చు.

పాశ్చాత్య దేశాల్లో పరిస్థితి ఇందుకు భిన్నంగా కన్పిస్తుంది. అక్కడ అభ్యుదయకవిత్వం భావకవిత్వం మీద విప్లవంగా వచ్చింది. అభ్యుదయ కవిత్వం శ్రోతల అవగాహనలో స్థిరపడిన తర్వాత అధివాస్తవిక కవిత్వం ప్రవేశించటం వలన అక్కడి శ్రోతలకు అధివాస్తవిక ధోరణులను అర్థం చేసుకొనే సౌలభ్యం ఏర్పడింది. ఇక్కడ తెలుగు దేశంలో అభ్యుదయ అధివాస్తవిక కవితా ధోరణులు ఏకకాలంలో వచ్చాయి. అధివాస్తవిక కవిత్వం శ్రోతల ఆదరణ పొందలేకపోయింది.

ముఖ్యంగా ఒక కార్యం వెనుక ఒకే కారణం ఉంటుందన్న వాదన అంగీకార యోగ్యం కాదు. కనుక తెలుగులో అధివాస్తవిక కవితా ధోరణి పాశ్చాత్యులకున్న చారిత్రక నేపథ్యం లేకపోయినా తెలుగు సాహిత్యంలోకి అడుగుపెట్టగలిగింది.

తెలుగులో అభ్యుదయ కవిత్వం, అధివాస్తవిక కవిత్వం జంటగా రావటానికి ప్రధాన కారణం రెండూ భావ కవిత్వంపై తిరుగుబాటుకు ఉద్దేశింపబడటమే. శ్రీరంగం నారాయణబాబులో అభ్యుదయ దృష్టీ, అధివాస్తవిక తత్త్వం రెండూ ఉన్నాయి. భావ కవిత్వం పై తిరుగుబాటూవుంది, అయితే అభ్యుదయ కవిత్వం క్రమంగా ఊపందుకొని ఉద్యమం కాగలిగింది. అధివాస్తవిక కవిత్వం మరుగున పడిపోయింది. దీని గురించి ఇంకా పరిశోధించాల్సి ఉంది.

అధివాస్తవిక కవిత్వం తక్షణం అవగాహన కలిగించక పోవచ్చు. సమస్యలకు తక్షణం పరిష్కారం చూపలేక పోవచ్చు. అల్లే ఏదో ఆనందాన్ని అందించి వెంటనే వూహాల్లోకి జారుకునే మన స్థితిని కల్గించలేక పోవచ్చు.

అణచబడి చెలరేగుతున్న అధివాస్తవిక అనుభూతి ఏదో భావంలో, ఏదో సందర్భంలో, కవితా సామగ్రిలోని ఒక రంగుగా, ఒక కోణంగా ఆధునిక కవిత్వంలో అక్కడక్కడ తీవ్రంగా వ్యక్తమవుతూనే ఉంది. నగ్నముని గారన్నట్టు ఆనాడు కవుల చేతుల్లో అధివాస్తవికత నలిగివుంటే వచన కవితా నిర్మాణానికి సంబంధించి మేలు జరిగివుండేది.

నారాయణబాబు కవిత్వంలో ఇమేజరీ, సింబల్, వాస్తవికత అధివాస్తవితలో కరిగిపోయి కవిత్వం కొత్త రూపాన్ని ధరించింది. కొత్తరూపాన్ని సంతరించుకొన్న ఈ పద్ధతి తెలుగు కవిత్వంలో నాటినుంచీ నేటివరకూ ఏదో రూపంలో కొనసాగుతూనే ఉంది. దిగంబరకవులు అధివాస్తవికులమని చెప్పుకోకపోయినా అధివాస్తవిక ఛాయలు వారి కవిత్వంలో స్పష్టంగా గోచరిస్తాయి. తిలక్, బైరాగి, అజంతా, శేషేంద్ర, వేగుంట, ఇస్మాయిల్ మొదలైన వాళ్లు నారాయణబాబులోని అధివాస్తవికతనీ, అధివాస్తవిక కవితా రీతుల్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో కొనసాగిస్తూనే వున్నారు. ఈ నాడు కవిత్వాన్ని రాస్తున్న కొంతమంది యువకవులు ఈ బాటలోనే నడుస్తున్నారు. ఆ వారసత్వాన్ని అలాగే నడిపిస్తున్నారు. ఈనాడు వచన కవిత ఎన్నో ఎదురు దెబ్బలు తిని సాగి సాగి ఒక పదునైన కత్తిలా బాణంలా పఠిత హృదయాన్ని సూటిగా తాకుతూ, కరిగిస్తూ, ఆలోచింపచేస్తూ ముందుకు సాగుతోంది. ఈ శక్తికి నాటి పునాదులే కారణం అంటే అతిశయోక్తి కాదు.

అభ్యుదయ కవిత్వం క్రియాశీలత్వం నుంచీ దూరమై, నిస్తేజమై, నిర్వీర్యమై కేవలం సభలకు, సన్మానాలకు, రేడియోలకు మాత్రమే పరిమితమై పోయింది. నానాటికీ దిగజారిపోతున్న మానవ జీవితాన్ని పట్టించుకోకుండా స్తబ్ధుగావున్న సమయంలో

ఆంధ్ర దేశానికి షాక్ ట్రీట్‌మెంట్ ఇవ్వటానికి దిగంబర కవిత్వం సూటిగా ప్రశ్నించి దిక్కులను (దిక్‌లు) సూచించింది.

దిగంబర శకం, నగ్ననామ సంవత్సరం
ఆశఋతువు (సరిగ్గా క్రీ॥ శ॥ 1965 మే) న
ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరం
హైదరాబాద్‌న ప్రప్రథమంగా
దిగంబర కవులమని ప్రకటిస్తూ ఈ
ప్రాపంచిక ఆచ్ఛాదనల్ని చీల్చుకొని
కొత్త రక్తాన్ని ఇంజెక్టు చెయ్యడాని
కొస్తున్న నగ్నముని, నిఖిలేశ్వర్,
జ్వాలాముఖి, చెరబండరాజు,
భైరవయ్యా, మహాస్వప్నల గుండె
ల్లోంచి ధైర్యంగా స్థయిర్యంగా
దూసుకొచ్చిన కేకల్ని ఈ పేజీల్లో
పట్టుకోడానికి ప్రయత్నించిన
దిగంబర కవితా ప్రచురణ
సమర్పణ

"ఏం, ముసుగులు లేక పోతేనేం? స్వేచ్ఛగా అసలు స్వరూపంలో బతకడానికి ప్రయత్నిస్తేనేం?"[1] అన్నారు.

"దేన్నీ నమ్మకు, నీలోపల, ఈ ముసుగుల లోపల, యీ వంచన అంచుల కింద వున్న నీ అసలు స్వరూపాన్ని, నీ తనాన్ని నమ్ముకో, ఈ నాలుగు నిమిషాలూ హాయిగా బతుకు"[2] అంటూ

1, 2. దిగంబర కవులు : దిగంబర కవుల కవితా సంపుటి. పుట. 4

"ఏం భయం లేదు ఆ ఒంటరితనమే నీకు కవచం కానివ్వు. ఆ ఆడంబరాల వెనకవున్న నిన్ను ఒక్కసారి దిగంబరంగా చూసుకో. నీ ఎముకలు, నీభయాలు, నీ కన్నీళ్లు, నీ ఆందోళనలు, నీ సుఖం యివన్నీ నిజం. వీటన్నిటికీ అందనంత దూరంలో స్వచ్ఛమైన, సహజమైన, అజేయమైన నీ అసలు స్వరూపం వుంది. ప్రతి మనిషి లోనూ అతని అసలు స్వరూపం దీపంలా వెలుగుతూ వుంటుంది. తన స్వరూపాన్ని మరచి పోయి వికృతంగా ఈనాడు మనిషి పెరుగుతున్నాడు. కృత్రిమమైన ఆచ్ఛాదనల కింద దొంగలా బతుకు తున్నాడు"[1]

"నిజమైన అస్తిత్వం, భౌతిక ఆనందంతోపాటు, మనస్సును సర్వదా సచేతనం వుంచి అందరిలోను నిలబడి తనలో తాను జీవించడం"[2]

"సుఖాన్ని యిచ్చే సాధనాలు చివరికి ఆత్మను బంధించే సంకెళ్లుగా ఎదుట నిలుచున్నాయి"[3]

పై వాక్యాలన్నీ అధివాస్తవికత్వాన్ని యథాతథంగా కాక పోయినా దాని సారాన్ని పట్టిస్తాయి. దిగంబర కవుల అధివాస్తవి కతను పీఠికల్లో స్పష్టంగా గుర్తించవచ్చు.

పోతే నారాయణబాబుయొక్క అధివాస్తవిక ఛాయలు దిగంబర కవుల వ్యక్తీకరణలో కొన్ని చెప్పుకోవచ్చు. జీవితం లోని భయంకరత్వాన్నీ బీభత్సాన్ని, ఆవిష్కరించేందుకు, తీవ్ర మయిన ఎఫెక్టు కలిగించేందుకు, ఆయన కవితారీతి ప్రత్యేకంగా ప్రయత్నిస్తుంది. ఆయన అందమైన ప్రకృతి దృశ్యాల్ని జబ్బు

1. దిగంబర కవులు : దిగంబర కవుల కవితా సంపుటి. పుట. 15
2. 3. దిగంబర కవుల కవితా సంపుటి. పుట. 68

లతో రూపబద్ధం చేసి భావాన్ని సూచిస్తాడు. అంతేకాకుండా భీభత్స ప్రధానమయిన వ్యక్తీకరణ నారాయణబాబులోని ప్రధాన మయినకవితారీతి (లక్షణం). ఇదే ధోరణి దిగంబరకవులకు మార్గ దర్శకంగా (తెలిసికానీ తెలియకగానీ) ద్యోతకమవుతుంది.

"అణ్వహంకారంలో కావరమెక్కిన
అగ్రరాజ్య శ్వానాలకు, రెక్కలు నరికి
ఈకలు పెరికి, చూపాలనుంది
వాళ్ల పాడవులకు, కుళ్లి పురుగులు పడ్డ
ఈ శతాబ్దపు కాంగోదారుణ వ్రణాన్ని,
ఎన్నటి పచ్చని ఆఫ్రికా ఖండాన్ని"[1]

-సూర్యస్నానం

"డాఫర్ మచ్చను మేకప్ చేసుకొని
వెన్నెల నేపథ్యగానంతో విలాసంగా చంద్రుడు
ఆకాశాన్ని పాలిస్తున్నాడు.

... ... ...

చీడ పురుగులు నిండిన మేడి పండ్లతో
భూమి వెలయాలై, పతితై, భ్రష్టమై
పుచ్చి గబ్బు కొడుతున్నప్పుడు
నేను పుడుతున్నాను దిగంబర కవిని"[2]

-గ్లానిర్భవతి భారతి

నీ చుట్టూ విషకీటకాలు నిర్జరాణ్యాలు సంచరిస్తున్నా
నీ ఒంటినిండా పలుకుబడి రసి కారుతున్నా
నిన్ను ప్రేమిస్తాను
నిన్ను మంచితనంతో భయపెడతాను
నీ బూమికల్ని హడలగొడతాను

1 జ్వాలాముఖి : సూర్యస్నానం, దిగంబర కవుల కవితా సంపుటి. పుట. 9
2. మహాస్వప్న : దిగంబర కవుల కవితా సంపుటి. పుట. 21, 22

నీ కలల్లో కల్లోలం రేపుతాను[1]

-సుఖరోగి

నడుస్తున్న చెట్లమీద గుసగుసలాడే ఆకులు
జడుస్తూ తూలుతూ కునుకుతున్న వ్రణాలపై
వాలేకాకులు
ఆకారంలాగే వికారంగా వాంతి చేసుకొనే వీధులు
నగరం మూపుమీద వాపుమీద పెద్దల విగ్రహాలు[2]

-దాహం

దిగంబర కవిత్వంలో అక్షరాలు
కామంతో పుచ్చిపోయిన
లతాంగి పయోధరాలపై
నూతన నఖక్షతాలు కావు[3] -దిగంబరి

"భావకవిత్వం మీద తిరుగుబాటుగా వచ్చిన అభ్యుదయ కవిత్వానికి చైతన్యం పర్యవసానం. కానీ అందులో రూపొందిన వచన పద్యాన్ని అనుభూతి పర్యవస్థాయి అయిన కవిత్వానికి వాడుకున్నారు కొందరు. ఇందుకు తిలక్ మార్గదర్శి"[4] అన్నారు వెల్చేరు నారాయణరావుగారు. కానీ ఆ మార్గానికి మార్గదర్శి నారాయణబాబే అని ముందు జరిగిన పరిశీలన ద్వారా అవగాహన ఏర్పడుతుంది. తిలక్, ఇస్మాయిల్, అజంతా, వేగుంట మోహన్ ప్రసాద్, బైరాగి, ఇప్పుడిప్పుడు వస్తున్న యువకవులు ఈ కోవలోని వారే.

1. నగ్నముని : దిగంబర కవుల కవితా సంపుటి. పుట. 25
2. ,, ,, ,, 50
3. భైరవయ్య : ,, ,, 14
4. నారాయణరావు, వెల్చేరు: తెలుగులో కవితా విప్లవాల స్వరూపం,పుట 186

"మంత్రలోకపు మణిస్తంభాలు
నా కవితా చందనశాలా సుందర చిత్ర విచిత్రాలు"
అధః పాధా పాధః పతంగాలు
ధర్మవీరుల కృత రక్తనాళాలు
... ... ...
నా కళా కరవాల దగద్ధగ రవాలు'[1]

—నా కవిత్వం

"ఎందుకు రాస్తున్నానంటే ఏం చెప్పను ఎవరికి చెప్పనిపుడు
గోడమీద బల్లి విసుగ్గా వెళ్లిపోయింది ఫెరిస్ మొక్క
నిద్రపోయింది
ఆకాశం నక్షత్రాల్ని జారవిడిచి అంతఎత్తుకు ఎగిరిపోయింది
నా చుట్టూ వున్న తెరలు జారిపోయి నాకు నిజంగా మెలకువ
వచ్చింది
కిటికీలోంచి శిసురుర్తు క్షీణ చంద్ర రేఖ గిలగిల్లాడినట్టు
వట్టి కనిపించింది.[2]."
—నేను కాని నేను

'అనాన, కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం
చెయ్యాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని చల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి'[3]

1. బాలగంగాధర తిలక్, దేవరకొండ : అమృతం కురిసిన రాత్రి పుట. 7
2. " " 67
3. " 78

పై గీతాల్లో తిలక్ తత్త్వాన్ని గుర్తించవచ్చు. ఆంతరిక పరిధుల్ని విస్తృతం చేసుకొని అధివాస్తవిక లోతుల్లోకి సాగించే ప్రయాణం నారాయణబాబు కంటే భిన్నమైంది. జీవితంలోని బీభత్సానికి, భయంకరత్వానికి కూడా అందమయిన రూపం ఇవ్వడం ఇందులోని ప్రత్యేకత. అయితే అభ్యుదయ కవులు మరచిన సాహిత్య విలువల పట్ల శ్రద్ధ విషయంలో నారాయణబాబుకు తిలక్‌కు (కవిత్వంలో) ఎక్కువ సామీప్యత కనిపిస్తుంది.

"ఆధునిక కవిత చర్చనీయాంశ మయేటప్పుడు కవి తన భావోద్రేకానికి ప్రతీకను మాత్రమే సమకూర్చగలడని తెలుసుకోవలసి ఉంది. సమకాలీన చైతన్యం మలుపులు తిరుగుతూ మెలికలు తిరుగుతూ దినదిన ప్రవర్ధమాన క్లిష్టతను సంతరించుకొంటోంది. పదాల కతీతమైన పారవశ్యాన్ని ప్రతి పదార్థ శృంఖలాల్లో బంధించడానికి ప్రయత్నిస్తే అది వ్యర్థ ప్రయత్నం మాత్రమే అవుతుంది,[1]" అని రోణంకి అప్పలస్వామిగారు వేగుంట మోహన్ ప్రసాద్ గారి 'చిత - చింత' కావ్యానికి రాసిన పీఠికలో వెలిబుచ్చిన అభిప్రాయాలు నారాయణబాబు కవిత్వాన్ని తళుక్కున గుర్తుకు తెస్తాయి. అదీగాక వేగుంట మోహన్ ప్రసాద్‌లో ఉన్న అధివాస్తవిక ఛాయలు నారాయణబాబు మార్గాన్ని గుర్తుకు తెస్తాయి ఇందుకు ఉదా॥లుగా కొన్ని పాదాల్ని చూడవచ్చు.

1. అప్పలస్వామి, రోణంకి : "వచన కవిత" చితి - చింత - పీఠిక పుట. XXXVIII

మౌనశంఖం

ఉదా॥

గది
గదిలో శవం
క్షణ క్షణానికి ఉబ్బి విశ్వవ్యాప్తమవుతోంది
బయట గోళ్ళెం
రాత్రి కుక్కలూ నక్కలూ శబ్దాలూ
ఏ కాక్షి శవం
పేపర్ వెయిట్ లాంటి కన్ను
కుళ్ళిపోయిన చూపుల వాసన
శవం
మైనంలో మలచి నీళ్ళల్లో ఉంచిన శిల్పం
కాష్ఠంలో కాలే కొవ్వొత్తి
శవాన్ని
తొక్కినా నొక్కినా ఏమీ అనదు
కానీ మనకే భయం, ఒళ్ళు గగుర్పొడిచి
శవం
పళ్ళెంలో వుంచి కోసేందుకు

వెల్లకిల పడుకున్న శవం కిలకిల నవ్వుతూ
నా వెన్నుపూస వీణ మెట్టు మెట్టునా ప్రాకిన భయం
చూరువంక చూస్తోన్న శవం చీలికల చూపుల్తో
వెళ్ళబెట్టిన నాలికతో గారబట్టిన పళ్ళతో

... ... ...

... ... ...

బొట్లో కుట్టించిన కుమ్మరి పురుగు కుట్టిన తీపి
వశీభూతం శవం భూతం.[1]

-విభూతి

ఉదా॥ 2

వస్తుగతం కాని కవితకి భావం బలం
కేవలం భావంలో భావం
అధివాస్తవిక విచారమే అవ్యక్తం
అగమ్య గోచరమ్
గమ్యమేలేని జానేదేవ్ గాలి
వ్యక్తా వ్యక్త చరమ చరణమ్

... ... ...
... ... ...

కరుచుకుపోయిన బల్లిలా గోడకు
నిచ్చెన ఉంటుందిగాని తీరా ఎక్కే
వాడెవ్వడు ?
వస్తువు లేక స్వీయాత్మ లేకనే
నేననటం
పోనిస్తూ
పెద్ద బాధా లేదని
*వాక్యుయస్ బల్లి ప్రతాపంలో-రక్తం స్రవిస్తున్నా[2]

-నిరీహ

---

1. మోహన్‌ప్రసాద్, వేగుంట ; చితి - చింత. పుట. 54
* Vacus = Suggesting absence of thought
(ఈ కవిత చెప్పేదిదే)
2. మోహన్‌ప్రసాద్. వేగుంట : చితి - చింత పుట. 3.

తెలుగు కవుల్లో అధివాస్తవిక తత్త్వం భిన్న భిన్న లక్షణాలతో, రూపాలతో వ్యక్తమవుతోంది. వేగుంట మోహన్ ప్రసాద్ గారి అధివాస్తవిక వ్యక్తీకరణ ప్రత్యేకంగా ఉంటుంది. అంతే కాకుండా ఆయన అధివాస్తవిక ధోరణి జీవన నిరాకరణ.[1]

నారాయణబాబును చక్కగా గుర్తుకు తెచ్చేవాడు బైరాగి. ఇద్దరికీ చాల విషయాల్లో సామ్యాలున్నాయి, ఇద్దరిదీ లోకానికి వెంటనే అర్థం కాని అన్వేషణ. ఇద్దరూ ఆప్తమిత్రులుకూడ.

ప్రగల్భ నిరీక్షణతో నిండిన, పండిన ఈ
నిశ్శబ్దంలో
వేచియున్న వాడె
ప్రతి ఒక్కడు
మార్పు కొరకు
తీర్పు కొరకు
ఓర్పు గలిగి
చరమ ఘంటారావం కొరకు
తప్పిపోయిన భావం కొరకు
ప్రతి మనిషీ ఒక గదిలో
చెదపురుగులు ప్రతి మదిలో
ప్రతి మనిషీ ఒక నదిలో
సుడిగుండం ప్రతి ఎదలో
ప్రతి మనిషీ ఒక చెరలో
ఉరికంబం ప్రతి హృదిలో

1. "జీవన నిరాకరణ? "అమ్మో, అయితే ఇది నా కర్థంకాదు" రమణారెడ్డి, కె.వి ; సహవాసికి స్వాగత వచనాలు, చిత - చింత పుట XvIII

మరమేకులు ప్రతి ఎదలో
... ... ...
... ... ...
... ... ...
ఉన్నది ప్రతి హృదిలో గోరీ ఒకటి
పాడె ఒకటి, పుట్టె ఒకటి
పది కొమ్మల మర్రి ఒకటి
... ... ...
... ... ...
... ... ...
... ... ...
త్రోవ మరచిన ప్రేతంలాగ
దిక్కులేని కుక్కలాగ
తిరుగుతున్నా, తిరుగుతున్నా
చీకటిలో చీకటిలో
నే నెరిగిన ముఖ మెక్కడ ?
(ఎరిగిన సుఖమే దుఃఖం)
నే నెరుగని సుఖ మెక్కడ ?[1]

—నూతిలో గొంతుకలు

రక్తంకాదు కరాళ కాలకూటం దేహంలో
మానవజాతి ఆర్జించిన సిఫిలిస్ నీ వారసత్వం[2]

— నూతిలో గొంతుకలు

---

1. బైరాగి : నూతిలో గొంతుకలు పుట. 5, 6
2. " " " 15

కాదు. అదే ఒక పరిశోధనాంశం అయితే తప్ప తేల్చటం కష్టం. అదీగాక ఆయా కవులయొక్క కవితా తత్త్వం గురించి వారు వెలిబుచ్చిన అభిప్రాయాల్ని, నిర్వచనాల్ని, వారి మొత్తం కవిత్వాల్ని పరిగణనలోకి తీసుకునేటేనే లోతుగా, స్పష్టంగా చర్చించేందుకు సాధ్యమవుతుంది. ఒక శేషేంద్రశర్మగారి వరకూ దొరికిన విషయ జ్ఞానాన్ని అధారం చేసుకొని అధివాస్తవికతకు సంబంధించి ఆయన ప్రతిస్పందనల్ని క్లుప్తంగా తెలియ చేస్తాను.

అధివాస్తవికత పట్ల మనస్ఫూర్తితో కూడిన ఆహ్వానం లేనట్టు తెలుస్తోంది. అడ్డుకునే ప్రయత్నం (ఆయనకు తెలిసో తెలియకో) ఆయన "కవిసేన మ్యానిఫెస్టో"లో కన్పిస్తుంది. ఆ విషయం క్లుప్తంగా చర్చించటం కొద్దిగా అవసరమే.

"ఆత్మ అనే మహా సముద్రం ఏదయితే ఉందో దాని క్రియాత్మకచర్యలే యావన్మానవీయ నిర్మాణాలు. కవిత ఆ నిర్మాణాల్లో ఉచ్ఛకోటికి చెందినది. కనుక ఈ అంతర్గత చైతన్య సాగర ఘోష వినడమే కవి సాధన."* అన్నంత వరకూ ఆయన స్పష్టంగా అర్థమవుతారు. అంతేకాదు, కవిత్వానికి మూలమైన ఆవేశాన్ని సూచించారు. ఆ తరువాత "చైతన్య సాగర రహస్యానికి తాళపుచెవి అనుభూతి. అయితే కవికి కావల్సినది రూపక అనుభూతి. అంటే వెనక వర్ణించిన సచేతనంగా, సబుద్ధికంగా సంకల్పసహితంగా జీవితాన్ని ఆచమనం చేయడం అనే అనుభూతి ఇక్కడ కావాలి. మరి ప్రశ్న ఏమిటంటే ఈ సచేతనత్వం, బుద్ధి పూర్వకత్వం, సంకల్పం, సహితత్త్వం అనే దశావిశేషం ఎలా సంభవిస్తుంది? అనుభూతిని చైతన్యసాగర రహస్యోద్ఘాటనా సమర్థం చేయడానికి ఉత్పన్నత అనివార్యం. లేక పోతే అనుభూతి సాధా

* 'కవిత్వం ఆత్మకళ'_కవిసేన మానిఫెస్టో

రణ అనుభూతి అయి వట్టి మట్టిముద్దలా పడివుంటుంది. కనుక పండితుడు కానివాడు కవి కాడు అని సిద్ధాంతం"*అన్నారు శేషేంద్ర గారు. ఇలా ఆత్మీకరణ ప్రక్రియను ఆత్మకళా భ్యాస ప్రక్రియను ఏకం చేసి ఆత్మ కళా భ్యాస ప్రక్రియ ఆవశ్యకతను బోధించినప్పుడు ఎక్కడో దారి తప్పించి మాట్లాడుతున్నట్టు స్పష్టంగా అన్పిస్తుంది. ఉత్పన్నత యొక్క సహాయాన్ని ఆ పదానికి ఆయన ఇస్తున్న అర్థాన్ని త్రోసిపుచ్చికానీ, అపార్థం చేసుకొని కానీ ఇలా మాట్లాడటం లేదు.

ఆత్మీకరణ ప్రక్రియకు అంతర్గత చైతన్య సాగరఘోష (బాహ్యాంతరాల) వినడమే సాధన. ఆత్మకళాభ్యాసంలో సచేతనత్వం, బుద్ధి పూర్వకత్వం, సంకల్పసహితత్వం అనే దశా విశేషానికి ఉత్పన్నతను మూలం (చిన్న అంశంగా కాక) చేశారు. పోతే అనుభూతిని చైతన్య సాగర రహస్యోద్ఘాటనా సమర్థం చేయడానికి ఉత్పన్నత (లోకానుభవం, అధ్యయనం) ప్రాధాన్యతను చోటు చేసుకోవటం (ఆయన ఉదహరించి మరచిన సూత్రం-యస్య సర్వాని భూతాని, ఆత్మన్యేవానుపశ్యతి సర్వభూతేషు చాత్మనంతతో విజుగుప్సతే) ఆత్మీకరణ ప్రక్రియకు దూరం చేస్తుందని తెలుస్తోంది. అందుచేత, ఆత్మీకరణ ప్రక్రియలో కనిపించే నిసర్గ మనోజ్ఞత ఆకర్షణ కవిత్వంలో పలచబడుతూ వస్తుంది. ఒక దశలో యాంత్రికంగా అచ్చుపోసే కళాసృష్టిగా మారుతుంది. అంతేకాక, అసహజ కల్పన, స్పర్శజ్ఞానం లేని సౌందర్యంతో కవిత్వం మరుగునపడిపోతుంటే కవి విభిన్న రూపాల్లో కొట్టొచ్చినట్టు ముందుకు వచ్చే ప్రమాదం వుంది. నిసర్గ మనోజ్ఞత, ఆకర్షణ, అసహజ కల్పన, కృత్రిమత్వం లాంటి సాహిత్య పరిభాషకు

---

* కవిత్వం ఆత్మకళ : కవిసేన మానిఫెస్టో

సాహిత్య పరిధిలో నిర్దుష్ట భావనాపరమైన పరిశోధన జరిగితే విమర్శలో సాలభ్యాన్ని సాధించటానికి అవగాహనలో నిర్దుష్టతకు వీలవుతుంది.

పోతే ఆయన అనుకున్నట్టు తెలుగుదేశాని లేనిది ఉత్పన్నత కాదు. ఆయన పరిభాషలోనే చెబితే సమాధి స్థితి. అంటే సృజనాత్మక స్థితి. దాన్ని భారతీయాలంకారికులు కొందరు ప్రధానంగా గుర్తించినా వారిలోనే దానిపట్ల స్పష్టమైన అవగాహన అనుభవం అందరిలోనూ లేదనిపిస్తుంది. బహుశా, వారు సమాధి స్థితి విలువను గుర్తించినా అనుభవంలోకి తెచ్చుకొని నిలుపుకొనే ప్రయత్నం తీవ్రంగా చేయలేదేమో అనిపిస్తుంది.

ఆధునిక వచన కవితా ప్రక్రియలో తనదంటూ ఒక బాణీని నిరూపించు కొంటున్న కవి కె. శివారెడ్డిగారి కవిత్వాన్ని పరిశీలిద్దాం.

ఉదా॥ 1

సర్పపంజరాల్లో ఒదిగిన చీకటి
వీధి వీధినా విలయ నృత్యం చేస్తుంది
అర్థ చంద్రుడు
భీతావహ పాదాల కింద తుంపులౌతున్న
గాజు ముక్క
వికృత ముఖమృత శిశువు పాలచంద్రుడు
ప్రత్యక్షమౌతాడు[1]

—సర్ప పంజరం

1. శివారెడ్డి, కె. భారమితి, పుట. 24

ఉదా॥ 2

ఓ హైద్రాబాద్ నా హైద్రబాద్
నువ్వొక నల్లని భయంకరమైన జంతువ్వి
చెదిరిపోని చీకటి కొండవి
కంటినీరు నీలిమేఘంగా ఏర్పడ్డ సాగరానివి
నువ్వొక పాతకోటవి, ఖరీదైన బురుజువి
నిత్యహరితశ్మశానానివి
నీ గర్భాంతర కుహరాల్లో ఒక ఆకుపచ్చని చెట్టుకోసం
నేనహర్నిశలూ పరిశోధిస్తున్నా
నువ్వొక అందమైన ఆడదానివైతే
నీ మేనిరమణీయ సౌందర్య పరిమళాలనావాహ చేయదల్చి
కానీ
స్వర్గ నరకాల్ని రెండు కళ్ళల్లో కీలించుకున్న
నువ్వొక పెద్ద బూటకపు లంజవి
నువ్వొక మాతృమూర్తివైనా కాదే
నువ్వొక భ్రూణ హత్యవి[1]

-హైద్రాబాద్

పై పాదాల్లోని తీవ్రమైన వ్యక్తీకరణ ఛాయలు పరోక్షంగా నయినా నారాయణబాబు కవితాలక్షణాల్ని గుర్తుకు తెస్తాయి.

'బాధాగ్ని కుసుమాన్ని ఆఘ్రాణిస్తున్నప్పుడే
క్షణాల మధ్య అగాధంలో స్వప్న చక్షువులకు నిషా

వైరుధ్యాలను వెన్నెముకగా ధరించిన నేను

1. శివారెడ్డి, కె. భారమితి, పుట.

ప్రపంచానుభూతిలో స్వీయానుభూతిని జోడించటం,[1] కవిత్వంలో జీవితంలో పూర్ణత్వాన్ని సాధించాలనే ప్రయత్నం[2] నారాయణబాబు కవిత్వానికి, తాత్వికంగా దగ్గర చేరుస్తుంది. అయితే బైరాగి, నారాయణబాబు ఇద్దరూ ఇద్దరే. ఎవరికి ఎవరూ అనుకరణ కాదు, ప్రతిధ్వనులూ కాదు.

ఇస్మాయిల్‌గారు అధివాస్తవిక తాత్వికతకు దగ్గరగా వచ్చారు, అంతేకాకుండా భావచిత్రాల్లో సింబల్స్‌తో కవిత్వాన్ని సంక్షిప్తీకరించటంలో ఎంతో గాఢమైన సామీప్యత నారాయణబాబుతో కనిపిస్తుంది. కాని ఇస్మాయిల్‌గారు ఇస్మాయిల్ గారే. విస్తరణభీతి చేత భావచిత్రాల్ని ప్రత్యేకించి పరిశీలన చేయటం లేదు.

ఉదా॥ 1

తరు చాపము వీడిపోయి
గురిమరిచిన బాణంలా
తిరుగాడును పిట్ట

1. ప్రపంచాను భూతిలో స్వీయానుభూతి పరమైనప్పుడే ఉత్తమ కవిత ఉద్భవిస్తుందని నా విశ్వాసం —బైరాగి
2. 'హేమ్లెట్, అర్జునుడు, రాస్కాల్నికోవ్' సంధిగ్దావస్థలో ఒక క్రమబద్ధమైన పరిణామాన్ని సూచిస్తున్నారు. హేమ్లెట్‌వేదన కర్మపూర్వం. అర్జునుడి వేదన కర్మ క్షేత్రంలో తక్షణికం. రాస్కాల్నికోవ్‌బాధ కర్మ తరువాత. కాని ముగ్గురి బాధ ఒకే స్థాయిని అందుకొంటుంది. అది మానవుని సహజ వేదన. అతన్ని త్రికాలాల్లోనూ వెంటాడుతుంది. ఆ బాధలో మధనపడనివాడు పూర్ణత్వాన్ని అందుకోలేడు. ఆ బాధనుంచి అతను తప్పుకునే మార్గం లేదా—అంటే ఉంది. —బైరాగి
బైరాగి : తొలిపలుకు, నూతిలో గొంతుకలు పుట ii

ధరణీ గుట్టు తెరవబోయి
బిరడాలో ఇరుక్కున్నా
ఇరుక్కున్న పురుగు.
పురుగుసగం, సగంపిట్ట
ధరను-చొచ్చి, దివిని విచ్చి
విరులు తాల్చు తరువు.[1]

—చెట్టు నా ఆదర్శం

ఉదా॥ 2

చిటపట ...
చీకటి పుటలో చినుకు బంతులు
బంతులన్నీ అదేమాట
అంతుమరచి అంటాయి
ఎందుకయ్యా ఈ పునరుక్తి
ఎవరిదీ కుయుక్తి ?
అకటకట
అర్థరాత్రి సొరంగంలో
ఆగబోని అడుగుల సడి.
దేనినించీ పలాయనం
దొరకదా ఇక విమోచనం ?
... ... ...
అకటకట
వికట ప్రతిబింబాల
అద్దాల చెరసాల

1. ఇస్మాయిల్ : చిలకలు వాలిన చెట్టు, పుట. 134

బందీని నేను
బందిఖానాని నేను[1]
—ఎందుకయ్యా వుంచినావూ బందిఖానాలో

రియలిజం, ఫ్యూచరిజం, నాచురలిజం, దాదాయిజం, ఇమేజిజం, సింబాలిజం మొదలైనవి సాహిత్య ప్రపంచంలో దుమారాల్లా లేచాయి, ఇవి అధివాస్తవిక పునాదుల్ని వెతుక్కోవటంలో తమ అస్తిత్వాలను కోల్పోయి నూతన కోణాల్లో, నూతన రీతుల్లో చీల్చుకొచ్చిన కొమ్మల్లా మిగిలిపోయినట్టు తోస్తాయి. తెలుగు కవిత్వంలో దీన్ని చూడవచ్చు.

ఉదా॥ 1. "ఒక గీతిక స్వాధీనం చేసుకొంది రాత్రి బోధించే ఏకాంత పాతాన్ని, మానవ నాగరికతా ఆదిమ సీమల్ని-

అవ్యక్త భవిష్యద్వ్యాపినాంతరాల్లో అదిగో లేస్తోంది భయంకర ఆకార రేఖ – గొరిల్లా . . . [2]

ఉదా॥ 2.

"నా భావంలో భూకంపం పుట్టింది; శబ్దాల గుండెలు పగిలి ప్రవహిస్తున్న ఆగ్నేయ రక్తంలో మనుషుల నాల్కలు తేలుతున్నాయి. ఈ శబ్దాల చెత్తంతా చీపుర్లతో చిమ్మివేయండి. అప్పుడు ప్రత్యక్షమవుతుంది. పేజీల మీద శుభ్రంగా నా తెల్లటి గొంతుక.[3] —గీతిక

ఉదా॥ 3

'మనం ఆయువుకోసం పీల్చే వాయువులో/హాహాకారాలు పోసింది. ఈ యుగం/బలవంతాన చేతి కిచ్చిన విషపాత్రిక ఈ జగం'[4] —రాలే ఆకులు

---

1. ఇస్మాయిల్ : చిలకలు వాలిన చెట్టు పుట. 144
2. శేషేంద్రశర్మ, గుంటూరు : గొరిల్లా పుట 1
3. శేషేంద్రశర్మ, గుంటూరు : గొరిల్లా పుట. 4
4. „ „ మండే సూర్యుడు, పుట 56

మనిషి అంతరాంతరాళాల్లో అణచబడి ఉండిపోయిన ఒక నూతన స్వరూపాన్ని గుర్తించి శేషేంద్రశర్మగారు అహ్వానించినట్టు ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిరిగారు 'గొరిల్లా' కావ్యానికి రాసిన పీఠికలో వివరించారు.[1]

వ్యక్తావ్యక్తంయొక్క ప్రాధాన్యాన్ని గుర్తించిన కవుల్లో ఆయన కూడా ఒకరే. 'నీరై పారిపోయింది' వ్యక్తావ్యక్తం పునాదిగా సాగిన కావ్యమని' కవిసేన మానిఫెస్టో'లో వారు సూచించారు. ఆ కావ్యం దొరక్కపోవటం వలన పరిశీలించటానికి వీలు లేక పోయింది. ఆయన ఇతర కావ్యాలు అందుబాటు లేకా, విస్తరణభీతి చేత వస్తురీత్యా, అభివ్యక్తీకరణలో, నారాయణబాబుతో ఆయనకున్న సామ్యాల్ని ఇంకా లోతుగా వివరంగా చూడడం వీలుకాలేదు.

ఇతర కవుల్ని అధివాస్తవికత యొక్క మౌలిక స్వభావం నుంచీ పరిశీలించటం అంత సులభంకాదు. వారిలో ఉన్న అధివాస్తవికతత్త్వానికీ అప్పటికే సిరపడిపోయిన ఇతర తత్త్వాల సమ్మేళనాలకు మధ్యవున్న వైరుధ్యాల్ని గుర్తించి విడదీయటంకూడా అంత సులభమేమీ కాదు. అధివాస్తవికతను సరికొత్తగా మార్పు చేర్పులతో గౌరవనీయంగా రూపొందించుకున్న అస్తిత్వవాద రూపాల్ని విశ్లేషించడం ఇక్కడ సాధ్యంకాదు. ఇది పరిధికూడా

---

1. The ape man, be it the Neyan derthal, paleo-lithic Heidellberg, or the Javaness these ancient raw men contained in their Veins a light of devinety. The obverse of this Modern Anthropological concept is the concept of Narasimha Avathar of Ancient Indian Mythology.
–శ్రీమతి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిరి, ముందుమాట 'గొరిల్లా'

దూరంగా విన్పిస్తున్న రైలుకూతలో
ఒక ఒంటరి కేక నన్ను పిలుస్తూవుంటుంది.
గాలి నా నుదుటి మీది చమటనీ
గుండె కొట్టుకోవటాన్నీ
నరాల్లో వెల్లుబికే సముద్ర ఘోషనీ
రక్తంలోన మనసు తపతప కొట్టుకోవటాన్నీ
చిక్కుకు పోయిన నరాల తీగల్లో విన్పించే
భయంకర నృత్య సంగీతాల్నీ పెడబొబ్బల్నీ
నిశ్శబ్దంగా రికార్డు చేస్తూ
రూములో అటూ ఇటూ పచార్లు చేస్తూ
వుంటుంది[1]

—ఒంటరితనం

నేటి యువతరం కవుల్లో పరోక్షంగా మెల్లమెల్లగా కమ్ము కుంటున్న అధివాస్తవిక మేఘాల్ని స్పష్టంగా చూడొచ్చు.

ఉదా॥ 1. 'మేఘాలు పేగుల కుప్పలై, పెరికార్డియం పొరలై,
కాళ్లై, కాలేయాలై వేళ్లాడతాయి –
భయంగా కొమ్మలవెనుక దాక్కున్న కనుగుడ్డై
చంద్రుడు
ఊడబెరికి పారేసిన ఊపరితిత్తులై
ఊగుతాయి చెట్లు–
కనుగుడ్డు నుండి వెన్నెల కరిగిపోయిన మెదడై
కారుతుంది.

1. సుమనశ్రీ : రెప్పల మధ్య ఆకాశం, పుట. 84

ఎముకల్లేని శరీరమై ఏహ్యంగా కదుల్తుంది సముద్రం
ప్రాణమున్న నరాలై పాములు చెవుల పుట్టల్లోకి
దూరుతాయి.[1]
—సంధ్యాభీభత్సం

ఉదా॥ 2. ఎక్కడో గానంలో
ధ్యానంలో
ఆకాశయానంలో నీ అస్తిత్వం
ఈ తపస్సు ఫలించి
ఈ తమస్సు జ్వలించి
నా చితాభస్మాన్ని, నీ చింతనా సముద్రంలో
నిమజ్జనం చేయగలిగితే!
నా ఆత్మ దీపం
నీ స్మరణ కిరణాల్ని ప్రసరిస్తే
ఓహో......
ఇక్కడెవరో మాటల్ని
మాయం... చే... స్తు... న్నా... రు[1]
—తాదాత్మ్యం

ఉదా॥ 3. గడ్డకట్టిన నెత్తుటి నీడల్ని మింగిల్చి
వస్తుకళేబరాల్ని వదిలి పెడుతుంది.
అచేతన ప్రతిబింబాల్ని పుట్టిస్తుంది.
దీపం నియంత!
దీపం హంత![2]
—దీపం మర్రిచెట్టు

పై పాదాల్లో అధివాస్తవిక భీభత్స చిత్రణ కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. అంతేకాకుండా సౌభాగ్య అధివాస్తవిక తాత్త్వికతను వెతుక్కునే ప్రయత్నంగా పై ఉదా॥లు నిలుస్తాయి.

1, 2, , సౌభాగ్య : సంధ్యాభీభత్సం, పుటలు. 40, 4, 29.

మినీ కవితల్లో సైతం అధివాస్తవిక చిత్రీకరణను చూడ వచ్చు. అయితే ఇప్పటి పరిధి విస్తృతమయినందున మాని వేస్తున్నాను.

ఇంతవరకు క్లుప్తంగా వివరిస్తూ ఉదహరిస్తూ వచ్చిన కవిత్వాల్లో అధివాస్తవిక ధోరణులను, లక్షణాలను మాత్రమే చూపివిచటం జరిగింది. వాటి మంచి చెడ్డలు, లోతులు తీవ్రతలు, ప్రేరణలు, వైరుధ్యాలు, స్థాయీ భేధాలు, వ్యాఖ్యాసాలు చర్చించటానికి ఇది భూమిక కాదు. కవుల సంస్కారాలు, దేశ కాల పరిస్థితులు, అన్వేషణాతీరుతెన్నులు, చిత్తశుద్ధి – ఇవే అధివాస్తవికతయొక్క సృజనాత్మకతను, ప్రమాణాన్ని, లోతుల్ని నిర్ణయించగలిగేవి. వాటిని ఏదో కొంతమేరకు నారాయణబాబు కవిత్వ లక్షణాలతో పోల్చి చూపటానికి ప్రయత్నం జరిగిందను కుంటున్నాను. అల్లే ఇతరకవులతోనూ పోల్చిచూడడం జరిగింది.

నాయుడిగారి సంగీతంపై నారాయణబాబు రాసిన గీతంలో సత్యముందోలేదో తెలియదుగానీ అందులో కవిత్వానికి ఉండాల్సిన పునాదులు ఏవో సూచించేందుకు (ఆ పాదాలు ఎంత పచ్చి సంప్రదాయ వాసనకొట్టే పదాలలో వున్నా) ముఖ్యంగా నారాయణ బాబుయొక్క విచక్షణా దృష్టిని చూపించేందుకు క్రింద ఉదహరిస్తూ ముగించటం జరుగుతోంది.

'సృష్టి
శృతిమయం
సుగుణం నాదం
నిశ్శబ్దపు నిర్గుణ బ్రహ్మ
నీలి నీలి
అంచులనే
ప్రమోగించును'

ఎడారిలో వానజల్లు రహస్యాన్ని ఏనాడో
మౌనంగా స్వీకరించాను
కాలం మరెవరో కాదు నేనే
క్షణ క్షణం సహార క్రీడలో గతం వర్తమానం
ఉదయాస్తమయాలు
ఉన్మత్త క్షేత్రాలలో రాక్షసుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
... ... ...
క్షణ క్షణ బీభత్సాలు నా అలంకారం
ఎర్రదీపాలే జీవన సామగ్రి
... ... ...
బాధ నా ముఖ చిత్రం
బాధాగ్నిలో పునీతుడైన మనిషి పాదధూళిలో
మరణానంతరం నేను పాడే స్వేచ్ఛా గీతాన్ని
రచిసాను
అప్పుడే నా అక్షరాలకు నిషా

అగ్నివృక్షం క్రింద రేపు నేను మరో మనిషిని[1]
–అగ్నిస్పర్శ

ఉదా॥ 2
మిత్రుడు వెంకట్రావు నిరుద్యోగి అని
రూఢిగా చెప్పుకోవచ్చును
తలక్రిందులైన స్వప్నం మీద శల్యాకారంగా
కూర్చున్న కుర్రవాడు

1. అజంతా : ఈతరం యుద్ధ కవిత, పుట.

ఆ పావమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకం మచ్చలు
కళ్లలో శిలావిగ్రహాలు వీక్షణాలు
అతని చుట్టూ పరాజయ భారంతో కృంగుతున్న వృక్షాలు
ఇదే దృశ్యాన్ని ఇంకా ఉద్వేగ్తున బూతద్దాలతో
చూడవచ్చు
విశాల వినీల గగనాల క్రింద విషాదాగ్ని ఆవిర్భావాన్ని
కళ్లారా చూడవచ్చు
మిత్రుడు వెంకట్రావు ఎక్కడ ఏ భంగిమలో తననితాను
ఒలుచుకొని తింటున్నాడో ఊహించుకోవచ్చు
—చెట్లు కూలుతున్న దృశ్యం[1]

తెలుగు సాహిత్యంలో తొలినుంచి తనదైన వ్యక్తిత్వంతో, శైలితో ఈనాటి వరకూ కవిత్వాన్ని రచిస్తూ బాహ్యాంతర చైతన్యాన్ని, సౌందర్య భీభత్సాల్ని ఒక దగ్గరకు చేర్చే అజంతా ప్రయత్నం నారాయణబాబు మార్గాన్ని సుగమం చేస్తోంది.

అధివాస్తవికత ఒక మానవ ఉద్యమం[2] (ఉద్యమం అన్న పదం రూఢమైన తాత్త్వికార్థంలో కాదు.) అది వ్యక్తుల నుంచి వ్యక్తులకు భగ్గున మండే జ్వాలగా సాహిత్యాన్వేషణగా కొనసాగుతోంది. మరికొందరిలో అప్రయత్న కృత్యంగా ఏదో ఒక

1. అజంతా ; కావ్యమాల : పుట. 3
(స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత) సాహిత్య అకాడెమీ 1984
2. అధివాస్తవిక ప్రభావాన్ని అంచనా కట్టడంలో కొన్ని ఇబ్బందులు ఎదురవ్వటం నిజం, తెలుగులో అది ఎప్పుడూ నిశ్శబ్ద ఉద్యమమే అయ్యింది. చేతన, యుగకవి శ్రీశ్రీ సంస్మరణ సంచిక.

కోణంగా రంగుగా భీభత్సంగా సాహిత్యాన్ని వెంటాడుతూనే ఉంది. వ్యవహారిక భాషను మరిచి గ్రాంధిక భాషను రాయటం ఎంతో కష్టం. అంతే కాదు అది కృతకంగా నిర్జీవంగా పేలవంగా తయారవుతుంది. అలాగే అధివాస్తవికాన్ని పూర్తిగా వదిలి కవిత్వాన్ని ఉన్నత ప్రమాణాలకు, సృజనాత్మక స్థాయికి తెసుకెళ్తానటం కూడా అంతే కృతకంగా, పేలవంగా, నిర్జీవంగా ఉంటుంది.

అధివాస్తవిక ఛాయల్ని పరిశీలించేందుకు ఈ మధ్యకాలంలో వచ్చిన కవిత్వాల్ని అందినమేరకు, మచ్చుకు కొన్నిటిని తీసుకుంటున్నాను.

ఉదా॥ 1. 'ఆరితేరిన సాలీడు అల్లుకుపోయిన
ఆకాశం గూడులో
చిక్కుబడి నెత్తురోడుస్తున్న
పురుగులాంటి సూరీడు[1]

—మూడోకన్ను

ఉదా॥ 2, ఎవరూ లేని ఆసుపత్రి గదిలో
చిరుగుల సిరిచాప మీద వెల్లకిలా
పడుకుని తిరుగుతున్న సీలింగు ఫ్యాను కేసి
చిత్రంగా చూస్తున్న పోలియో
పసిపాప కళ్లలో కదలాడే దీపాల్ని !
చూసి వుండరు[2]

—రాజకీయ రాసక్రీడాకారులు

1. దేవీప్రియ : అమ్మ చెట్టు, పుట. 7
2. దేవీప్రియ : అమ్మచెట్టు, పుట. 41

ఉదా॥ 3. ఎముకల్ని పట్టుకు వేలాడే బలహీనతలు
నరాల దండేల మీద
నిరంతరం వేలాడే మురికి రోగాలు;
ఇవే కదా భయాలు[1]

—ప్రాణ పరిమళం

ఉదా॥ 1. రుద్రాక్షమాల మెళ్లో వేసుకొచ్చిన ద్రాక్ష్యలా
నీ నమ్మకం మీదే స్థిరంగా నిలబడి
నీ మెడ నరాలు కొరికి నెత్తురు తాగుతుంది[2]

—నాదేశం

ఉదా॥ 2. అంతటా పరుచుకున్న శవంలాంటి శబ్దం
కొండ చిలువలా అక్షరాల్ని మింగేస్తుంది[3]

—రైలు

ఉదా॥ 1. మనసొక అంతులేని సారంగం
ఎంత తవ్వుతున్నా అడుగందదు
ఆఖరి క్షణాల్లో
తనని తనలోనే సమాధి చేసుకొంటుంది[4]

—మనసోపాఖ్యానం

ఉదా॥ 2. రూములో నన్ను నేను బంధించుకున్నప్పుడు
ఒంటరితనం నన్ను కౌగిలించుకుంటుంది

1. దేవీప్రియ : అమ్మచెట్టు, పుట. 44
2. హెచ్చార్కె : లావా. పుట. 32
3. ,, ,, 43
4. సుమనశ్రీ : రెప్పలమధ్య ఆకాశం, పుట. 20

# DECLARATION OF JANUARY 27, 1925 ★

WITH REGARD to a false interpretation of our enterprise, stupidly circulated among the public,

We declare as follows to the entire braying literary, dramatic, philosophical, exegetical and even theological body of contemporary criticism :

1) We have nothing to do with literature;

But we are quite capable, when necessary, of making use of it like anyone else.

2) *Surrealism* is not a new means of expression, oran easier one, nor even a metaphysic of poetry.

It is a means of total liberation of the mind *and of all that resembles it.*

3) We are determined to make a Revolution.

4) We have joined the word *Surrealism* to the word *revolution* solely to show the disinterested, detached, and even entirely desperate character of this revolution.

5) We make no claim to change the *mores* of mankind, but we intened to show the fragility of thought, and on what shifting foundations, what caverns we have built our trembling houses.

6) We hurl this formal warning to Society: Beware of your deviations and *faux-pas,* we shall not miss a single one.

7) At each turn of its thought, Society will find us waiting.

8) We are specialists in Revolt.

There is no means of action which we are not capable, when necessary, of employing.

9) We say in particular to the Western world: *surrealism*

exists. And what is this new ism that is fastened to us? Surrealism is not a poetic form. It is a cry of the mind turning back on itself, and it is determined to break apart its fetters, even if it must be by material hammers!

*Bureau de Recherches Surre'alistes,*
15, Rue de Grenelle

| | |
|---|---|
| LOUIS ARAGON | MICHEL LEIRIS |
| ANTONIN ARTAUD | GEORGES LIMBOUR |
| JACQUES BARON | MATHIAS LUBECK |
| JOË BOUSQUET | GEORGES MALKINE |
| J. A. BOIFFARD | ANDRE MASSON |
| ANDRE BRETON | MAX MORISE |
| JEAN CURRIVE | PIERRE NAVILLE |
| RENE CREVEL | MARCEL NOLL |
| ROBERT DESNOS | BENJAMIN PERET |
| PAUL ELUARD | RAYMOND QUENEAU |
| MAX ERNST | PHILIPPE SOUPAULT |
| T. FRANKEL | DEDE SUNBEAM |
| FRANCIS GERARD | ROLAND TUAL |

★ The History of Surrealism, Page No. 240, 241

## NOTES ON POETRY 

A POEM must be a debacle of the intellect. It cannot be anything but.

Debacle : a panic stampede, but a solemn, coherent one; the image of what one should be, of the state in which efforts no longer count.

In the poet:
the ear laughs,
the mouth swears;
It is intelligence, alertness that kills;
It is sleep that dreams and sees clearly;
It is the image and the hallucination that close their eyes:
It is lack and the lacuna that are *created*.

Poetry is the opposite of literature. It rules over idols of every kind and over realistic illusions; it happily sustains the ambiguity between the language of "truth" and the language of "creation."

Poetry is a pipe.

Lyricism is the development of a protest.

How proud a thing it is to write, without knowing what language, words, comparisons, changes of ideas, of tone are; neither to conceive the *structure* of the work's duration, nor the conditions of its ends; no *why*, no *how*! To turn green, blue, white from being the parrot . . .

We are always, even in prose, led and willing to write what we have not sought and what perhaps does not even seek what we sought.

Perfection
is *laziness*.

ANDRE BRETON AND PAUL ELUARD

*Notes sur la poesie* (*La Revolution surrealiste*, No. 12, December 15, 1929)

1931

## FREE UNION*

MY WIFE with her wood-fire hair
With her thoughts of heatsparks
With her hour-glass figure
My wife with her figure of an otter between the tiger's teeth
My wife with her cockade mouth, her mouth a bouquet of final stars.
With her teeth white mousetracks on the white earth
With her tongue of cloudy amber and ground glass.
My wife with her tongue of a pierced host.
The tongue of a doll that opens and closes its eyes
The tongue of incredible stone
My wife with lashes a child's writing stick
With eyebrows the edge of a swallow's nest
My wife with temples the slate of a hothouse roof
The panes misted
My wife with champagne shoulders
Shoulders of a dolphin-headed fountain under the ice
My wife with matchstick wrists
My wife with fingers of chance, ace-of-hearts fingers
With fingers of mown hay
My wife with armpits of marten and beechnut
Of Saint-John's Eve
Of privet and scalare's nest
With seafoam arms, arms of the mill-race
And a mixture of wheat and the mill
My wife with rocket legs
With movements of clockwork and despair
My wife with calves of elder marrow

My wife with initial feet
With feet of bunches of keys with feet of drinking caulkers
My wife with a neck of pearled barley
My wife with her *Val d'or* throat
Of the rendezvous in the very bed of the stream
With night breasts
My wife with breasts of a deepsea molehill
My wife with breasts of a ruby crucible.
With the breasts of the spirit of the rose under the dew
My wife with the belly a day's fan unfolding
The belly of a giant claw
My wife with a bird's back escaping upward
With a quicksilver back
A back of light
With a neck of crushed stone and wet chalk
And the fall of a glass from which one has just drunk
My wife with coracle hips
With hips of luster and arrow feathers
And stems of white peacock feathers
Of imperceptible swaying
My wife with buttocks of soapstone and amianthus
My wife with swansback buttocks
My wife with springtime buttocks
With gladiolus sex
My wife with the sex of placer and duckbill
My wife with the sex of algae and old dancy
My wife with a mirror sex
My wife with tear-filled eyes
With eyes of violet panoply and magnetic needle
My wife with savanna eyes
My wife with watery eyes to drink in prison
My wife with wooden eyes always under the axe
With eyes of water level air level earth and fire level

ANDRE BRETON (1931)

---

★ The History of Surrealism, Page : 283, 284

# HELLO ★

MY PLANE in flames my castle flooded with Rhinewine
My black iris ghetto my crystal ear
My rock sliding down the cliff to crush the gamekeeper
my opal snail my air mosquito
my bird-of-paradise eiderdown my black foam hair
my exploded grave my rain of red grasshoppers
my flying island my turquoise grape
my collision of wise and foolish autos my wild flower bed
my tulip bulb in the brain
my gazelle lost in a midtown movie house
my sun-nut my volcano fruit
my hidden pond laugh where the absentminded prophets go to drown
my flood of black-currant my mushroom butterfly
my blue waterfall like a lead blade that makes the spring
my coral revolver whose mouth attracts me like the eye of a shiny well
frozon like the mirror where you watch the flight of the birdflies of your stare.
lost in an exhibition of white framed in mummies
I love you

BENJAMIN PERET
*Je sublime (1936)*

★ The History of Surrealism, Page : 309

## HEAD AGAINST THE WALLS*

THERE were only a few of them
In all all the earth
Each one thought he was alone
They sang, they were right
To sing
But they sang the way you sack a city
The way you kill yourself.

Frayed moist night
Shall we endure you
Longer
Shall we not shake
Your cloacal evidence
We shall not wait for a morning
Made to measure
We wanted to see in other people's eyes
Their nights of love exhausted
They dream only of dying
Their lovely flesh forgotten
Bees caught in their honey
They are ignorant of life
And we suffer everywhere
Red roofs dissolve under the tongue
Dog days in the full beds
Come, empty your sacks of fresh blood
There is still a shadow here

## HEAD AGAINST THE WALLS

A shred of imbecile there
In the wind their masks, their cast-offs
In lead their traps, their chains
And their prudent blind-men's gestures
There is fire under rocks
If you put out the fire
Be careful we have
Despite the night it breeds
More strength than the belly
Of your wives and sisters
And we will reproduce
Without them but by ax strokes
In your prisons

Torrents of stone labors of foam
Where eyes float without rancor
Just eyes without hope
That know you
And that you should have put out
Rather than ignore

Wite a safety pin quicker than your gibbets
We shall take our booty where we want it to be

PAUL ELUARD
*Les Yeux fertiles (1936)*

★ The History of Surrealism, Page, 310, 311



Salvador Dali, Mae West



Salvador Dali, Apparition of Face and Fruit Dish on a Beach

# ఉపకరించిన గ్రంథాలు :


కృష్ణశాస్త్రి, దేవులపల్లి : కృష్ణశాస్త్రి వ్యాసావళి–1 రాజహంస ప్రచురణలు, 9, జగదాంబాళ్ స్ట్రీట్, మద్రాసు – 600 017, ఫిబ్రవరి 1982.

నారాయణరెడ్డి, సి ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు ప్రయోగములు, శివాజీప్రెస్, గంజ్ బజార్, సికింద్రాబాద్, 1967

నారాయణరావు, వెల్చేరు తెలుగులో కవితా విప్లవాలస్వరూపం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ — 4, 1978

రంగనాథాచార్యులు కె. కె (సంపాదకుడు) ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైద్రాబాద్ 1982

రఘునాథం. గుడిపాటి శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి' — కావ్య పరిశీలనం, శ్రీ కాకతీయ విశ్వవిద్యాలయానికి ఎం.ఫిల్, పట్టం కోసం సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసం–అముద్రితం

రామచంద్రారెడ్డి, రాచమల్లు, : సారస్వత వివేచన, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్ విజయవాడ–4, జులై 1976

రామచంద్రారెడ్డి, రాచమల్లు (అనువాదం) : కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక, పైచిరునామా, మాస్కో, 1981

మార్క్స్, ఎంగెల్స్ మూలం

లక్ష్మణరావు, ఉప్పల : ఆధునికాంధ్ర సారస్వతము, ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరు జిల్లా శాఖ, నవంబర్, 1983

శ్రీరామమూర్తి, కోడూరి : తెలుగు నవలా సాహిత్యంలో మనో విశ్లేషణ, కిరణ్ కిశోర్ పబ్లికేషన్స్, పోస్టాఫీస్ రోడ్ బొబ్బిలి, విజయనగరం జిల్లా, సెప్టెంబర్ 1979

శ్రీరాములు, గూడ : శ్రీశ్రీ అధివాస్తవిక ఉద్యమం — వ్యాసం
: చేతన, యుగ కవి సంస్మరణ సంచిక

శేషేంద్ర శర్మ, గుంటూరు : కవిసేన మేని ఫెస్టో. ఇండియన్ లాంగ్వేజస్ ఫోరం, జ్ఞాన్ బాగ్ ప్యాలెస్, గోషామహల్, హైద్రాబాద్, ఆగస్టు 1977

" " రక్తరేఖ (నా డైరీ) 1974

సుబ్రహ్మణ్యం, ఆకుల (ప్రధాన సంపాదకుడు) : శేషేంద్ర కావ్య భూమిక, చర్చలు, రేఖలు పై చిరునామ

స్వరూప కృష్ణమూర్తి, జె : కె. శివారెడ్డి, రక్తం-సూర్యుడు, పరిశీలన [అముద్రితం] శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి ఎం.ఫిల్., పట్టంకోసం సమర్పించిన విశ్లేషణ ప్రబంధం 1982

సుదర్శనం, ఆర్.ఎస్ : సాహిత్య నేపథ్యం-వ్యాసావళి, శ్రీమతి ఆర్ వసుంధరాదేవి, 8-241, సువిశేష పురం, రాజమండ్రి — 4 జనవరి, 1983

సోమసుందర్, ఆవంత్స : రుధిరజ్యోతిర్దర్శనం, పురిపండా ఎత్తిన పులిపంజా కళాకేళి ప్రచురణలు, పిఠాపురం — 533 450, 1981


## వ్యాసాలు:


అసురా : ఖండిత శిరస్సునుచేత ధరించిన కవి 'వైరాగి', 'సంతకాలు' శీర్షిక, 'ఉదయం' దినపత్రిక, 1985

గంగప్ప, ఎస్ : 'నారాయణబాబు నవకవిత'-భారతి, ఏప్రిల్ 1983

మానేపల్లి : 'దీపాన్ని వెలిగించిన కొవ్వొత్తి'-ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 11-10-85

రమణారెడ్డి, కె.వి. అభ్యుదయ సాహిత్యోద్యమం, సృజన, జూన్, జులై 1984
నారాయణబాబు 'మౌనశంఖం', అక్షర జగత్తు-శీర్షిక, 'ఆంధ్రప్రభ' దినపత్రిక, 19-3-1981

రామకోటిశాస్త్రి, కేతవరపు : పునరుజ్జీవన సంస్కరణ స్వాతంత్ర్యోద్యమాలు - చారిత్రక నేపథ్యం (అముద్రితం)

## కావ్యాలు


అజంతా : ఈ తరం యుద్ధ కవిత, కావ్యమాల (సంకలనాలు)

ఇస్మాయిల్ చిలకలు వాలిన చెట్టు

దిగంబర కవులు దిగంబర కవుల కవితా సంపుటి 1, 2

దేవీప్రియ అమ్మచెట్టు

బాలగంగాధర తిలక్, దేవరకొండ : అమృతం కురిసినరాత్రి

బైరాగి, ఆలురి : నూతిలో గొంతుకలు. ఆగమగీతి

మోహన్ ప్రసాద్, వేగుంట : చితి – చింత

రాయప్రోలు : ఆంధ్రావళి, జడకుచ్చులు

శివారెడ్డి, కె : భారమితి

శ్రీశ్రీ : మహాప్రస్థానం

సుమనశ్రీ : రెప్పలమధ్య ఆకాశం

సౌభాగ్య : సంధ్యా బీభత్సం

హెచ్చార్కె : లావా


## ఇంగ్లీషు గ్రంథాలు :


Aesthetics And the Development of Literature
"Social Sciences Today" Editorial Board USSR Academy of Sciences, MOSCOW, 1978

Barabash, Yuri : Aesthetics and poetics
Progress Publishers, MOSCOW 1977

Coomara Swamy. A K. : Art of India,
The Dance of Siva.

Christopher Caudwell : Illusion and Relaity, People's Publishing House, New Delhi 1956

Cherny Shevsky, N. G. : Selected Philosophical Essays
Foreign Languages Publishing House Moscow 1953

Day Lewis, C : The Poetic Image
Jonathan Cape
Thirty Bed Ford square London 1965

Howard Fast : Literature and Reality, Peopel's Publishing House Ltd., New Delhi March, 1955

Sir John Wood Roffe : The Garland of Letters, Publishers. Ganesh & Company 1974

Krishna Murthy, J : Tradition and Revolution, Published by WH Patwardhan,Orient Longmanltd 3/5 Asaf Ali Road, New Delhi, 1972

Kulikova, i, Zis, A (Editors) : Marxist Leninist Aesthetics and Life A Collection of Articles, Progress Publishers, Moscow 1976

Lauzun, Jerard : Sigmund Freud The man and his Theorems

Maurice Nadeau : The History of Surrealism
Translated from French: Jonathan Cape
by Richard Howard : Thirty Bedford Square, London 1965

Nelson (Editor) : The Story of our Heritage 'Fine Art' by : V. M. Hillyer and G. Huey, by : Meredith Company, Newyork 1966

Ovecharnenko, A : Socialist Realism and the Modern Literary Process, Progress Publishers, Moscow 1978

Oizerman, T : The Making of the Marxist Philosophy Progress Publishers, Moscow 1981

Roger Fowler (Editor) : A dictionary of Modern Critical Terms Routledge & Kegan Poul, London and Boston 1973

Sartre, Jean-Paul : The Psychology of Imagination, Methuen & Co. Ltd., London 1972

Shcherbina, Vladimir : Lenin and problems of Literature, Progress Publishers, Moscow

Zis, A : Foundations of Marxist Aesthetics Progress Publishers, Moscow 1977

Frolov, i (Editor) : Dictionary of Philosophy, Progress Publishers, Moscow 1984

— : Encyclopaedia of Britanica ix

: Encyclopaedia of Americana, Volume26

# MOUNASANKHAM

C. P. BROWN

**- Jupalli Premchand**

"ప్రేమ్‌చంద్ కన్నా ముందే కొంతమంది నారాయణబాబును వ్యాఖ్యానించారు, విశ్లేషించారు. సి. నా. రే, వెల్చేరు వంటి సాహిత్య చరిత్రకారులు నారాయణబాబును పరిచయం చేశారు. సోమసుందర్ 'రుధిర జ్యోతిర్దర్శనం' అముక్తమాల్యదకు వేదంవారి వ్యాఖ్యానం లాంటిదే. పాఠకుల్ని దూరంగానే వుంచుతుంది. ప్రేమ్‌చంద్ నారాయణబాబును సాధ్యమైనంత సులభంగా వ్యాఖ్యానించడానికి చేసిన ప్రయత్నమే మౌనశంఖం."

— రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి

"గొప్ప కళాకారులు ఎప్పుడూ వాళ్ళు సృజించిన వాటినుంచి అనామకంగా, నిర్లిప్తంగా వుండాలని ప్రయత్నించారు. దేన్నో వ్యక్తిగతంగా ఆశించకుండా దూరంగా వుండటమే చేశారు. తాము పొందిన అనుభవాన్ని అర్థం చేసుకోవాలని వ్యక్తిగా ఆరాధించకండని చెప్పారు. అదే జరిగితే జీవన స్పృహ వెలుగుగా వుంటుందని తెలియచెప్పారు. అంతేకాని, ఆ అనుభవాన్ని వ్యక్తిగా ఆపాదించుకొని పేరుకోసం, పొగడ్తలకోసం, స్థానంకోసం, టైటిళ్ళకోసం, ఆపాదించుకోవటంకోసం ప్రయత్నించలేదు. ఈ స్పృహ మన తెలుగు కవులకూ కనీసం విమర్శకులకయినా బొత్తిగాలేదు. అందుకే శ్రీ శ్రీ కన్నా గొప్పవాళ్ళమని చెప్పుకోవటం. లేదా అంత గొప్పవాడుకాదని చెప్పటం; లేదా తగ్గించుకోవటం, లేదా శ్రీ శ్రీ స్థానాన్ని ఖాళీపడిన వుద్యోగంగా అభివర్ణించటం – వాటిమీద చర్చలూ, వాదాలూ, సమర్థింపులూ ఈ రోజుకూ చోటుచేసుకొంటున్నాయి. అలాంటి అనారోగ్యాన్ని ఎక్కువగా ప్రదర్శించనందుకు రచయితను అభినందిస్తున్నాను."

— కె. శివం. రాయుడు

*For Copies :*

LITERARYMEET, 2/202 IIIrd Road,
*ANANTAPUR*—515004.